ఇతర సంస్కృత ప్రహసనములు:

జగదీశ్వరుని హాస్యార్ణవము మరొక ప్రసిద్ధ ప్రహసనము. భానుకప్రహసనము, నాటకనాటక ప్రహసనము మొదలైనవి— ప్రాచీనముగా [illegible] కొనివికూడా కొన్ని కొన్ని ఉన్నవి. ఇక—లటకమేళకాదులు కేవల వినోదన దృష్టితో రచింపబడిన ప్రహసనాలు. వేశ్యలు, ఆ వేశ్యలకొరకు విటుల ఉపద్రవాలు, సురాపానము, జూదము మొదలైన అంశాలతో ఇవి నిండి ఉన్నవి. కాళిదాసుని కంటగట్టబడిన లంబోదర ప్రహసనమువంటివి మరింతబండబూతులకు, అశ్లీల శృంగారమునకు నిలయాలుగా ఉన్నవి. మొత్తముమీద సంస్కృతప్రహసనాలలో కపట కపట మహాచార్యులను పరిహసించుట ఎక్కువగా కనిపించును.

షడ్విధహాసములు

ప్రహసనానికి ప్రధానరసమైన హాస్యము రెండువిధములు— ఆత్మస్థము, పరస్థము అని స్వయముగ తానే నవ్వినచో ఆత్మస్థము; పరుని నవ్వించినచో పరస్థము. నవ్వు ఆరువిధములు: 1. స్మితము, 2. హసితము, 3. విహసితము, 4. ఉపహసితము, 5. అపహసితము 6. అతిహసితము—అని. దంతములు పైకికనిపించకుండ కన్నులలోను,కపోలములలోను వికాస మేర్పడునవ్వు స్మితము.కొంచెముగా దంతములు పైకి కనవచ్చునవ్వు హసితము. మధురమైన రవముతో కిలకిల నవ్వినచో విహసితము. తల వణకించుచు నవ్వెడి నవ్వు ఉపహసితము. కళ్ళవెంట నీరు వచ్చునట్టి నవ్వు అపహసితము. క్రిందబడి పొర్లుచు పెద్దపెట్టున నవ్వెడి నవ్వు అతిహసితము. ఈ ఆరువిధాల నవ్వులలోను స్మిత, హసితములు ఉత్తమ ప్రకృతికి, విహసిత, ఉపహసితములు మధ్యమ ప్రకృతికి, అపహసిత అతిహసితములు అధమ ప్రకృతికి యోగ్యములయినవి.

తెలుగులో ప్రహసనములు:

నాకు తెలిసినంతవరకు భగవదజ్జుకము, మత్తవిలాసము మాత్రము కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే ఆంధ్రీకృతము లయినవి. కాని, ప్రాచీన సంస్కృత సంప్రదాయానుగుణముగా తెలుగులో స్వతంత్ర ప్రహసనాలు వెలసినట్లు తోచదు. అలంకారిక లక్షణ లక్షితములు కాకపోయినను, హాస్యరస ప్రధానములు, సాంఘిక దురాచార విమర్శకములు అగు ప్రహసనా లనేకములు— కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు వ్రాసినవి— ఉన్నవి. సంఘసేవాదీక్షితులైన పంతులుగారి చేతిలో ప్రహసన మొక బలవదాయుధమయినది. వ్యక్తుల దౌర్బల్యాలను, మనోవక్రతలను బృహత్కరించి చూపుటవలననే కాక, సన్నివేశ రచనా చమత్కారము ద్వారా కూడ పంతులుగారు హాస్యము సాధించినారు. 'విచిత్రనాటక ప్రహసనము' విందుకు నిదర్శన ముగా పేర్కొనవచ్చును. ఆగామాయహార ప్రహసనము, అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము, మహామహోపాధ్యాయ ప్రహసనము, బలాత్కార గానవినోద ప్రహసనము—ఈ విధముగా వీరియన్ని ప్రహసనాలకు అర్థవంతముగా నామకరణము చేసినారు. ఈ ప్రహసనాలలో వచ్చే వృద్ధవ్రతులు, [illegible], సాహాస వన్తు, తిమ్మయ్య, సంగీతరావు మున్నగు వ్యక్తులుకూడా అన్వర్థ నామధేయులు.

కీ. శే. గురజాడ అప్పారాయు కవి వ్రాసిన కన్యాశుల్కము, కొండుభట్టీయము కూడా అలంకారిక లక్షణాలకు సరిపడకపోయి నను,—ప్రహసన ప్రధానలక్షణమగు హాస్యప్రాధాన్య ముండుటచే —ప్రహసన శ్రేణిలోనే చేరును. గురజాడ కవి హాస్యము విశిష్టమైనది. అతిశయోక్తిలేకుండ సాధారణముగ హాస్యమును సాధించుట దుష్కరము. కాని, గురజాడకవి స్వభావోక్తిలోనే వినోదకముగ ఉపదేశకముగూడ అగు ఉత్తమహాస్యము సాధించినాడు. శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు 'అప్పుడు,' 'ఇప్పుడు,' 'ఎప్పుడు,' 'రెండురెళ్లు నాలుగు' మున్నగు సంపుటాలలో ప్రచురించిన రూపకాలుకూడా ప్రహసన పద వాచ్యములే అగును. కాని, ఇవి పూర్తిగా పాశ్చాత్య సంప్రదాయాను గుణములు. చాలా భాగ మిందు ఫ్రెంచి నాటకకవి మోలియర్ రచనల కనువాదములో, అనుసరణములో! ఇవి పూర్తిగా అతిశయోక్తి ప్రచురములు. "ఒసేవ్, పెళ్ళాం! నువు కొంచెం నోరు తగ్గాలి!'— వంటి అసహజ సంభాషణలు వీటిలో ఎక్కువగా కనిపించును.

ఉపసంహారము:

ఎన్ని చెప్పినను—హాస్యము శృంగార, కరుణములవలె ప్రగాఢమైన రసముకాదు. అందుచే అట్టి హాస్య మంగిగాగల ప్రహసనము సద్యః పర నిర్వృతి కరమైన ఉత్తమ సాహిత్య విభాగము కాజాలదు. అయినను - అభ్యుదయమార్గములో మాత్రము ప్రహసనమంతటి ఉత్తమ సాధనము మరొకటి లేదు. సాంఘిక, రాజకీయాది రంగాలలోని దురాచారాలను పరిహసించి, ప్రజలకు స్వస్వరూపజ్ఞానము కలిగించుటలో అత్యంత శక్తిమంతమైన ప్రహసనము నేటిసాహితీపరుల వలన్య సమాదర ణీయము.

భగవదజ్జుక, మత్తవిలాసాది ప్రాచీన సంస్కృత ప్రహసనాలలోని శిల్పసంప్రదాయాదులను లెస్సగా అవగత మొనర్చుకొని, ప్రస్తుత కాలానుగుణముగా ప్రహసనమును పునరుద్ధరించినచో—ఈనాడు భారతదేశములో పరివ్యాప్తమైయున్న అసత్య వాతావరణమును నిర్మూలించి, ఆధునికరచయితలు భారతీయులను కార్యోన్ముఖులను చేయగలుగుదురనుట నిస్సంశయము!

# అసలు కారణం

శ్రీ వేమూరి వేంకట రామనాథం

“అసలు, ఆమెకు ఇష్టంలేదు మొదట్లో—అదిగో, వస్తో, బస్సు ఆగింది. శంకరంగారు వస్తున్నారు, కొంచెం వెళ్ళి—”

సరోజని ఒక్క గంతున బస్సుదగ్గరకు పోయింది, శంకరాన్ని తోడ్కొనిరావటానికి.

“మగనం లోనికి శోభాంపద సుందరం” అంటూ శర్మ అందంగా అన్నీ అమర్చిన హాలులోనికి త్రోవతీశాడు.

సరోజని అంతకుముందు శంకరాన్ని చూడలేదు. అతను కూడ ఆమెను చూసి ఎఱుగడు. ఎవరో బస్సు ఎక్కటానికి పరుగెత్తి వచ్చిన పిల్లవంక చూసినట్లు చూశాడు, నవ్వీ నవ్వనట్లు. ఆమె “నమస్తే” అంటూ అతని వెనుకనే రావటంచూసి, ఆమెకూడ ఆనాటి పార్టీకి చెందిన దేనని నిర్ణయించుకున్నాడు.

“నమస్తే, నా అదృష్టమండీ, మీలాంటివారి పరిచయం కలటం—”

సరోజని కనులు పైకెత్తకే, “ఇది నా అదృష్టమూ—”

“అనుకుంటారు, అంతేనా” అంటూ పెద్దగా నవ్వి ఆమె వంక చూశాడు, ఆమె కూడా తన పరిహాస కోలాహలంలో మునిగి తేలుతుందన్నట్లు.

ఆమెకు నవ్వు రాలేదు. అప్పటికే శర్మ పోర్టికోలో నిల బడి, “హల్లో హల్లో, శంకరంగారు, రండి—మిత్రులను లోపల కూర్చోపెట్టటంలో మీ బస్సుదాకా రాలేకపోయినాను—”

“ఫరవాలేదు, మీ తరఫున ఈమె వచ్చింది, ఎంత చాకచక్యంగా మాటాడగలదండీ!” అంటూ ఆమె వంకకు తిరిగాడు, ఆమె అప్పటికే పదడుగుల దూరంలో ఉన్న లలితను తీసుకు వస్తోంది చేతిలో చేయివేసికొని.

“ఇదిగో లలిత, సరిగా టైంకు వచ్చింది దొరసానిలాగా” అందరు నవ్వుతూ లోపలకు వెళ్ళారు.

మధ్య టేబిల్ మీద ఒక చక్కని రజతపాత్ర...తళతళ మెరుస్తున్నది. సుందరం దాని అందం గమనిస్తూ అన్నాడు, “శర్మా, సాధారణ ప్రజలని మన మనుకుంటామే, వారి భక్తి భావం, వాత్సల్యం నిజంగా వర్ణనాతీతమోయి.”

“కాకపోతే, మేమిది కావాలని కోరామా, మా ధర్మం మేము నిర్వర్తిస్తున్నామన్న భావంతో మాకు చేతనైన రీతిగా వారికి వయోవిద్య గరపాము. అంతేగదా. మేము వారికి కలిగించిన నూతన నోత్తేజానికి ఇది కృతజ్ఞతా చిహ్నమట! వద్దంటే విన్నారుకారు—”

ఒంటరిగా ఒకమూల నిలబడిన లలితను భుజంమీద తట్టుతూ, సరోజని అన్నది, ‘ఎలాఉన్నది లలితా, ఆ...పాత్రమీద పూలు నీ జాకెట్టుమీద కుట్టిన పూలకన్న బాగున్నాయా ?”

లలిత అన్నది, “నీకు జాకెట్టుమీద పూలంటే ఇష్టంలేదు నిజమే కాని, మీరుచేసిన పనికిమెచ్చి మీ కిచ్చిన బహుమానం మీద పూలయినా నీకు అందంగా ఉంటాయా సరోజనీ ?”

శర్మ అందుకున్నాడు, “నీకు తెలుసో తెలియదో, లలితా అసలీ సరోజనికి మాతోపాటు మొదట్లో వయోజనవిద్యా— ఉద్యమంలో కలిసి పనిచేయటం ఇష్టమే లేదు.”

“మీ సరోజని నాకు క్రొత్తా ? కాని ఇంతధైర్యం ఎలా వచ్చిందా అని మాత్రం—ఏం సరోజనీ, స్త్రీలంత ధైర్యంగా ముందుకు రావమ్మనా” అంటూ నవ్వింది.

శంకరం పెద్దపెట్టున నవ్వుతూ, “మీ వంటి వారుంటేగాని పార్టీలు ఆనందంగా గడిచిపోవండీ” అంటూ లలితను దరిచేరాడు. లలిత వానిచేతికి కూల్ డ్రింక్ ఒకటి అందించింది.

సుందరం తనగ్లాసు పైకెత్తి “ఈ ఊరిలో గొల్లపాలెంలో వయోవిద్యను గరపుతూ 300 మందికి అక్షరాస్యతను ప్రసాదించిన శర్మకు, అతని మిత్రవర్గానికి మన అభివందనాలు” అంటూ శర్మ చేతిలోని గ్లాసుకు తగిలించాడు.

లలిత సాండ్విచ్లున్న ప్లేటు అందరకూ అందిస్తూ, “ఇవి నీవే చేశావా సరోజనీ” అన్నది.

సరోజని ఒక్క త్రుటిలో నవ్వు, నవ్వుసుతరమైన ఆశ్చర్యం, చూపుతూ, “నేను ఇంతకుముందే వచ్చాను మా యింటినుంచి” అంది.

సుందరం, శంకరం శర్మ చూపించె ఫొటోలను ఉత్సాహంతో చూస్తున్నారు. ప్రక్కనేఉన్న గ్రామఫోను రికార్డుల మీదకు వారిదృష్టిపోయింది. అవన్నీ ఒక్కొక్కటి తీసిచూశారు. చివరకు సుందరంఅన్నాడు, “శర్మా, మొన్నటి తెలుగు రికార్డు లేమయినాయి ? చాల బాగున్నాయి !”

‘అవి మనవికాదుగా శేషుదగ్గరనుంచి తీసుకువచ్చాను. చాలా బాగున్నాయి కాదు?”

“ఊ అవి మా కంపెనీకి కొన్నా బాగుండు ననుకొంటాను. అవి ఇప్పుడు తెప్పిస్తే బాగుంటుందోయి చక్కనిపాటలు—”

అవును చక్కని పాటలే, తెప్పిస్తే బాగుంటుంది. శర్మ తటాలున సరోజనివంక చూశాడు. సరోజని తన మఫ్లర్ మెడకు చుట్టుకొని, “నేను వెళ్ళి తీసుకువస్తానండీ” అంటూ వీధివైపు బయలుదేరింది.

లలిత మూలకుర్చీమీద జతికిలపడింది. మెల్లగా అన్నది, "మీరు తప్పక వస్తారనుకొన్న సుందరంగారు రానేలేదు."

శర్మ అన్నాడు "అంతేకాదు, నేను అంతకన్న ముఖ్యంగా కోరుకుంటున్న సరోజకూడా రాలేదు. ఆమె ఆరోగ్యం ఎలా ఉన్నదో ఏమో."

లలిత నిశ్శబ్దంగా కూర్చునివుంది. శర్మ ప్రారంభించాడు, "ఇరవైరోజులనుంచి కనపడనేలేదు సరో. ఇందుకొచ్చి యింత సందడిగా కార్యక్రమం గడిచినా నాకేదో లోటు జరిగినట్లే ఉన్నది."

లలిత అన్నది, "అవును ఎవరిమీద వాత్సల్యం మిక్కుటంగా ఉంటుందో వారు రాకపోతే అలానే అనిపిస్తుంది శర్మగారూ. ఇంతకు మీరు ప్రేమించినంతగా మిమ్మ ప్రేమించే ఆ సరోజ రాకపోయే కారణం ఏముంటుంది?"

"ఏమో" అంటూ శర్మ నిట్టూర్చాడు. లేచి అటు ఇటు మెల్లగా నడిచాడు. కిటికీలోనుంచి బైటకుచూస్తూ అన్నాడు, "లలితా, నీతో ఈ విషయం ప్రస్తావించటం అనుచితమని నాకు తెలుసు. అయినా—"

"అలా అనకండి శర్మగారు. మీరు నాతో ఏవిషయమైనా—"

"విను లలితా. ఆమె రానికారణం నేను ఊహించగలను. తాను తప్పక వస్తుందని ఆశించిన ఉద్యోగం తనకు దక్కనందువల్ల ఎంతో చిన్నబోయి విచారిస్తూ ఉంటుంది."

లలిత తలవంచుకొని "కావచ్చును" అంటూ రుమాలుతో చెక్కిళ్లు తుడుచుకున్నది. శర్మ అటు తిరిగి ఆమెను సూక్ష్మంగా గమనించి అన్నాడు "లలితా ఆమె ఉద్యోగం మాట ఎత్తితే నీ ఉద్యోగప్రాప్తినిగురించి ముచ్చటించినట్లు అవుతుందిగదా. ఇంగుకే నేనెంతో జంకి యీ విషయం స్పృశించాను"

"ఫరవాలేదు. కాని నాకే ఉద్యోగం ఎందుకు వచ్చిందో మాత్రం నేను చెప్పలేను"

"పోనీ మాసరో కెందుకు రాలేదో చెప్పగలవా?"

లలిత తటాలున తలెత్తి శర్మవైపు చూసింది. ఈ ప్రశ్న అనుకోనంతటిహఠాత్తుగా సూటిగా తనహృదయానికి తగిలింది. శర్మ కన్నులు రెండు ప్రశ్నా సూచకంగా ఆరనిదీపాల్లా వెలిగినాయి.

లలిత మెల్లగా అన్నది "మీ ప్రశ్న అంత సులభంకాదు సమాధానం" తనచేతిసంచి తీసుకొని పనిట అలవాటుగ సర్దుకుంటూ "నన్ను పోనీయండి" అంది.

తాను ఊహించనంత గంభీరంగా కనపడింది. ఈ విషయమంతా. శర్మ అన్నాడు, "లలితా, క్షమించు. నీకు కష్టం కలిగే సమాధానం ఇమ్మని నేను నిర్బంధించనులే"

లలిత తటాలున పలికింది, "నాకుకాదు, మీకు కష్టం కలుగవచ్చునని నా భయం."

"నాకా? క్షమించు లలితా, వినవలెనని నాకు కుతూహల మవుతోంది." చెప్పులలితా, చెప్పవూ."

లలిత తన చేతిసంచీ తిరిగి టేబిల్‌మీద పెట్టింది. పమిట అంచుతో కనుకొదలు తుడుచుకుంటూ, "కాని నేను మాత్రాయనా విన్నదే సుమా, ఇదే రూఢియైన సత్యమని మీరు అనుకోనక్కర లేదు," అన్నది.

శర్మ ఆశ్చర్యంతో "చెప్పు లలితా" అంటూ తొందర చేసినాడు.

"కాని ఒక్క షరతు"

"అంగీకరిస్తున్నాను, చెప్పు లలితా."

"మీరి విషయంగూర్చి సుందరంగారిని అడగకూడదు, వారేలో అసలీ విషయం ఎత్తనని వాగ్దానంచేయాలి."

శర్మకు మరింత ఆశ్చర్యం కలిగింది "సరే" నన్నాడు.

"నేను విన్నదేది. సుందరంగారికి సరోజని మీ వర్గంలో కలసి వయోవిద్యాధ్యాపన చేయటం ఇష్టంలేదట. ఎందువలననో నాకు తెలియదు. నన్ను అడగకండి. అందువల్ల ఆమెకు ఉద్యోగం ఈయలేదట."

శర్మ ముఖం ఎఱ్ఱబారింది. కదిలికలేని కన్నులు విప్పుతూ, "నాతో కలసి వయోవిద్య గరపడమేనా? నా సరోజనిలో ఇనోక దోషం కనిపెట్టాడా?"

లలిత నిశ్చలంగా పలికింది. "నాకింకేమీ తెలియదని, నన్ను ఈ ప్రశ్నలువేసి లాభంలేదని మొదటనే చెప్పాను."

"ఇదంతా సరోజనికి తెలుసునా?

"తెలుసు ననుకుంటాను."

"నమ్మి ఉంటుందా?"

"ఏమో మీ సరోజని హృదయం మీకు తెలియాలి శర్మగారు."

శర్మ ముఖంమీద ఆలోచనా మేఘాలు నిండుకున్నాయి. కన్నులోపల కన్నీటితోనాయి. నిట్టూర్పులలో తల కదల్చుతూ, మెల్లగా అన్నాడు "సరో నవ్వి ఉండాలి ఈ కారణం విని."

లోపల నవ్వుకున్నదేమో కాని పైకిమాత్రం పొంగివచ్చే దుఃఖాన్ని అణుచుకోలేక వ్యాకులపడింది. "నేను చూశాను......" అంటూ లలిత ఆనాటి సాయంత్రం జరిగినదంతా వర్ణించసాగింది.

శర్మ ఎడతెగని ఆలోచనా తరంగాలతో ఈదుతున్నాడు, దారి తెన్ను లేనట్లుగా. సుందరం నిజంగా అలా భావించి వుంటాడా? మరి ఆ సరోజనికి ఉద్యోగం ఇస్తానని ముందు గట్టి మాట ఎందుకు ఇచ్చిఉంటాడు? ఇంతకన్నా ముఖ్యమైన ప్రశ్న: సరోజని ఈ కారణం విశ్వసించి ఉంటుందా? ఏమో తన కార్యక్రమములో పాల్గొని ఉద్యోగం పోగొట్టుకొన్నానని నమ్మి ఉంటుందా? పరుపెత్తుకుపోయి ఆమెను ప్రశ్నిస్తే?

కాని ప్రశ్నించి ఏమిలాభం? తన సరో తనకు తెలియదూ, "ఇది నిజమంటారా" అని తననే అడుగుతుంది. "ఇది విశ్వసించకు సరో, అసలు సంగతి క్రమంగా బైటపడవచ్చును" అని తాను చెప్పవచ్చును. కాని, అది తెలుసుకునే మార్గమేముంది?

ఒకే మాసం. సుందరాన్ని పోయి అడుగవచ్చును. సుందరం తన చిన్ననాటి స్నేహితుడు. సుందరం ఆసాయంత్రం రావలసినా రాలేదు. అవును. మొగుడు వెళ్లిఉంటాడు. ఏమైనా, ఏదైనా తొందర పనిఉండి రాలేకపోయినాడేమో. సుందరం తనకు క్రొత్త వాడు కాదుకదా. పరిగెత్తుకుపోయి అడిగితే—అవును. "లలితా, నీను, ఇదెంతవరకు నిజమో నీకు సరిగా తెలియదుగా" అన్నాడు.

"తెలియదు."

"ఇది తెలిసికొనే పూర్తిచేయకుండ. నేను పోయి సుందరం గారిని అడుగుతాను."

లలిత దీర్ఘంగా నిట్టూర్చి, కళ్లు కొంగులో విసరగొట్టుంటూ, కుర్చీకి పూర్తిగా చేరగిలపడి అన్నది, తొందుకు తని గొంతుతో: "శర్మగారు, మీరు నాకిచ్చిన మాట ప్రకారమే మనసులోని మీకే ఉదంతమంతా వెలిబుచ్చాను. మరిచారా మీ మనస్థితిలో?"

శర్మకు సిగ్గువేసింది, క్షణంక్రింద తాను చేసిన వాగ్దానం తన మనశ్చాంచల్యంలో విస్మరించినందుకు. "క్షమించు లలితా, నన్ను నమ్ము. నే నెన్నడు ఈ విషయం సుందరంతో ప్రస్తావించను. సుందరంతో నే కాదు; మరెవ్వరితోను కూడా. మా సరోజకు రాని ఉద్యోగం ఇది తెలుసుకోవటంవల్ల రాదుగదా. కాని నీ వొక సాయం చేయాలి."

లలిత నవ్వుతూ అన్నది "ఏమిటి శర్మగారు? మీకేమయినా చేయగలను."

"నీ పుట్టినరోజు పండుగకు నేను రావాలంటే ఒక షరతు."

"బాగుంది. మగవారుకూడా షరతులు పెడతారా?"

"విను. సరోజను చూసి చాలా రోజులయింది. ఆమెను తప్పక రప్పించు."

"అలాగే. అసలు నాకు మీ ఇద్దరనే పిలుస్తున్నాను."

"నేను రమ్మన్నానని ప్రత్యేకంగా చెప్పు లలితా."

"అలాగేనండి. లలిత పుట్టిన రోజుకు శర్మగారు నిన్ను లలిత యింటికి ప్రత్యేకంగా ఆహ్వానిస్తున్నారని నొక్కి వక్కాణిస్తాను లెండి." లలిత నవ్వుతూ చెతిసంచి గిరగిర త్రిప్పుకుంటూ బైటకు నడిచింది. మర్యాదకు శర్మకూడా నవ్వులు కురిపించాడే కాని, మన సంతా వేసవి ఎడారివలె రేగే ఆలోచనలతో సందేహాలతో మండి పోతోంది.

*　　*　　*　　*

లలితకు ఆనందంగానే గడిచింది కాని ఆ సాయంత్రమంతా శర్మకు మాత్రం బరువుగా దిగులుగా తోచింది. తన పుట్టిన రోజును అభినందిస్తూ, మిత్రులు పంపిన బహుమతులన్నీ శర్మకు చూపింది. ఒక్కొక్కటి వివరంగా వర్ణిస్తూ ఆ మిత్రులనుగూర్చి వెనుకటి ముచ్చటలవీ యివీ చెపుతూ కాలం బుచ్చింది.

"ఇంతకు నేను కట్టుకొన్న చీర ఎవ రిచ్చారు చెప్పండి శర్మ గారు." ఈవేడుకప్రశ్నల నానందించే స్థితిలో లేడు శర్మ. మెల్లగా అన్నాడు "నాకేం తెలుసు? నేను మాత్రం కాదు."

లలిత నవ్వుతూ దగ్గరకు వచ్చి, "చూడండి, యీ పవిట అంచు ఎంత అందంగా ఉందో. ఈ చీరలు, వాని మధ్య మధ్య పువ్వులు—"

"అవును, ఇప్పుడు గుర్తు వచ్చింది. ఆనాడు సరో అంటోంది కదూ నీకు పువ్వుల చీరెలు రవికలు ఉంటే చాల సరదా అని. బహుశా సరో పంపి ఉంటుంది."

"కాదు, శంకరంగారు" అంటూ అప్పుడే వచ్చిన పాకెటు ఒకటి విప్పుతూ, "ఇందులో ఏముంటుంది చెప్పుకోండి" అన్నది.

ఏమి చెప్పాలో తెలియని శర్మకు ఏమిటిగా నిలబడి, "చూడండి, నేను చెపతాను. ఇందులో ఒక జాకెట్టు గుడ్డ ఉంటుంది."

"అవును, పాకెట్ చూస్తే అలాగే ఉం, చిన్నదిగా, తేలికగా—"

"అయితే ఏ రంగుదో చెప్పండి?"

"నీకు అందం కూర్చు రంగు."

"అంటే—" అంటూ లలిత పాకెట్ విప్పింది. అతి సుందరమైన నీలిరంగు జాకెట్టుగుడ్డ ఉంది. అది చూస్తూనే శర్మ కన్నులవెంట రెండు వేడి కన్నీటిబిందువులు కారినాయి. అలాటిదే తాను సరోకు తెచ్చియిచ్చాడు; ఆ జాకెట్టు ఉద్యోగం వచ్చిన మరునాడు ఆమె ధరించి తనయొద్దకు రావలసిన అదృష్టం దూరమయి పోయింది.

తలవని తలంపుగా అన్నాడు "ఇది బహుశా సరో పంపించి ఉంటుంది. ఆమె కీరంగు చాలా యిష్టం."

"క్షమించండి శర్మగారు, మీకి రోజంతా సరోజను నామ స్మరణగా ఉన్నదే—"

"ఆమె తప్పక వస్తుందన్నావు కదూ?"

"మీరు వస్తున్నారని, మీరు ప్రత్యేకం ఆమెను రమ్మని కోరారని కూడా చెప్పాను."

శర్మకు ఎప్పటికన్న ఆరాట మెక్కువయింది. ఆవేశంతో అన్నాడు "లలితా చూడు మీ కుర్రవాడిని పంపుదాము సరోజని యింటికి. పోయి పిలుచుకురమ్మని చెపదాము."

"తప్పక" అంటూ లలిత కుర్రవాడిని పిలిచింది. వాడు ఒక్క గంతున బైటకు ఉరికాడు.

శర్మ కొక ఆలోచన తట్టింది. కుర్రవాడిని పిలిచి ఒక చీటి వ్రాసియిచ్చాడు, తాను ప్రత్యేకంగా రమ్మన్నట్లు.

లలిత తన బహుమతులలోగల వింతలన్ని వర్ణిస్తోంది. చల్లారు తున్న తేనీరు పారపోసి వేడి టీ పోస్తోంది. శర్మ మనసంతా మాత్రం ఆ కుర్రవాడిమీదుంది.

కుర్రవాడు పరుగెత్తుకు తిరిగివచ్చాడు. శర్మ ఆత్రంగా అడిగాడు. "ఏం వస్తోందా?"

"లేదండీ. అబ్బ...ఆ యిల్లంతా ఎలా ఉందండీ! ఎవరైనా మాత్రం ఎలా రాగలరండి?"—

శర్మకు అర్థంకాలేదు. లలిత అన్నది "సరిగా చెప్పరా, అసలు సంగతేమిటి?"

"సామానులన్నీ చిందరవందరగా పడేయున్నాయంట, అమ్మగారూ, అదే పనిగా సర్దుతున్నారు."

శర్మ అడిగాడు, "మరి నా చీటి ఇచ్చావా?"

"చూసుకున్నారు బాబూ, ఈ సర్దటం పూర్తి అయితేగాని కదలనన్నారు."

"ఎంతసేపు పడుతుందో యింకా—" అంటూ శర్మ తన గడియారంవంక చూసుకున్నాడు.

కుర్రవాడు అన్నాడు, "రేపు ప్రొద్దునదాకా కాదటండీ."

లలిత అన్నది "ఇక ఈ సాయంత్రం ఇక్కడకు రానట్లే."

"పోని నేనే అటుపోతే—" అంటూ శర్మ లేచాడు చేతులు తుడుచుకుంటూ.

కుర్రవాడు వంటింట్లోకి జారుతూ మెల్లగా అన్నాడు "ఏమో, ఈ సామాను సందడిలో ఎవరైనా వచ్చినా చాలా సిగ్గుగా ఉంటుంది అనుకుంటూ తెగ సర్దుతున్నారండీ సరోజనమ్మగారు."

శర్మ కేమీ తోచడంలేదు. ఇంతలో బైట కారు ఆగింది హారన్ అదేపనిగా మ్రోగుతోంది. లలితకు తెలుసు శంకరం వచ్చాడని, తననారాత్రి సినిమాకు తీసుకుపోవటానికి.

లలిత బైటకు నడిచింది, శర్మకూడా వెంట వెళ్ళాడు. వెనుకకు తిరిగి లలిత వడివడిగా అన్నది, "శర్మగారు, రెండు రోజులలో నేను పోయి కనుక్కుంటాను. సరోజని నాకూ క్రొత్తగాదుగా. మీకు చెపతానులెండి."

"మంచిది లలితా" అంటూ శర్మ నెమ్మదిగా మెట్లు దిగాడు. లలిత గబగబా వానివెంటపడి, "శర్మగారు, మీరు వచ్చినందుకు కృతజ్ఞతలు. కాని, సరోజని రానందుకు విచారం వేస్తోంది. మీరు ఆకారులో రావచ్చును, శంకరంగారు మీ యింటివద్ద దించుతారు, మంచివారు" అన్నది.

శంకరం కారువంక చూడకే, "వద్దు నన్ను ఒంటరిగాపోనీ లలితా" అంటూ రెండడుగులు వీధిలోవేశాడో లేదో, హారన్ మ్రోగిస్తూ శంకరం కారు లలితతోసహా రివ్వున పరువెత్తింది.

*    *    *    *

ఆనాడు బేబీ పుట్టినరోజు పండుగ. తలంటి పోసుకొని, కొత్తచొక్కా, కొత్తపరికిణీ వేసికొని, తలనిండా అప్పుడే విచ్చిన పువ్వులు అమర్చుకొని గంతులువేస్తూ వచ్చింది శర్మదగ్గరకు. శర్మ బేబీని పైకెత్తి ముద్దు పెట్టుకున్నాడు.

బేబీ అడిగింది "అన్నయ్యా, ఏదీ యింకా రాలేదు? వస్తుంది వస్తుందన్నావు.

సరోజని రాకుండా బేబీ పుట్టినరోజు పండుగ లింతవరకు జరిగియుండలేదు. క్రిందటిఏడు తను సరోజని అక్కయ్య ప్రక్కనున్న పూలతోటలో తిరుగుతూ, పరువులెత్తుతూ, కథలు చెప్పుకుంటూ, ఎంత హాయిగా గడిపారో బేబీకి నిన్నటివలె గుర్తున్నది.

"నిజంచెప్పు అన్నయ్యా, సరోజని అక్కయ్యను పిలవలేదా?" శర్మ నవ్వాడు. బేబీ బుగ్గల నిమురుతూ, "నీ కలా ఎందుకు తోచింది బేగీ?" అన్నాడు.

"అవును, మనింటికి రావటం మానేసిందిగా. అందుకని కోపంవచ్చి—"

శర్మ నవ్వుతూ అన్నాడు "ఈమాత్రానికే కోపంవస్తే ఎలా బేబీ?"

"నాకు నిజంగా వస్తుందిసుమా"

"అందుకే నీవు బేబీవి" అంటూ తనగదిలోనికి వెళ్ళాడు. బేబీ తన పూలగుత్తులను సరిదిద్దుతూ అద్దంలోచూస్తూ నిల్చుంది. తనకు నచ్చినరీతిగా రంగులకలయిక చేస్తూ మురిసిపోతోంది. ఇంతలో పోస్టుమాను వచ్చాడు.

గబగబా శర్మ గదిలోనికి పరుగెత్తింది "అన్నయ్యా నాకొక పార్సిలు వచ్చింది. నాకే, నాకే—" బేబీ సంతోషానికి మేర లేదు, ఆమె కదే తొలిసారిగా తనపేర ప్రభుత్వ తపాలాశాఖా వారిద్వారా పార్సెలొకటి రావటం.

శర్మ అదిచూస్తూ తెల్లపోయినాడు. రాలిపోయిన పూవులాగ ఆయనముఖం కళావిహీనమైంది. బేబీ అది కనిపెట్టింది, మెల్లగా అడిగింది. "అన్నయ్యా, నాకు చెప్పవూ—"

బేబీని తన భుజాలదగ్గరకుతీసికొని, తల నిమురుతూఅన్నాడు"

"బేగీ, సరోజని అక్కయ్యరాదు—"

"అని దానిమీద వ్రాసిఉందా?" అని పార్సెలుపైన క్రింద చూసింది, కన్ను లింతచేసుకొని.

ఆమె అమాయకంగా బిక్కమొగం పెట్టింది. అది గమనించి శర్మ నవ్వుతూ, "బేబీ, ఇది నీకోసమే పంపింది సరోజని అక్కయ్య ఇందులో ఏముంటుందో చెప్పుకో," అన్నాడు.

బేబికి మరల మొగమింత అయింది. "నాకు తెలుసు అందులో కీ యిచ్చే కారు ఉంటుంది. నిరుడు నాతో చెప్పింది కొనిపెడతానని. తనకు ఉద్యోగమవుతుందట. అప్పుడు చాలా డబ్బు వస్తుందట. నాకు తప్పక కారు కొనిపెడతానన్నది."

"కాని, సరోజనికి ఉద్యోగం కాలేదుగా—"

"మరైతే డబ్బుఎక్కడనుంచి వస్తుంది. అన్నయ్యా?"

శర్మ పార్సెలు పొంతం విప్పాడో లేదో బేబీ అందులోని గౌను లాక్కొనిపోయింది లోపలికి. అయిదునిముసాలలో కొత్త డ్రెస్సులో తిరిగివచ్చింది." చూడు అన్నయ్యా, ఎంత చక్కని గౌనో. పోనీలే; ఇదే బాగుంది కారుకన్న."

శర్మ కళ్లు తొలుత సంతోషంతో మెఱిసినాయి. క్షణంసేపు దగ్గరగా పరిశీలించాడా నీలిగౌనును. ఆ నీలిగుడ్డ తా నిచ్చినదే సరోజనికి, జాకెట్టు కుట్టించుకోటానికి.

ఎంతో ఆప్యాయంగా తాను బహూకరించాడు. అదే— ఆ బహుమానమునే ఆమె యీ విధంగా త్రిప్పికొట్టింది! లేక—

శర్మకు ఊహ లింతకన్న దూరంపోలేదా క్షణాన. కనురెప్పల క్రిందకు జాలని అశ్రుకణం ఠక్కగా అవతరించింది. బేబీ

తనవంక తిరిగింది, ప్రశ్న వేసినట్లు చూస్తూ. శర్మ ఆమె సొంపలను తన వేళ్లతో మెల్లగా తగిలిస్తూ అన్నాడు "అబ్బో...ఎంత ధగధగ లాడుతోందో యీ గౌను. నా కన్నులు చెదురుతున్నాయి కూడా."

బేబీ తృప్తిచెందిన ముఖం పెట్టింది. "అన్నయ్యా, ఇదిగో పోస్టుమాను ఇచ్చాడు" అంటూ ఒక కవరిచ్చింది.

అది తను సరోజనికి పంపిన ఆహ్వానం తిరిగివచ్చింది. "ఈ చిరునామా గలవారు ఇల్లువదలి వెళిపోయారు" అన్న ముద్రతో. శర్మ కిప్పుడు తెలిసింది, ఆనాడు ఇల్లు సర్దుతూఉన్న దెందుకో. తన ఆహ్వానం సరోజని ఇల్లు చేరలేదు, ఆమె బహుమతి మాత్రం తన యిల్లుచేరింది. బేబీ అంటే సరోజని కెంతముద్దు! మరువకుండా ఉదయానికే బహుమతి పంపించింది.

ఆ కవరు చూసిచూసి ప్రక్కన పడవేశాడో లేదో బేబి మరొకటి తెచ్చియిచ్చింది.

"ఇదెక్కడిది?"

"ఇది ఆ పోస్టుమానే తెచ్చియిచ్చాడు. నాకు బాగున్నది ముందు ఇచ్చాను. తరువాత ఒకొక్కటే—" అంటూ పెద్దగా నవ్వి వాకిటిలోనికి గంతులేసింది బేబీ, తన తోడిపిల్లలు ఆడుకొటానికి వస్తే.

అది సరోజని తల్లిదగ్గరనుంచి. సరోజనికి ఉద్యోగం రాక పోవటంవల్ల వారందరూ ఆర్థికంగా బీదస్థితిలో ఉన్నారని, సరోజనికికూడా వెనుకటిలా ఆనందంగా జీవితం గడిపేందుకు ధన మంతగా లేదని, డబ్బు ఎద్దడివల్ల అదివరకటి పెద్ద ఇల్లు వదలి మరొక చిన్న యింటిలోనికి మారింపని, ఆమెమీద ఆశపెట్టుకొని వ్యయభారాని కోర్చి చదువు చెప్పించిన తనకు ఇంకా సంతోషం కలిగే గడియ రాలేదని, ఏదోవిధంగా ఒక ఉద్యోగం శర్మగారు ఆమెకు ఇప్పించ రాదా అని, తప్పక యిప్పించగలరని, అలా అని సరోజనికూడా అనేకసార్లు అన్నదని—ఇలాగే చాల దీర్ఘంగా వ్రాసిందా యిల్లాలు.

సరోజని ఇబ్బందిపడుతున్నదన్న ఆలోచనలో శర్మ కుమిలిపోయినాడు. బహుశా అందుకే బేబీకా నీలిగౌను పంపి ఉంటుంది. ఆ ఉత్తరం తిరిగి ఒకసారి చదివాడు బరువైన కన్నులతో. మెల్లగా మడిచి ఆ ఉత్తరం జేబులో పెడుతూఉండగా బేబీ తన స్నేహితులతోపాటు గంతులేస్తూ వచ్చింది లోనికి, "అన్నయ్యా సరోజని అక్కయ్య" అంటూ.

శర్మ తటాలున వాకిలివైపు వెళ్ళాడు. బేబీ అన్నది, "ఆ బస్సులో వెడుతోంది. పందెం వేసుకు, మేం పరుగెత్తుతున్నాము. బస్సులాగే స్తంభందాకా. అక్కడ బస్సు ఆగి ఉంది. లోపలికి చూస్తినిగదా సరోజని అక్కయ్య. ఇదిగో ఈ పూవు కూడా యిచ్చింది. దిగమన్నాను. కాని దిగలేదు. దిక్కుమాలిన బస్సు దిగే దాకా ఆగనే లేదు."

"నేను రమ్మన్నానని చెప్పలేకపోయినావా?"

"నీవు చెప్పలేదుగా నాతో."

శర్మ బేబీ అమాయకత్వానికి నవ్వుతూ నిట్టూర్చాడు. బేబీ అన్నది, "నా గౌనువంక మాత్రం సంతోషంతో చూసింది అన్నయ్యా. బాగుందికదూ అన్నయ్యా, నాకు సరిగా సరిపోయింది."

* * * *

సరోజని బైటకు సరదాగా పోయి చాలా రోజులయింది. ఏవో అవసరమైన వస్తువులు కొనుక్కొనటానికి తప్ప దినము దిన మ్మూ యింటిలోనే గడుపుతోంది. మొదట్లో పేపర్లలో వచ్చే ప్రకటనలన్ని శ్రద్ధతో పరికించేది. కాని క్రమంగా ఆ కుతూహలం సన్నగిల్లింది. ఉద్యోగము అనవసరమయి కాదు. తనలో ఏదో అర్థం కాని అసహ్యం కలిగింది ప్రకటనల నదేపనిగా పరికించటమంటే.

ఆనర్సు పరీక్షకై సిలబస్‌కి సంబంధించిన పుస్తకాలు చదువుతూ ఎన్నో మిగతి పుస్తకాలు చదివే వ్యవధిలేక అప్పుడప్పుడు విచారపడుతూఉండేది. ఏ ఇబ్సెన్ నాటకమో తీసేది ఉత్సాహముతో, కాని అవతల ఏ జోన్ రాబిన్‌సన్ పుస్తకమో నోరు తెరుచుకున్న దయ్యంలాగా గోచరమయ్యేది. ఏ సోమర్‌సెట్ మాఘం కథనో తెరిచేసరికల్లా కొత్తగా ఊడిపడ్డ ఏ మీడ్ యొక్క జామిత్రి బొమ్మలో మనోనేత్రంముందు ప్రదర్శనమయ్యేవి. హారడ్ వ్రాసిన కీన్సు జీవితచరిత్రం కూడా పగంకన్న యెక్కువ చదవలేదు. ఎందుకంటే హారడ్ వ్రాసిన వనేక మిగతి పుస్తకాలు తనకు పాఠ్యగ్రంథాలే నాయె, సరే కీన్సు రచనల మాట చెప్పనే అక్కరలేదు. కొన్ని పేపర్లకవి బైబిల్!

తనకు ప్రైజులుగా లభించిన సారస్వత గ్రంథాలన్నీ దులిపి టేబిల్ మీద వరుసగా పేర్చింది. ఉదయం కాఫీ త్రాగి ఆపుస్తకాలు తెరిచేది, మధ్యాహ్న భోజనందాకా చదివేది. భోజనంచేసి తిరిగి అవి చదివేది సాయంత్రందాకా. రాత్రి తిరిగి అదే ధోరణి. ఈ పఠనములో ఆమెకు కొంత శాంతి తోచినట్లు కూడా అనిపించేది.

తన ఈ దినచర్యలో మధ్య మధ్య కలిగే అంతరాయ మొకటే ఉంది. ఏ వారానికొకమారో తన తల్లిదగ్గరనుంచి ఉత్తరం వస్తుంది. వెనుక తల్లి వ్రాసే ఉత్తరంకోసం కాచి వేచికొనియుండే పిచ్చిపిల్లకు ప్రస్తుతం ఆ లేఖలు కొంత ఖేదం కలిగిస్తున్నాయి.

ఆ దినం రెండు కవర్లు వచ్చినాయి. రెండూ తల్లిదగ్గర నుండియే. ఒకటి బరువుగాఉంది. ఆశ్చర్యంతో దానిని అది తెరిచింది. కన్నీరు దిగమింగుకుంటూ ఆద్యంతమూ చదివింది; మధ్య మధ్య ఆకాశంవంక చూస్తూ.

"సరో, ఇక్కడ నా ఆర్థిక పరిస్థితి నీరసంగా ఉన్నదని పదే పదే చెప్పి నిన్ను బాధించవలసినదానను కాను. చదువుకున్న పిల్లవు. నా హృదయం అర్థం చేసుకోగల తల్లివి......

నేను వ్రాస్తూఉన్న ఉత్తరాలు నాకు చేతనయినంత ప్రియంగా, కష్టం కల్గించనట్లుగా వ్రాయ ప్రయత్నిస్తున్నాను. ఈసంగతి నీవు గ్రహించియే ఉంటావు....

సరో, నీకా ఉద్యోగం రావలసిందే. శర్మగారు తప్పక ఇప్పించి ఉంటారని నీకన్న నే నెక్కువగా విశ్వసించాను. ఇప్పు

టికీ నాకో విశ్వాసం సన్నగిల్లలేదు. నీవూ అలాగే అభిప్రాయ పడుతున్నావనుకుంటాను.

నేనిప్పుడే శర్మగారికి ఉత్తరం వ్రాశాను. తిరుగు టపాలో జవాబిచ్చారు. ఆ సమాధానం చూచి ఒక విధంగా ఆశ్చర్యం కల్గింది. నీకు వెంటనే అది పురస్కరించికొని ఉత్తరం వ్రాయలే దంటే ఈ లేఖ ఎలా వ్రాయాలా అని ఆలోచించడంతో సరి పోయిందనుకో.

సరో, నీకు ఉద్యోగం రాలేదని విచారిస్తున్నావు. ఇది సహజమే. కాని శర్మగారికి ఏన్నాళ్ళుగానో నీవు కన్పించలేదుట. క్షణిక కారణాలవల్ల అయివుంటుందనుకున్నాను.

కాని సరో, నీవు ఇల్లు మార్చిన సంగతి ఇన్నిమైళ్ళ దూరంలోఉన్న నాకు వ్రాశావు కాని అక్కడేఉన్న శర్మగారికి తెలుప లేదట.

నిజానికి నా కిదేమాత్రము అర్థముకాలేదు. నీవు ఇలా ప్రవ ర్తించడం ఎంతవరకు సమంజసమో నే నూహించలేను కాని, నీవు శర్మగారిని క్రొత్తగా భావించడం నేను సమర్థించను.

సరో నీవు త్వరగా ఏదైనా ఉద్యోగం సంపాదిస్తే నీకు నాకు మంచిది. ఈ విషయమై ఎక్కువగా నొక్కి చెప్పవలసిన అవ సరం లేదుగదా....

శర్మగారు పరపతిగల మనిషి, ఆయన సహాయంతో ఏదైనా ఉద్యోగం తప్పక దొరుకుతుంది. నామాటవిని, సరో, నీకీ క్షణంలో (తాత్కాలికంగా) నచ్చకపోయినా, శర్మగారి దగ్గరకు పోయి వారితో కలసి ఏదైనా ఉద్యోగానికై ప్రయత్నించు. నేను మరల వారికి వ్రాయ నక్కరలేదనుకుంటాను, బాగుండదు అన్ని సార్లు ఆయనను వేధించటం.

ఇది నీ కిష్టం కాకపోయినా——నా కోసమనుకో——"

ఇలాగే గడిచిందా ఉత్తరమంతా. సరోజని కన్నీరు తుడుచు కుంటూ దిండుమీద కొరిగింది. కొంతసేపటివరకు రెండవ ఉత్తరం ఉన్నమాటే మరచింది. తటాలున లేచి అది తెరిచింది.

"సరో, ఇంతకు మునుపే ఉత్తరం పోస్టుచేశాను. ఇప్పుడే "హిందూ"లో ఒక ప్రకటన చూశాను. అది కత్తిరించి ఈ కవరులోపెట్టి పంపుతున్నాను. ఒకవిధంగా ఆశ్చర్యంగా ఉంది. అదే ఉద్యోగం. తిరిగి అప్లికేషనులు పంపుమన్నారు. ఈసారైనా నీవు శర్మగారిద్వారా తప్పక ప్రయత్నించు. ఈసారి నీకు వచ్చి తీరుతుందని నా అంతరాత్మ నాకు చెప్తున్నది."

వ్రాసింది తల్లికాకపోతే ఆ అంతరాత్మ బోధనకు అంతగా విలువ యిచ్చేదికాదు ఆ సందర్భంలో. సరోజని ప్రకటన చూచింది. అవును అదే ఉద్యోగం, తాను ప్రయత్నించి విఫల మయినదే, లలిత అలంకరించిన స్థానమే అది. కాక అట్టిదే మరొక పదవియో.

తిరిగి, శర్మగారి సహాయం తీసికొమని తల్లి బోధిస్తున్నది. తన మనసులో ఉన్న భావాలు కొంతవరకు తల్లి ఉత్తరములోనే వెలి బుచ్చిందికాని, అసలు తన మనస్సుకు పట్టిన మబ్బుతెరల సంగతి తల్లికేం తెలుసు.

ఇన్నాళ్ళు శర్మగారింటికి తను పోలేదు. అతను రానట్లుగా యిల్లు మార్చింది. అతను వచ్చే పార్కుల జోలికైనా పోలేదు. బేబీ పిలచిన పిలుపులు తనపైన వ్యర్థమయినాయి. శర్మమాత్రం పసికట్టి ఉండడా, ఏదో కారణంగా సరోజని తననుండి దూరంగా సంచ రిస్తోందని! ఇప్పుడు తటాలున తానుపోయి తనకి ఉద్యోగం ఇప్పించుమని అర్థిస్తే, శర్మ ఏమనుకుంటాడు. శర్మ ఎంత ఉదార బుద్ధియైనా, తనది మానవహృదయమేగా, తనకే ఎంత సిగ్గుగా ఉంటుంది? ఏమో, తను పోగానే తటాలున "ఏం సరోజనీ, నీవా ఉద్యోగం ఆశమీద వచ్చావుగదూ" అంటే తల పగిలినంత వేదన, హృదయం చితికినంత వ్యథకల్గదా? ఉద్యోగం సంతుష్టికి దోహద మయితేనే కోరదగినదికాని, తీరని ఆరాటం కలిగించే ఉద్యోగం స్వర్గంలోనైనా నిరర్థకంగదా.

ఈ తలపులకు అంతులేదు. ఎన్నిమార్లు తనలో తాను వాదోప వాదాలు పెంచుకున్నా, తనకు కలిగే చిన్నతనం ఒక ప్రక్కన, తల్లి ఉత్తరాలలోని ఆవశ్యకత ఇంకొక ప్రక్కన తిరిగి తిరిగి గోచర మవుతున్నాయి. ఇంతకు సుందరంగారు వెనుక ఏ కారణంచేత ఉద్యోగ మీయలేదో ఆ కారణ మిప్పుడు తొలిగిందా?

ఏమో. అసలీ ప్రశ్నకు తన కెన్నడు తీరుతెన్నుగల సమా ధానం తోచదు. ఆ ప్రశ్న తనకు తీరని సంతాపం కలిగించింది. గాని ఆ ప్రశ్నను వేసికొనే మనస్థైర్య మామెలో లేదు.

ఏమీతోచని కన్నీటి తెరలలో తల్లి ఉత్తరాలు మడిచి వేసింది. తుదిని ఆమె హృదయానికి గుచ్చుకున్న వాక్యమొక్కటి. "ఇది నీ కిష్టంకాకపోయినా, నాకోసమనుకో."

వేగంగా లేచి దుస్తులను మార్చి బయలుదేరింది శర్మయింటి వైపు——కాని త్రోవపొడుగునా తనను చులకనగా చూస్తాడేమో నన్న భ్రమ మాత్రం ఆమెను వీడనేలేదు. అలా జరిగితే, వెంటనే "అంత స్వార్థంగా నాఅంతట నేను రాలేదు, మా తల్లిగారు పడ లేక వచ్చాను." అని పాఠం ఒప్పచెప్పి తిరిగి రావలెనని తనలో తాను నచ్చచెప్పుకొన్నది.

* * * *

శర్మ తన పడకకుర్చీలో విశ్రమించి ఒక ఉత్తరం దీక్షగా చూస్తున్నాడు. బేబీ తనను పలుకరిస్తూ అల్లరిచేస్తూ గంతులువేస్తూ ఉన్నది. శర్మచేతిలోఉన్న ఉత్తరము మధ్యమధ్య లాగుతూ అతనిని విసివిస్తోంది. శర్మలేచి, నవ్వుతూ బేబీని ఎత్తుకున్నట్లు ఎత్తుకుని ఎత్తైనకిటికీలో కూర్చొపెట్టాడు. పాపం బేబీ తనంత తాను దిగలేదు. దూకితే పడతానని భయము. నవ్వుతూ సణుగుతూ అలాగే కూర్చుని ఉన్నది.

శర్మ ఉత్తరంచూస్తూ మధ్యమధ్య ఆలోచనగా చూస్తూ ఉన్నాడు. ఇంతలో వీధితలుపు తట్టినచప్పుడు అయింది. బేబీ తటాలున "సరోజనిఅక్కయ్య సరోజనిఅక్కయ్య" అంటూ అరుస్తూ చప్పట్లుకొడుతూ, వీధిలోకిచూస్తూ శర్మవంక చూస్తూ గంతులువేస్తోంది.

శర్మ ఉలిక్కిపడ్డట్లయితేనూ, "ఎవరునువ్వు? ఎవరువది!" అన్నాడు.

స్థిమితంగా సరోజని అన్నది "ఆఁ నేనే సరోజనిని."

శర్మ తలుపు తెరచాడు. తలవంచుకొని సరోజని ప్రవేశించింది. వస్తూనే కటికిప్రక్కకుపోయి ఆత్రంగా చేతులెత్తి నిలుచున్న బేబీని దగ్గరకూ తీసుకొన్నది.

శర్మ అడిగాడు, "ఏమిటి ఇన్నాళ్ళు సరోజా, ఏలాగున్నావు?"

సరోజని ఏదో చెప్పటానికి ప్రయత్నిస్తోంది.

వెంటనే శర్మ అన్నాడు, అం... అన్నట్లు సరో... నీకొ ఉద్యోగం కావాలనేకున్నావా? కావాలంటే, తిరిగి ప్రయత్నించి చూస్తా, ఏంసరో —"

సరోజని కన్నులవెంటనే నీటపరదలలో వెలిసిల తిడిచి పోయింది, శర్మ అది కనిపెట్టకుండా, కాళ్లను చుట్టిపున్న బేబీని త్రోసుకుంటూ ప్రక్కగదిలోకి పోయింది. బేబీ తనను విడిలించుకొని, "ఉండు అక్కయ్యా నా కొత్తగౌను వేసుకువస్తాను" అని లోపలకు పరుగెత్తింది.

ఏ ప్రశ్నకు తాను భయపడిందో ఆప్రశ్న శర్మ వేశాడు. ఏవిషయం శర్మ ప్రప్రథమంగాఎత్తుతే తాను భరించలేక పరుపెత్తును పోదలచుకొన్నదో ఆప్రశ్న శర్మవేశాడు. స్వార్థచింతతో తాను తిరిగి శర్మయొద్దకు చేరిందన్న స్ఫురణ యీప్రశ్నలో అవగత మవుతుందో అప్రశ్న శర్మ ప్రశ్నించాడు.

లలితపల్లి ప్రొద్దులంమీద తను వచ్చింది. తనకు ఉద్యోగంవస్తే తనతల్లికి తనకు మంచిదే. కాని ఉద్యోగమే ప్రపంచములో సర్వము కాలేదు. ఉద్యోగంవల్ల ధనం లభిస్తుంది. ధనంవల్ల జీవనములో సౌలభ్యం ఏర్పడుతుంది. కాని అది భౌతికసౌలభ్యమే. అంతకుమించినది మానసికానందం, అది తనకీ ఉద్యోగంవల్ల కల్గలేదు. తాను ఉద్యోగంచేసిన ప్రతిక్షణము శర్మ తనను స్వార్థిగా తలపోస్తున్నాడన్న మనోవేదన తనను మధిస్తూయుంటుంది. తనను ప్రేమించిన శర్మగారే యిలా భావిస్తే తనకిక మానసికానందమెలా లభిస్తుంది?

సరోజని వంచినతల ఎత్తకుండా ప్రక్కగదిలోనుండి మెల్లగా బయటకు జారింది. శర్మ ఇది గమనించలేదు. బేబీ లోనుండి తన నీలిగౌనుతో పరుపెత్తుకువచ్చి "ఏదీ సరోజని అక్కయ్య" అనేవరకు.

"ఏదీ సరోజని" అంటూ శర్మ ప్రక్కగదిలోకి వెళ్ళాడు. అప్పటికే పదడుగులదూరంలో రోడ్డుమీద కన్పడింది సరోజని. బేబీ పరుగెత్తుకుపోయి రమ్మనట్లు సరోజని చేయి లాగింది. సరోజని తల త్రిప్పుతూ బేబీ చేయి విడిలించుకుంది.

బేబీ కన్నులు నీళ్ళలో తేలే పూవులలాగ అయినాయి. బిక్కమొగంలో శర్మ దగ్గఱకు వచ్చింది. శర్మ ఒక్క నిట్టూర్పు నిట్టూర్చి, గబగబా తన కుర్చీప్రక్కనున్న కవ రొకటి తీసి బేబీకిచ్చి, "ఇదిగో ఇది సరోజని కిచ్చిరా, పరుగెత్తుకుపోయి. ఊఁ. పరుగెత్తు." అన్నాడు.

బేబీ ఒక్క క్షణములో కవరు ఇచ్చివచ్చింది. శర్మ పోయి తన కుర్చీలో పడుకున్నాడు. బేబీమాత్రము బైటకు చూస్తూ నిల్చున్నది, ఎంతసేపటికి లోనికి రాకుండా. శర్మ పిలిచాడు, "బేబీ, ఇదిగో బొమ్మలు" అంటూ.

"ఉండు అన్నయ్యా, ఇక్కడ బలేబాగుంది. సరోజని అక్కయ్య నిలబడి ఉత్తరం చదువుకుంటోంది అన్నయ్యా...... మధ్య మధ్యనే సరోజని అక్కయ్య మొగం తుడుచుకుంటోంది. అన్నయ్యా...అన్నయ్యా...మరే—" అంటూ బేబీ అకేపనిగా వర్ణిస్తోంది.

సరోజని నిజంగా విసుపరిగి చూస్తూ ఉత్తరం చదువుతూ కన్నులు తుడుచుకుంటూ ఏదో నూతినానుభూతిలో తేలిపోతోంది. ఆ కవరు తనకోసం, తన పేరిట ఉంది, కాని శర్మగారి కేర్ ఆఫ్ చిరునామాతో వచ్చింది.

అది వ్రాసింది లలిత. ఆ సంతకం చూచీచూడగానే సరోజని ఒళ్లు ఒక్కసారి జల్లుమన్నది. లలిత కనపడి ఎన్నాళ్ళయింది! లలిత తన వెనుకటి స్నేహితురాలు! లలిత తనకు రావలసిన ఉద్యోగం పొందిన పిల్ల!

చివరికిలా ఉన్నది: "నా స్థానానికి నాకు తెలిసినది నా ఉద్యోగం పోయిన దెందుకు మాత్రమే. నాకసలు అది ఎలా వచ్చిందో ఇంతవఱకు తెలియదు. నీకు రాని కారణము కూడ నేను చూచాయగా విన్నదేసుమా. నేను చేసిన నేరం నీకిది చెప్పటం. క్షమించు, ఏదో క్షణికమైన శైథిల్యపరిస్థితి నాచేత చెప్పించింది."

సరోజని గబగబా పరుగెత్తుకు వచ్చింది శర్మ యింటిలోనికి. వీధి గడపలో నిల్చుని సంతోషంతో అరుస్తున్న బేబీని ప్రక్కకు త్రోసుకుంటూ సరాసరి శర్మగారి కుర్చీ కెదురుగా నిలబడ్డది.

శర్మ తలయెత్తి చూడలేదు, ఇంత రివ్వున వచ్చినది, తనమీద వాగ్వర్షం కురిపించిపోవటానికేమోనని.

సరోజని శీతాకాలపు సముద్రపు గాలిలాగా మాటలు దొరలించింది, "ఈ ఉత్తరం వచ్చి ఎన్నాళ్ళయింది?"

"పది రోజులయింది." శర్మ తలయెత్తకే సమాధాన మిచ్చాడు.

"పది రోజులే! మఱి ఎందుకు చూడలేదు, తెరిచి?"

"అది నీపేరన వచ్చింది."

"తెలుసును. కాని ఎందుకు తెరవలేదు అని అడుగుతున్నాను."

"అది నాది కాదు, నీపేర వచ్చిందని చెప్పాను."

"ఏం తెరచిచూస్తే ప్రపంచం తల్లక్రిందులయ్యేదా?"

"అవును. ఈమధ్య తల్లక్రిందు లయినట్లే తోచింది."

"సరోజని ఉత్తరముతో శర్మ గడ్డము పైకెత్తుతూ అన్నది" అందులో మీ సరో సముద్రములో మునిగిఉంటుందనుకున్నారా?"

ఇది వెనుకటి సరోజని. తాను ప్రేమించిన సరో. తనను వాత్సల్యవృత్తంగా మార్చగల సరో ఇది. శర్మ తలయెత్తాడు. సరోజని ముఖంలో తుపానుకు బదులు పౌర్ణమినాటి నిండు చంద్రబింబము తలపించింది.

శర్మ మాటాడేముందే సరోజని వానిచేతిలోని కౌగిలం లాక్కొంటూ "ఇదీ యేదో ఉత్తరంలాగానే యున్నదే" అంది.

పైడి : పెళ్ళి...

వ్యక్తి : లేదు...

పైడి : (ఆశ్చర్యపోయి) అం...ఏమిటి బాబోయ్! తమ రలా అంటారు...

వ్యక్తి : ఈ కాలంలోనూ చూస్తు, ని కొడుకుకూడా చూస్తు...

పైడి : కొడుకా!?

వ్యక్తి : ఏం?

పైడి : (మాట్లాడడు)

వ్యక్తి : ఏం ఒక్కసారి ఆగిపోయేవ్...

పైడి : కొడుకులెవరూ లేరుబాబూ...తమ దయవల్ల...పిల్లలే లేరుబాబూ...

వ్యక్తి : (ఆశ్చర్యాన్ని మరుగుపరుస్తూ) నవ్వుపోతరు ముసలాడా. మనవలు కూడా ఉండవల్సిందే నీకు! ఆశ్చర్యంగానే ఉంది.

పైడి : ఎందుకు బాబూ?

వ్యక్తి : నువ్వసలు పెళ్ళిచేసుకోలేదా?

పైడి : తమ తల బాగా మాసింది....క్రాపు చేయించమంటారా?

వ్యక్తి : అలానే కానీ. ముందు నాకు చెప్పు..

పైడి : (క్రాపుచెయ్యడంలో మునిగి) అదే అయితే ఏ ఏడుపూ ఉండకపోను బాబూ... తమరిష్టం... లేవకండి... బెంచీ మీద కూర్చోండి...

వ్యక్తి : ఇంకో ఉద్యోగాన్ని తెచ్చుకోలేకపోయావా? ఏం చింతా ఉండకపోను...

పైడి : (వింతగా) ఎందుకు బాబూ?

వ్యక్తి : పిల్లలకోసం...

పైడి : (క్షణం మౌనం వహించి) తల్చుకుంటే గుండెకాయ పగిలిపోయి, భయం పుట్టుకొస్తున్నాది...మరో పెళ్ళే!!

వ్యక్తి : పిల్లలు కావాలంటే అదే చెయ్యాలి. ఏడ్చి ఏం లాభం?

పైడి : పిల్లలు పుట్టక కాదు బాబూ...

వ్యక్తి : పిల్లలుండే వారన్న మాట......అయితే మీ ఇద్దర్లో ఎవరి లోపం లేదూ....ఎవ్వరూ బతకలేదా...

పైడి : ...బతకలేదు బాబూ...

వ్యక్తి : (ఆశ్చర్యపోయి) నిజంగా? (సర్దుకొని) ఏ డాక్టరుకన్నా చూపించుకోవల్సింది...పిల్లలు పుట్టిపోతూవుంటే అది తప్పించడానికి వీలుంది తెల్సునా?

పైడి : (నిరసనగా నవ్వి) డాక్టర్లా బాబూ! ఈ భూమిమీది డాక్టర్లా...ఉహుం...

వ్యక్తి : చాలా కష్టంగా మాట్లాడుతున్నావ్...

పైడి : నా కొడుకు నాకుండేటట్టు దేముడే చెయ్యలేక పోయేడు బాబూ! ఈ డాక్టర్లా!

వ్యక్తి : పుట్టింది ఒక్కడే కొడుకా?

పైడి : ఇదిగో ఇక్కడే కుసుండేందుకూ బాబూ...మిగిలిన ప్రాణం పొస్తూ బాధపెట్టి అయ్యాడానికి...

వ్యక్తి : ఔను...చాలా కష్టంగానే ఉంటుంది...... ఎన్నాళ్ళు బతికి, పోయేడు...

పైడి : పాతికేళ్లు బాబూ...

వ్యక్తి : పాతికేళ్ళు!! హమ్మమ్మ! చెట్టంత మనిషి...

పైడి : ఔను బాబూ...

వ్యక్తి : ఎంతపని! చేతి కంది వచ్చిన కొడుకు...ఎలాపోయేడు! ఏమయింది...ఏ జబ్బు?

పైడి : (మౌనం)

వ్యక్తి : పెళ్ళికూడా అయిందేమిటి కొంపతీసి!

పైడి : ఒక ఎనుబోతులా ఉండేవాడు బాబూ...(ఊపిరి బిగపట్టి) కొవ్విపోయిన ఎనుబోతులా...

వ్యక్తి : ఏంమాటలోయ్!! అలానే పోలుస్తారా పోయినకొడుకుని!

పైడి : అబద్ధం కాదుబాబూ. కొవ్వుబలిసిన ఎనుబోతులా ఉండేవాడు...

వ్యక్తి : నీ ఉద్దేశం అంత బలంగా అనా?

పైడి : చిత్తం!

[మౌనం]

ఒడ్డూ, పొడుగూ తమలానే ఉండేవాడు...

వ్యక్తి : నన్నూ కొవ్వుబల్సిన ఎనుబోతే నంటా వేంటి కొంపతీసి!

పైడి : (వినిపించుకోకుండా) మహా గొప్ప తెలివిబాబూ....

వ్యక్తి : నిజంగా?

పైడి : బాగా తెలివిఉండేది బాబూ...ఎంత ముందాలోచన!

వ్యక్తి : (విచారంగా) అలాటివాళ్ళకే భగవంతుడు ఆయుష్షు ఇవ్వడు...

పైడి : అలా అనకండిబాబూ...అలాటి కొడుకే దక్కకుండా తండ్రి గుండె విరక్కొట్టిపోతాడు...

వ్యక్తి : ఏదన్నా ఒకటే...ఎంత కష్టం! ఈ ముసలికాలంలో నువ్వొక్కడివి...

పైడి : ఏంచేస్తాను బాబూ....

వ్యక్తి : ఎలా పోయేడో చెప్పేవ్ కాదు...

పైడి : ఎలాపోయేడా...(మౌనం) గుండె బాబూ...గుండె...

వ్యక్తి : అంత దుక్కలా, ఎనుబోతులా ఉండేవాడన్నావ్?

పైడి : మనిషి ఎంత దుక్కలా ఉన్నా గుండె పిడికి జేకదు బాబూ...అది సరిగా పనిచెయ్యలేదు బాబూ...బుర్రా అన్నీ బాగా పనిచేసేయి...మరి గుండెకూడా బాగా పని చెయ్యాలి కదు బాబూ, బతకడానికి...

వ్యక్తి : గుండె ఆగిపోయిందా?

పైడి : ఔను బాబూ...గుండె రక్తం చిమ్మడం మానీసింది బాబూ...ఎర్రటి రక్తం...జేగురులాటి రక్తం చిమ్మడం మానీసింది బాబూ...

వ్యక్తి : [సుబిగ నెత్రగా చూరుతుంది]

పైడ : ప్రమాదంగా కొట్టేవాడు కాదు... ఈమాటలే. నేనారోజు ఊళ్లోలేను. పట్నం వెళ్లేను... ఇది జరిగిపోయింది... నే వచ్చేసరికి దాన్ని పాతిపెంకూడా అయిపోయింది...

వ్యక్తి : నువ్వు వింటూ, తెలిసి ఊరుకున్నావా?

పైడ : ఊరుకుంటానా? మర్నాడు వాడ్ని ముఖం వాచిపోయేట్టు తిట్టేవాన్ని... ఆ కోపం అంతా దానిమీద రాత్రి చూపెట్టేవాడు... దాంతో నేను తగ్గవల్సివచ్చేది... దాని కోసం ఆ పిల్లకోసం... ఇంతమట్టుకి వెళ్లిందని తెలుస్తే.

వ్యక్తి : చాలా అన్యాయం జరిగింది... సుద్యా పిల్లని బాధ పల్సింది...

పైడ : (కొంచెం తగ్గించి) ఏం చెప్పను బాబూ... ఆఖరికి ఆ పిల్ల భాగం తీసుకున్నాను... పెద్దజట్టే అయింది ఒకరోజు నాకూ వాడికీ... (పళ్లుకొరికి) వాడు... ఆ రౌడీ ఆ పిశాచి... నాకూ... ఆ పిల్లకీ నా కూతురులాటి పిల్లకీ...

వ్యక్తి : (తలదించుకొని) ఊఁ.

పైడ : నే నసలు పొరుపుపోడ్ని... పీకపోయినా, ఏమిటయినా వాడి ఊసె మానుకుందామని పంతంపట్టేను... కాని ఇలా అయిపోతుందని అనుకోలేదు...

వ్యక్తి : తలబయిందిగా... ఈ గడ్డాం ఇంక తీసేయి...

పైడ : (కత్తెనబల్లమీద పెట్టి, కత్తితెచ్చినూరుతూ) వాడు మరి నా కంటబడలేదేబాబూ. అందరిముందూ ప్రమాణికం చేసేను ...నాకేమిటయినా సరే... వాడు కనిపిస్తేమాత్రం... కత్తితో పరా పరా పీకకోసెస్తానని... నా బలం ఎలా ఉండేదనుకున్నారుబాబూ... అప్పుడు!

వ్యక్తి : అప్పుడు నీ కంతకోపం ఉండడం సహజమే... కాని, నిజంగా నీ కొడుకు కనిపిస్తే వాడిపీక సరికేగలవా?

పైడ : వాడుకొడుకా బాబూ నాకు! తమ రలా అంటున్నారు.

వ్యక్తి : నీ రక్తం అతనిలో లేదంటావా?

పైడ : ఏమయినాసరే... వాడు కనిపిస్తేమట్టుకు ఆపని చేసి ఉందును...

వ్యక్తి : ఏవో పొరపాట్లు జరుగుతూ ఉంటాయి పయిడయ్యా. అంతమాత్రానికి కొడుకుని, కన్నకొడుకుని, చంపేస్తానని తండ్రి పగపట్టడం చాలా విచిత్రంగాఉంది... ఆ నిమిషాని కలా ఉంటుంది. కాని కొన్నేళ్ళయాక నీ కొడుకుని నీకు చూడాలని తప్పకుండా ఉంటుంది... క్షమించాలని ఉంటుంది...

పైడ : ఏమిటిబాబూ! తమ రలా అంటున్నారు...
(దగ్గిరగావెళ్లి గడ్డాం గియ్యడం మొదలెడతాడు)

వ్యక్తి : మనం మనుష్యులం పైడయ్యా. పొరపాట్లుచేస్తూ ఉంటాం. నీ కొడుకుకుండే మారిపోయి ఉండొచ్చు... అతను తిరిగి మనిషిగా మారిపోయి ఉండొచ్చు—చేసిన దానికి ఎంతగానో పశ్చాత్తాపపడి విచారిస్తూ ఉండొచ్చు.

పైడ : బాబా! వాడి సంగతి నాకు తెలీదా బాబూ... ప్రతి రక్తకణం విషంగా మారిపోయింది... మరింక అది బాగు పడుతుందా?

వ్యక్తి : సంఘం సరిగా పనిచేసి, చెడురక్తం మంచిదయిపోయి ఉండొచ్చు...

పైడ : కాదు బాబూ...
(గడ్డాంగీసే పనిలో ముఖంమైకొత్తి ఎందుకో ముఖంలోకి వింతగా చూస్తాడు)

వ్యక్తి : ఏంటి అలా చూస్తున్నావ్?

పైడ : తమని ఎక్కడో చూసేనుబాబూ ఇదివరకు....

వ్యక్తి : (తత్తరపాటుతో) నన్నా!!

పైడ : ఔనుబాబూ!

వ్యక్తి : ఏదో పొరపాటు—

పైడ : కాదుబాబూ... ఎక్కడో చూసేను...

వ్యక్తి : నే నిక్కడికి రాలేదే ఎప్పుడూ...

పైడ : ఆఁ! తెల్సిందిబాబూ... వాడు...

వ్యక్తి : ఎవరు?

పైడ : వాడు... నా కొడుకు... మీలానే ఉండేవాడు... ఎంత దగ్గిరపోలిక...

వ్యక్తి : నన్నే నీ కొడుకంటావేంటి, కొంపతీసి...

పైడ : ఛాఛా! తమకీ ఆ పిశాచానికీ పోలికాబాబూ...

వ్యక్తి : నా కెందుకో బాగా నమ్మకంగా ఉంది. నీ కొడుకు మారిపోయిఉంటాడు మనస్సు ఎప్పుడూ ఒక్కలాఉండదు....

పైడ : వాడిసంగతి మరెత్తకండి బాబూ... మరిచిపోనివ్వండి బాబూ!

వ్యక్తి : దానికి నిప్పంటిస్తే ఎలాఎర్రగా మెరుస్తుంది...?

పైడ : ఎంతసేపు బాబూ అది... మళ్ళీఅది మసిబారిపోవ ఎంతసేపులో అవాలి...

వ్యక్తి : ఒకప్రశ్న అడుగుతాను పైడయ్యా... నిజమైన జవాబియ్యి.

పైడ : తప్పకుండా అడగండిబాబూ...

వ్యక్తి : నీ కొడుకే, చేసినదానికి పశ్చాత్తాపపడి, నీ కాళ్లదగ్గర పడి, క్షమించమని, ఒప్పొంచుకో...

పైడ : (మాట్లాడడు... మిగిలిన కొద్దిపాటి గడ్డాన్ని తీస్తూఉంటాడు)

వ్యక్తి : నువ్వు క్షమిస్తావా?
(గడ్డాంగియ్యడం పూర్తవుతుంది.... పైడయ్య 'షాకు' తగిలినట్టు ఉలిక్కిపడతాడు... గడ్డాం క్రిందభాగాన్ని

తీక్షణంగా చూస్తాడు. అక్కడవున్న చిన్నకుర్రాన్ని తేరి పార చూస్తాడు—)

ఏం పైడయ్యా...

పైడి : (ఆవేశంతో) బాబూ...

(కత్తి ముఖందగ్గరికి తెచ్చి) బాబూ! నా కొడుకే... ఈ ఈ నిముషం, నా దగ్గరికొచ్చి... చూడండి అనుకుంటే వెంటనే ఏంచేస్తానో తెల్సునా బాబూ!

(మరింత దగ్గరిగా కత్తి తెచ్చి కత్తితో వ్యక్తి పీకని చూపిస్తూ)

ఆ పీకని, పరపరా కోసేస్తాను బాబూ! ముక్కలు ముక్కలుగా కోసేస్తాను బాబూ!

(పైడయ్య ముఖం భయంకరంగా ఉంటుంది. అతని పళ్లు వికారంగా పైకి ఉంటాయి)

వ్యక్తి : (మొదట కొంత గాభరాపడిపోతాడు. క్రమంగా తమాయించుకుని పైడయ్య ముఖంలోకి అదోరకంగానూ, అంతభయంకరంగానూ చూస్తూ) పైడయ్యా! ఇదవైపిల్లి (క్రిందచేసిన తప్పుకి పశ్చాత్తాపపడి క్షమించమనివస్తే. కొడుకుని క్షమించలేవూ? (ఊపిరి బిగపట్టి ముఖందగ్గరగా పెట్టి) నాకే నీలాటి తండ్రికాని ఉంటే (చేతులు రెండూ పైడయ్య పీకదగ్గిరికి తెస్తూ) పీకనులిపి విసిరేస్తాను.... పీకనులిపి విసిరేస్తాను!

* పైడయ్య దెబ్బతిన్నట్టు వెనక్కి తగ్గుతాడు. ఇద్దరూ ఒకరిముఖం ఒకరు చూసుకుంటారు ఒక అరనిముషం - ఏదో అర్థం అయినట్టు. వ్యక్తి, చరచరా దుకాణం దిగిపోతాడు... పైడయ్య వెర్రివాడ్లా అటువేపే చూస్తూ ఉంటాడు కత్తి పట్టుకొని— *








ARS

# అష్టదిగ్గజములు

## శ్రీ నిడుదవోలు వేంకటరావు

సాహితీసమరాంగణ సార్వభౌముడు శ్రీ కృష్ణదేవరాయల కాలమున 'అష్టదిగ్గజములు' అను పేర నెనమండ్రు కవులు విలసిల్లి రన్నదిగా తెలుగువారి కందఱకు సుపరిచితమైన విషయము. ఆ కవు లందఱును తెలుగుకవులే యని నేటివఱకును వాఙ్మయ చరిత్రకారుల యభిప్రాయము. కాని యీ నడుమ వెలువడిన ఆంధ్రకవి తరంగిణిలో కృష్ణరాయ చరిత్రమున గ్రంథకర్తలు అష్టదిగ్గజములలో నైదుగురు మాత్రమే తెలుగు కవులనియు, తక్కిన ముగ్గురును సంస్కృత కర్ణాటకవులై యుందురను నభిప్రాయమును వెల్లడించి యున్నారు. వారట్లు వెల్లడించుటకు కారణము లేవియు నందు తెలిపి యుండలేదు—కాగా, పారంపర్యముగా వచ్చుచున్న సంప్రదాయమును బట్టియు, వాఙ్మయచరిత్రకారుల వ్రాతల ననుసరించియు పరిశీలించినచో, అష్టదిగ్గజములలో ముగ్గురు సంస్కృతకర్ణాటకవులై యుందురను నభిప్రాయ మెంతమాత్రమును సమంజసము కాదనియు, వారందఱు తెలుగువారే యనియు స్పష్టమగుచున్నది. ఈ విషయమునుగూర్చి యిం. వఱ కెవరేవిపులముగా వ్రాసినది తెలుపము, అష్టదిగ్గజము లెవరో నిరూపించుటయే యీ వ్యాసము యొక్క యుద్దేశము. ప్రకృతమున నీ వాదమును గ్రంథస్థముచేసిన ఆంధ్ర కవి తరంగిణీ కారులు వ్రాసిన దాని నిందుదాహరించుచున్నాను.

ఆంధ్రకవి తరంగిణి సప్తమ సంపుటము పుటలు. 144—145 లో శ్రీ కృష్ణదేవరాయల చరిత్రమున నిట్లు గలదు.

### అష్ట దిగ్గజములు

"రాయల యాస్థానమున దిగ్గజములవలె నెనమండ్రు కవు లుండెడివారని ప్రతీతి కలదు. ఈ యష్ట దిగ్గజములకు గడప నుండు లములోని తిప్పలూరు అను గ్రామము సర్వాగ్రహారముగాఁ జేసి రాయలు దానమిచ్చినట్లు తెలుపు శాసనమువలనఁ దెలియుచున్నది. ఈ దాన మిచ్చుటచే ఆ దానప్రతిగ్రహీతలగు నెనమండ్రుకవు లెవరో తెలియదు. ఈ సందర్భమున రాయలు వ్రాయించిన శాసనము లభింపలేదు. ఈ గ్రామమున దొమ్మరిపన్ను మాఫు చేయుచు, నిలకులు వ్రాయించిన శాసనమునుబట్టి యీ విషయము తెలియవచ్చినది.

ఈ అష్ట దిగ్గజములని ప్రఖ్యాతి గాంచినవా రాంధ్ర కవులని చరిత్రకారుల యభిప్రాయము.

"ఈతని యాస్థానమునందు పేరిట నెనమండ్రు తెలుగు కవు లుండిరనినమాట పరంపరగా వచ్చుచున్నది. అల్లసాని పెద్దన, నంది తిమ్మన, ధూర్జటి, మాదయగారి మల్లన, అయ్యలరాజు రామభద్రుడు, పింగళి సూరన, రామరాజభూషణుడు, తెనాలి రామకృష్ణుడు అనెడి యెనమండ్రును అష్టదిగ్గజములని వాడుక కలదు."

ఇందు మొదటి నలుగురును, రామకృష్ణుడును శ్రీకృష్ణరాయల కాలములోనివారు. అతని యాస్థానమునఁ గవులుగా నున్నట్లు నిదర్శనము లున్నవి. కాని తక్కిన ముగ్గురును అష్టదిగ్గజములలోనివారు కారని నా యభిప్రాయము. వారినిగూర్చి ఆయా కవుల చరిత్రము నందు వ్రాయఁదలచితిని.

అష్టదిగ్గజములని ప్రఖ్యాతిగాంచిన వారిలోఁ బైన వ్రాసిన యైదుగురును గాక తక్కినవారు సంస్కృత కర్ణాటకవులై యుందురని నా యుద్దేశము. కృష్ణదేవరాయలు కాంక్షించిన నభిమాన మెక్కువ యనుమాట నిశ్చయమే. దేశభాషలందు తెలుగు లెస్స యని నుడివినవాఁడే. దీనినిబట్టి అష్టదిగ్గజము లాంధ్రకవులే యని తలంపరాదనియు నాతని యాస్థానమున సంస్కృత కర్ణాట కవులు కూడ గలరనియు వారిని కూడ రాయలు సమానగౌరవముతో మాచె ననియుఁ దలంపవలసియున్నది."

పై దానిలో తిప్పలూరి శాసనమునుబట్టి కృష్ణరాయల కాలములోనే అష్టదిగ్గజ కవీశ్వరులకొక యగ్రహారము దానమీయబడినదని, వారి పేళ్లు మనకు తెలియకపోయినను వా రెనమండ్రు కవులని స్పష్టమగుచున్నది. కృష్ణరాయలు దానమిచ్చిన కాలము మనకు తెలియకున్నను, అది క్రీ. శ. 1528 (తిప్పలూరి శాసనకాలము) కి ముందు కాలమని నిశ్చయముగ చెప్పవచ్చును. మఱియు కొంతమంది చరిత్రకారులు నిరూపించినట్లు కృష్ణరాయ నిధనకాలము క్రీ. శ. 1526 ప్రాంతమగుచో, నీ దానకాలము క్రీ. శ. 1520—26 సంవత్సరముల మధ్యనని చెప్పవగును. అష్టదిగ్గజములను శ్రీ కృష్ణదేవ రాయలు, తన రాజ్యారంభకాలమున నెలకొల్పియుండునని శ్రీ నేలటూరివారి యభిప్రాయము.1

ఈ తిప్పలూరి శాసనమే కాక, మైసూరుప్రాంతమున నంది దుర్గలో సోమశంకరస్వామి ఆలయమున శ్రీకృష్ణదేవరాయని శాసనములో, నీ యష్టదిగ్గజముల ప్రస్తావనయున్న యీ క్రింది శ్లోకమును కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించియున్నారు.

శ్లో॥ యత్కీర్తిర్భువనైక భూషణ మహోద్యస్య ప్రసాదాన్న రా
స్సర్వే రాజ సమాన తా ముపగతా సంప్రాప్య వి త్తం బహు

1. *"Very early in his reign, he constituted an Academy of Telugu Poets, the members of which were known as Astadiggajas." Studies in History of the third Dynasty of Vijayanagara P. 421.*

[illegible] యష్టాదిగ్గజ [illegible] కవు [illegible].

ఇప్పుడు [illegible] (క్రీ. శ. [illegible] [illegible] ప్రకటించిరి. [illegible] [illegible]

[illegible] శ్రీ [illegible] మూర్తిగారి [illegible]

[illegible] 473–477 పుటలలో [illegible] –

"[illegible] పురుషార్థ ప్రదాయిని [illegible]

| కవిపేర్లు | గ్రంథముల పేర్లు |
|---|---|
| ౧. అల్లసాని పెద్దన [illegible] వీరే మనుచరిత్ర [illegible] | ౧ మనుచరిత్ర ౨ [illegible] ౩ [illegible] |
| ౨. భట్టుమూర్తి [illegible] | ౧ నరసభూపాలీయము ౨ వసుచరిత్రము. |
| ౩. ముక్కు తిమ్మన్న. [illegible] | ౧ పారిజాతాపహరణము. |
| ౪. పింగళి సూరన. | రాఘవపాండవీయము. |
| ౫. తెనాలి [illegible] రామలింగము. [illegible] పేరు కలిగిన [illegible] | పాండురంగ విజయము (పాండురంగ మాహాత్మ్యము.) |
| ౬. [illegible] రామభద్రకవి. | రామాభ్యుదయము |
| ౭. శంకరకవి. | |
| ౮. ధూర్జటి. | |

ఆ పుటలోనే *N. B.* [illegible] కృష్ణరాయల సంస్థానములోనివారు [illegible] చెప్పవలసియున్నది." అని యున్నది.

అష్టదిగ్గజములకు పేర్కొన్న తిప్పలూరి శాసనమునుగూర్చి ఆ గ్రంథమున 520 - 521 పుటలలో నిట్లు వ్రాయబడియున్నది.

తిప్పలూరి గ్రామ మష్టదిగ్గజ కవిశ్వరులకు సర్వాగ్రహారముగా నిచ్చినందులకు రెండు శాఖలాలున్నవి. వానిలో తిప్పలూరి గ్రామమునకు దూర్పునకొప్ప వాములో నున్న శాసనము.

శాలివాహన శకవర్షములు ౧౪౫౦ అగు నేటి సర్వజిత్తు సం. శ్రావణ బ ౩౦ సోమువారము శ్రీకృష్ణదేవరాయల మహారాయల వారు అష్టదిగ్గజ కవీశ్వరులకు ధారవోసి యిచ్చిన తిప్పలూరి అగ్రహారమునందు దొమ్మన్లు యిచ్చు పన్నులు ఈ గ్రామములోనున్న శివ విష్ణువుల దేవాలయములకు సమర్పించిరి."

పై దానిలో అష్టదిగ్గజముల పేర్లీయబడి యున్నవి గాన నిది యెంతకాలమునుండి వచ్చుచున్నదో పరిశీలింతము.

"పాండురంగ విజయము" నందలి ఆదిలోనున్న వృత్తాంతము పురుషార్థప్రదాయిని యందు క్రొంగ్రొత్తగా ప్రకటించినట్టు కనిపించు" అని వారు వ్రాయుటచే నీ విషయము పురుషార్థప్రదాయిని నుండి గ్రహింపబడినట్లు స్పష్టము. పురుషార్థప్రదాయిని బ్రాహ్మణా నాంధ్ర వార్తాపత్రికలలో నొకటి. గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు దీని సంపాదకులు ప్రకటించినది. క్రీ. శ. 1872 లో పైనను, పురుషార్థప్రదాయిని పత్రికయంతె తిరుపతి వెంకయ్య యుండుగా వెలసినది. అది క్రీ. శ. 1872 లో బందరులో ప్రారంభమై క్రీ. శ. 1874 ఫిబ్రవరి వెంకటేశ్వర్లునాత్రమే సహించినది. దినిరక్రమాని వీరేశలింగము పంతులుగారు తమవివేకవర్ధనిని ప్రారంభించినారు. కాబట్టి పురుషార్థప్రదాయినిలోని వృత్తాంతము క్రీ. శ. 1874 నాటిది యనుటచేత నిస్సంశయ ముగా నూరుసంవత్సరములనాటిది యని చెప్పనొప్పును. అప్పుడు ప్రకటితమైనది గొంపవిలోని గంపెకవిలెనుండి సంగ్రహింపబడినది కదా! ఒంపెకవిలెను, మెకంజీ దొరవారికోరికను క్రీ. శ. 1810 ప్రాంతమున వ్రాయబడినవి. కాబట్టి రమారమి నూటయేబదియేండ్ల క్రిందటనుండియు అష్టదిగ్గజముల పేళ్ళు పరిచితములైనవి యని నిశ్చయింపవచ్చును.

ఇక్కడ ముఖ్యమైన విషయమేమనగా పై పట్టికలో నిచ్చిన అష్టదిగ్గజముల పేళ్ళకున్నంతచేట నిటికి మనకు తెలిసినవానికిని స్వల్పభేదము లున్నను నారంభమును తెలుసుకవలెయని మాత్రము నిశ్చిత మగుచున్నది.

మఱియును మొదట అష్టదిగ్గజ కవీశ్వరులనుగూర్చి తెలుపు తిప్పలూరి శాసనమును సుదాహరించినది శ్రీరామమూర్తిగారే. వారె పై పట్టికలో "శంకరకవి—కృష్ణదేవరాయని సంస్థానము లోనివాడు కాడని చెప్పవలసి యున్నది" అని వ్రాసియున్నారు. అయినను వా రిచ్చిన పేళ్ళ ననుసరించి, అష్టదిగ్గజములలోని వారందఱును నాంధ్రకవులనుటలో సందేహము లేదుగదా!

2. వీరేశలింగముపంతులు గారు, ఆంధ్రకవుల చరిత్ర ద్వితీయ భాగమున కృష్ణరాయ చరిత్రయం దివిషయము వ్రాసియున్నారు. పింగళి సూరన రామరాజభూషణ రామకృష్ణులు—కృష్ణదేవరాయని కాలములోనివారు కారని వ్రాసియున్నారు. మఱియు రామభద్ర కవి రామాభ్యుదయము రచించిన యయ్యలరాజు రామభద్రుడే యనియు, మొదట కృష్ణరాయల కాలమున సకల కథాసార సంగ్రహమును, అవెనుక కృష్ణరాయ నిర్యాణానంతరము రామాభ్యుదయము రచించెననియు సందు నిరూపించియున్నారు.

(పుట 27. 1949 ముద్రణము.)

3. క. శే. చిలుకూరి వీరభద్రరావుగారు జెర్నకర్ణాట రాజ్య చరిత్ర 15 వ ప్రకరణము (పుట 209) లో వీరేశలింగముగారి ననుసరించియున్నారు. ఇది 1903 లో మంజువాణిలో ముద్రితము.

4. కీ. శే. కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావుగారు—పై యిరువుర ననుసరించిరి.

5. కీ. శే. ప్రభాకరశాస్త్రిగారు చాటుపద్య మణిమంజరి ద్వితీయభాగమున, కందుకూరి రుద్రకవి విషయములు తెల్పిరి.

"అష్టదిగ్గజము లనంబరగు కవీశ్వరు లెనమండ్రును రాయల యాస్థానమండలమున నెనిమిది దిక్కులను నెనిమిది సింహాసనము

2. *Bulletin of the Government Oriental Manuscripts Library. Vol. 2. No. 2. P. 41 - 57. Edited by T. L. Narasimha Rao.*

మ॥ అనిమేషత్వము మాని దంచలపు మాపస్వేదభావంబు గ్ర
ద్దన వారించె వినాకృశానుదర్భజల విస్తార ప్రవాహంబుతో
డను జేరాంగ కట్టైపెన ప్రమదశ్రేణి నాయాసమై దూఁకె నయ
జ్జ్ఞుని జేయం బ్రమయించె నంతరిని రహిన్ మర్త్యత్వమున్
సంధిలెన్.

—సకలకథాసార సంగ్రహము.

సీ॥ కౌశిక కన్న సంతానంబు గావునఁ
గానక కన్న సంతానమయ్యె
..........................
వరయాగోత్ర విధానమయ్యె నేఁడు
ద్విజకులాదరణ వర్తిష్ణుండుఁ గావున
ద్విజకులాదరణ వర్తిష్ణుఁడయ్యె
వివిధాగమాంత సంవేద్యుండు గావున
వివిధాగమాంత సంవేద్యుఁడయ్యె

గీ॥ కటకటా దాశరథి సముత్కట కరీంద్ర
కటకలిత దాన ధారాస్ఫురితకటకమార్గ
గామియెట్లు చరించు నుత్కట కరీంద్ర
కటకలితదాన ధారార్ద్ర కటకతటుల.

—రామాభ్యుదయము.

సీ॥ కౌశిక కన్న సత్పూనుండు నేఁటికి
కౌశిక కన్న సత్పూనుఁడయ్యెఁ
బుణ్య జనోత్కృష్ట భుగవసంతు నేఁటికి
బుణ్యజనోత్కృష్ట పురుషుఁడయ్యె
ద్విజసఖ్యులనుఁ గూడి యాడుబాలుఁడు నేఁడు
ద్విజముఖ్యులనుఁ గూడ దిరుగుచుండె
గోత్రపావనుఁడైన కొమరుండు నేఁటికి
గోత్రపావనుఁడైన కొమరుఁడయ్యె

గీ॥ మత్తగజదాన ధారార్ద్ర మార్గములను
దగుల నీడల నెప్పుడుఁ దిరుగువాఁడు
మత్తగజదాన ధారార్ద్ర మార్గములను
దగుల నీడల నెప్పుడు తిరుగుచుండె.

—సకల కథాసార సంగ్రహము.

రామభద్రకవి నామ సామ్యమును పురస్కరించుకొని వీరేశలింగము పంతులువారు తమ కవుల చరిత్ర రెండవభాగములో 86 పుటలో అయ్యలరాజు రామభద్రుడే, సకల కథాసార సంగ్రహము రచించెననియు, రెండింటికి కర్త యొక్కడే కాబట్టి ఒక పద్యమును ఒకదానినుండి మఱియొకదానిలోనికి యథేచ్ఛగా గ్రహించినాడనియు వ్రాసియున్నారు. కాని, రామాభ్యుదయము కర్త రామభద్రకవి వేఱు—సకల కథాసార సంగ్రహకర్త రామభద్రకవి వేఱు—అని యీ క్రింది కారణములచే స్పష్టముగా నిరూపింపవచ్చును.

## రామాభ్యుదయకర్త—రామభద్రకవి

1. గ్రంథాంతగద్య.

ఇది శ్రీమహాంటే సప్తపురోపనిషచ్ఛతక నిర్మాణ కీర్తి జగదేక ఖ్యాతిగురు అయ్యలరాజు తిప్పయమనీషి సర్వతోభద్రాభిధాన పౌత్రక్కయామాత్య పుత్త్ర పరిశీలిత రామానుజ మత సిద్ధాంతనర్మ ముమ్మడి వరదాచార్య కటాక్ష వీక్షాపాత్ర హృదయ పద్మాధిష్ఠిత శ్రీ రామభద్రకవి ప్రణీతంబైన రామాభ్యుదయమను మహాప్రబంధంబు.

ఈ గద్యలో చెప్పకపోయినను రామభద్రకవి వంశీయుఁడయ్యలరాజు నారాయణకవి, వారిగోత్రము కౌండిన్యగోత్రమని చెప్పుటచే నీ రామభద్రకవి కౌండిన్యగోత్రుఁడు.

2. వైష్ణవ మతప్రవిష్టుఁడు.
3. ఈతడు తొలినుండియు రామభక్తుఁడు.
4. రామాభ్యుదయకర్తశైలి ప్రౌఢమై సంస్కృతాంధ్రపద చమత్కార ప్రయోగములతో నొప్పుచుండెడు ప్రత్యేకవిశిష్టత గలది. ఆదినుండి యంత్యమువఱకు నొకేరీతి నుండును.
5. ఈ రామభద్రకవి కవిస్తుతిచేసినను ప్రత్యేకముగా తనకు సంబంధించిన వారిని పేర్కొనలేదు.

## సకల కథాసార సంగ్రహకర్త—రామభద్రకవి

ఇది శ్రీ రామభద్రప్రసాదలబ్ధకవిత్వ మహత్త్వ విశారద నాగయ సత్కవి మిత్ర కౌశికగోత్రపవిత్ర రామభద్ర మహేంద్ర రామభద్రప్రణీతంబైన సకల కథాసారసంగ్రహంబు.

పై గద్యనుబట్టి యీ రామభద్రకవి కౌశికగోత్రుఁడు.

సకల కథాసార సంగ్రహావతారికవలన నీ యితఁడు అద్వైతి. ఈతఁడు బాలకృష్ణభక్తుఁడు. ఈ గ్రంథమునందే, [1]కృష్ణరాయలీ కవినిఁగూర్చి

"నీవును బాలకృష్ణపద నీరజభక్తుఁడ వార్యచిత్తమో
దావహ సద్గుణుండవు అని పలికినట్లుగా చెప్పియున్నాడు.

సకల కథాసారసంగ్రహకర్తశైలి ఇతర కావ్యానుసరణములను దలపింపఁజేయుచు ప్రౌఢపదప్రయోగములతోనుండక ధారాశుద్ధి గలిగియుండును.

ఇతనికి శారద కవి యను మిత్రుఁడు గలడు. కవి స్తుతిచేయుటయే గాక పలుకూచి సాహిత్యలక్షణ చిత్ర కవిత్వప్రభావంబు లొక్కొక్కచోటం గనుపట్ట అని వ్రాసియున్నాడు.

సకలకథాసార సంగ్రహము వ్రాతప్రతి సంఖ్య 858. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము. దీనికి మఱియొక ప్రతి గలదు. దాని సంఖ్య 856. ఈ రెండును కాగితప్రతులు. బ్రౌనుదొరవారు దీనిని 1840 అక్టోబరులో వ్రాయించినారు. వారి యభిప్రాయము ననుసరించి యిది ప్రశస్తగ్రంథము కాదు. ఇందు 8 ఆశ్వాసములున్నవి. ఎనిమిదవ యాశ్వాసములో 799 పద్యము లున్నవి.

1. ఈ బాలకృష్ణవిగ్రహమును కృష్ణదేవరాయ లుదయగిరిదుర్గమును జయించినప్పు డందున్న బాలకృష్ణవిగ్రహమును తెచ్చి విజయనగరరాజధానిలో ప్రతిష్ఠించెను. దర్శనీయమగు నీ బాలకృష్ణవిగ్రహము మద్రాసు మ్యూజియమునందున్నది. (మాడుడు ప్రభాకరశాస్త్రిగారి వ్యాసము.

7. చింతలపూడి ఎల్లకవి లేక రాధామాధవకవి. ఈతడు రాధామాధవములో స్పష్టముగా

శా. రాధామాధవమున్ రసోత్తరముగా రంజిల్ల నిర్మించెనే
శాస్త్రజ్ఞోపరత్వంబున కృష్ణరాయ విభుకర్ణాటేశు మెప్పించి నా
ధాత్ర్యప్రతిమాన సత్కవులలోనన్ భూషణాశ్రేణితో
రాధామాధవ నామమందిన జగత్ప్రఖ్యాత చారిత్రుడన్

అని చెప్పుకొన్నాడు. ఇక్కడ కృష్ణరాయలు, ధాత్ర్యప్రతిమాన సత్కవులు అనగా అంధ్రకవితా పితామహ అల్లసాని పెద్దన పేర్కొనబడినారు. ఇంతేకాక, గ్రంథమందు పలుచోట్ల శ్రీ కృష్ణుని గూర్చి చెప్పుకొనుచుండిన, "అరియుచి శ్రీ కృష్ణరాయ దాత్రీకలంగన్" అని కృష్ణరాయనామముతో పేర్కొన్నాడు. ఈతడష్టదిగ్గజములలో వాడు కావుననే నాంతరంగికముగా నిట్లు వ్రాయగలిగినాడు. మఱియు నీతడు కృష్ణరాయని వెనుక అచ్యుతరాయని ఆస్థానమున నున్నవాడు. అతని స్కంధావార లేఖకుడు మంత్రియగు సంజయ తిమ్మరసునకు కృతినిచ్చినాడు. ఈ ఆస్థానసంబంధము పూర్వ మాతడు కృష్ణరాయని యష్టదిగ్గజములలోని వాడనుట స్పష్టము చేయుచున్నది.

8. కందుకూరి రుద్రకవి ఈతడు కృష్ణదేవరాయలవారి యష్ట దిగ్గజములలో నొకడని వారి వంశవృత్తాంతము దెలుపుచున్నది. 1 మఱియు నీతడు రాయలయాస్థానమున నీశాన్య సింహాసనము నధిష్ఠించెనని యందు చెప్పబడినది. ఇదియొక్కటియే రుద్రకవి యష్టదిగ్గజములలోవాడని చెప్పుటకు చాలును—దీనినిబట్టి మనకొక నూతన విషయము తెలియుచున్నది. రాయల కొల్వుకూటముననున్న భవనము భువనవిజయముగదా ! భువన భారమును భరించునవి అష్టదిగ్గజములు—కావున భువనవిజయ నామ మన్వర్థమగునట్లుగా రాయలవారు కొల్వుకూటములో—ఎనిమిది దిక్కుల నెనిమిది సింహాసనములుంచి, అందెనమండ్గురు అష్టదిగ్గజ కవీశ్వరులను వానిపై కూర్చుండ చేసెడివారని తెలియుచున్నది.

ఈ భువన విజయము, పూర్వరాజ భవనములలో నొక తరగతి భవనము—భువనవిజయమను పేరితో గాక భువనతిలకము భువనమండనము అను పేళ్లతో కొన్ని భవనములనుగూర్చి భోజుడు 'సమరాంగణ సూత్రధారము' అను గ్రంథములో నిచ్చియున్నాడు.1 అందు అష్టసింహాసన ప్రశంసలేదు. బహుశః కృష్ణరాయలే దీనిని మొదట యీ భవనములలో నిర్మాణము చేయుటకు హేతుభూతుడై యుండును. అష్టదిగ్గజములను వ్యవహారము కృష్ణరాయల కాలమునుండి యే వ్యవహారము కలుగుట కిదియే కారణమై యుండెడును.

పై చర్చయొక్క సారాంశమిది. కృష్ణరాయల కాలమున అష్టదిగ్గజములనబడు నీ క్రింది యెనమండుగురు కవులు విలసిల్లిరి.

(1) అల్లసాని పెద్దన (2) నంది తిమ్మన (3) మాదయ్యగారి మల్లన (4) ధూర్జటి (5) తెనాలిరామలింగ కవి (6) రామభద్రకవి (7) రాధామాధవ కవి (8) రుద్రకవి—

విరచించిరని అష్టదిగ్గజములని చెప్పబడిన కవి సార్వభౌముల కర్ణాట కవుల తెలుగుమాత్రమును కాదు.

ఈ అష్టదిగ్గజముల విషయము కృష్ణరాయని కొలువు నుండి ప్రారంభమైనది. గోల్కొండ నవాబులు మొదలగువారి సంస్థానములలో అష్టదిగ్గజ కవులుండిరి. నూజివీడు జమీందారి మండలమున వెన్నెలకంటి సంస్థానమున ... మధురకవి, ఒంటకవి, చిత్రకవి, నిరుపమకవి, ... ఘంటకవి అని అష్టదిగ్గజములుండెడివారు. ఇట్లే పెద్దాపుర సంస్థానమున కూడ అష్టదిగ్గజములు వెలసినట్లు తెలియుచున్నది. మధుర నాయకరాజుల చెంగట తిరుమలరాజు కొలువున నుండిరి. ... వెంకట నారాయణ కవి ... పెద్ద వెంకటరాయకవి, ... అప్పయ కవి, సారంగపాణి, ... అప్పయాచార్యులు, రాయ... కవి. ... వెంకటాచలకవి అనువారు దీని సంబంధ కవులు.

అష్టదిగ్గజములనుగూర్చి నాకు తెలిసిన విషయములను కొన్నింటినిందు ప్రకటించితిని. భావికాలమున ఇంకను విశేషములు బయలుపడవచ్చును. సర్వప్రాధాన్యము గల ... అని చెప్పదగిన కృష్ణరాయని కొలువున విలసిల్లిన అష్టదిగ్గజము లెవరో యింతవఱకు నిర్ణీతము కానందున ఇంతగా వ్రాయవలసివచ్చినది. రాయలవారి కాలమున వెలసిన కవు లెనమండ్రును పెద్దనాది కవులే యనియు వారు పై నుదహరించినవారనియు నా వ్యాసము యొక్క సారాంశము.

---

1 ప్రాసాద మేవం భువనతిలకమ్ పరిసప్తే
చతురశ్రీ కృతేక్షేత్రే భాగద్వాదశ భాజితే
చతుష్క భాగికో మధ్యే చతుః స్తంభో విధీయతే
తద్బహిర్భాహిరో ఒళిందో ద్వితీయో ఒపిచ భాగికః
నవకోష్ఠాంశ్చ కర్ణేషు ప్రాసాదాన్ వినివేశయేత్
ద్వారుకంచీ కర్తవ్యం తేషామంతర సంశ్రయమ్
తతో ఒర్ధ్వ భాగికే భిత్తిః కర్తివ్యా సర్వతో బహిః
భద్రే భాగాయతో భద్రావినిష్క్రాంత శ్చతుర్ధరః
చతుష్క భాగి కాళింప ద్వయేన పరివేష్టితః
త్రిభాగ విస్తృతం భద్రం తద్బహిర్భాగసంగతమ్
భాగికం ప్రతి భద్రంచ కార్యాదుభయతః సమమ్
భాగార్థ భాగతో భిత్తిర్భద్రస్య పరితోభవేత్.
విధిరేష విధాతవ్యో.

'భువనమండనము' భువనతిలకము. అను రాజభవనములు భోజుని చతురాంగణ సూత్రధారము — 30 అధ్యాయము రాజగృహాధ్యాయము భువనమండనము. *Vol 1 Gaekward Seris.*

అస్యైవ పీఠేనిర్ముక్తశాలాభిః పరితో ఒష్టభిః
అన్యోన్యశాలా సంబద్ధే యదానాశేషదీయతే
కర్ణప్రాసాద కోష్ఠైః కోష్ఠైః శాలోర్ధ్వ స్తైర్యుతః
ప్రాసాద సుందరోజ్ఞేయః తదాభువన మండనం.

పండిత డి. గోపాలాచార్యులవారి

# జీవామృతం

ఆరోగ్యమునకు
బలమునకు

ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్, మదరాసు-17

---

శ్రీవత్సవారి ఉగాది అభినందనలతో

శ్రీవత్సవారి

★ **వైటోడెంట్** ★

పండ్లపొడి



దంతక్రిములను సంహరించి
నోటి దుర్గంధములను పోగొట్టి
చిగుళ్ళను పుష్టిపరచి
పండ్లను శుభ్రపరిచి

**తెల్లగా నుంచును**

**శ్రీవత్స కెమికల్స్ & డ్రగ్స్ లిమిటెడ్,**

మందులు, రసాయనములు తయారుచేయు సంస్థ.

మద్రాసు - 30.

ఫోను: 55746. గ్రాము: "కాల్కో డ్రగ్స్"

---

సమస్యలు పరిష్కారమైనవి...!

* [illegible]
* [illegible]
* [illegible]
* [illegible]
* [illegible]
* [illegible]

ఒక్క చిటికెడు

**రాజులు నస్యము** ([illegible]) ను

విధిగా వాడి తమ సమస్యలను చక్కగా పరిష్కరించుకొనుచున్నారు. **మరి మీరో?...**



20 సంవత్సరాలుగా ఆంధ్రదేశమందేగాక యావద్భారత దేశమందును ప్రఖ్యాతిగాంచినది.



తయారు చేయువారు:

**కే. జి. రాజులు అండ్ బ్రదర్సు**

బకింగుహాం పేట పోస్టు, విజయవాడ - 2.

## కథానికః

శ్రీ రావూరి భరద్వాజ

ఆ కాలంలో గుణనిధి పేరు ఆబాల గోపాలనికి సుపరిచితమైనదే!

అతనికి విశాల సామ్రాజ్యముండటమూ, ఆ సామ్రాజ్యం సకల సుఖాలకూ నిధానమై ఉండటమూ అందుకు కారణంకాదు. అతడు విద్యావంతుడు. ఆ కారణాన పండితులను కవులను అమితంగా ఆదరించాడు. స్వతహాగా కొన్ని కావ్యాలను రచించాడు. ఎన్నిటినో అంకితంపొందాడు. నిజానికివిగూడా సరైన కారణాలు, కావు. డబ్బు కాశించిన కవులు, ఏ రాజునైనా ఇంద్రుడని చంద్రుడనీ పొగడవచ్చు. దానకర్ణుడనీ, అభినవదధీచి అని కీర్తించవచ్చు. కాని సామాన్య జనం అలా అంటుందా? పట్టుమని పాతికమంది కవులు కీర్తించినంతమాత్రాన, అశేష జనావళి ఆ మాటలను విశ్వసిస్తుందా? లేదుగానీ గుణనిధి ఏలుబడిలో ఉన్న ప్రజలందరూ అతన్ని కీర్తిస్తున్నారు. సరయిన పరిపాలన—అంటే—ప్రజల కష్టనిష్ఠురాలు తనవిగా భావించి చేసే పరిపాలన, గుణనిధికి వెన్నతో బెట్టిన విద్య.

జ్రున చీమకుండా, తల్లిపొత్తిళ్ళలోని పసిపాపలలాగా ప్రజలు సుఖజీవనం చేస్తున్నారు. అదృష్టవశాత్తూ ఆ దేశపు నైసర్గిక పరిస్థితులుగూడా అందుకు అనుకూలంగా ఉన్నాయి. రెండు వైపుల మహానది ప్రవహిస్తున్నది. ఒకవైపున పెట్టనికోటలాగ పర్వతపంక్తులున్నాయి. ఈ మూడుదిశలనుండీ శత్రుభయమన్న మాట లేదు. నాల్గవదెస మరొక రాజ్యమున్నది కొన్ని దశాబ్దాల నుండీ, ఈ రెండురాజ్యాలూ అన్నదమ్ములలాగా మెలగుతున్నాయి. సంపత్సమృద్ధం కావడంచేత విద్యాసముపార్జనాసక్తులు, లలిత కళాప్రియులు, దేశంనిండా పిలపిలలాడుతున్నారు. జీవితం, జీవితంలాగా కాక, రుచిరస్వప్నంలాగా వారు అనుభవిస్తున్నారు.

అయితే ఈ రుచిరస్వప్నం ఎక్కువకాలం ఉండలేదు. అది భగ్నమయ్యే సమయం సమీపించినట్లు అనేక చిహ్నాలు హెచ్చరించాయి.

ఒకనాడు గుణనిధి కొలువులో ఉండగా, భటుడొకడు తత్తరపాటుతో ప్రవేశించి, గౌరవ పురస్సరంగా వంగి అభివాదం చేసి, ఉత్తరమొకటి రాజుగారికిచ్చాడు. సాహిత్య మీమాంసతో, ఊగిసలాడిపోతున్న సభ ఒక్కసారి మ్రాన్పడిపోయింది. రాజుగారు లేఖను మంత్రికిచ్చాడు. మంత్రివదనం వాడిపోయింది. కొన్ని క్షణాలపాటు మంత్రిగారు మాట్లాడనుగూడా మాట్లాడలేక పోయారు. తప్పదు గనుక కొసకు లేచి నిలబడి, సభికుల నుద్దేశించి ఇలా అన్నాడు :—

"మహా జనులారా" మంత్రి కంఠం జీరపోయింది. "ఇంత కాలంనుండీ మనం ఏ కష్టమూ ఎరుగక సుఖంగా రోజులు వెళ్ళబుచ్చాం. నిజం మాట్లాడితే మనకు 'సుఖం'మీద మొఖం మొత్తింది గూడాను. భగవంతుడు గూడా బహుశః ఇదే అభిప్రాయంతో ఉన్నాడేమో మరి! ఏనాడూ వినని మహావిపత్తు ఇప్పుడొకటి మనల్ని చుట్టుముట్టనున్నది. అణకువగల బానిసలాగా, ఇన్ని రోజులనుండీ అణిగిమణిగి ఉంటున్న మహానదికి తీవ్రంగా వరదలు వస్తున్నట్లు తీర రక్షకభటులు ఇప్పుడే వార్తను పంపించారు. వరదల ఉధృతాన్ని బట్టి చూస్తే, మహానది ఏ క్షణంలోనైనా, పొంగి దేశాన్ని ముంచెత్తగలదని తీరరక్షణశాఖ ప్రధానోద్యోగి అభిప్రాయపడుతున్నాడు. ఐనా మనం భయపడవలసిన పనిలేదు. సైనికశక్తినంతా తరలించి, వరద ప్రమాదాన్నుంచి దేశాన్ని రక్షించే ప్రయత్నాన్ని ఇప్పటినుండే ప్రారంభించవలసిందిగా సర్వసైన్యాధ్యక్షునికి ఉత్తరువు లిస్తున్నాను..."

ముఖ్యమంత్రి ఏదో చెబుతూనే ఉన్నాడు. సభికులు వింటూనే ఉన్నారు. జనాన్ని తొలగద్రోసుకొంటూ మరొక భటుడు ప్రవేశించి మరొక జాబును మంత్రిగారికిచ్చాడు. మంత్రి నడుము విరిగినవాడిలాగా, ఆసనంలో కూలబడ్డాడు. రెండు చేతులమధ్యా తల నిరికించుకొని నేలచూపులు చూస్తూ ఉండిపోయాడు. ఆ ఉత్తరంలోని విషయమేమిటోనని సభ గుసగుసలు పోయింది. ఒకరిద్దరు 'రెండవ లేఖలోని విశేష మేమిటని గూడా అడిగారు.

మంత్రిగారు చాలా సేపటికిగాని తెప్పరిల్లలేదు. అయినా ఆయన నిలబడలేకపోయాడు. గుణనిధి అనుజ్ఞ తీసుకొని, కూచునే ఆ లేఖలోని విషయం వివరించాడు.

"నదీప్రవాహం గట్లు త్రెంచుకొని దేశంమీద పడ్డది. ఉత్తుంగ తరంగాలు గ్రామాలకు గ్రామాలను నాశనం చేస్తున్నాయి. మహానది మహావేగంతో, కోపించిన మత్తేభంలా దేశంమీదకు పరుగు లెత్తుతున్నది. మహాజనులారా! ఒక్క మనవి!!" ఈ మాట అని మంత్రి కొన్ని క్షణాలు మౌనంగా ఉండిపోయాడు. అతని కన్నుల నుండి అశ్రువులు టపటపమని నేల రాలాయి "ప్రభుత్వం మీకు చేయగలిగిన సహాయమంతా చేస్తుంది. స్వీయశ్రేయస్సుకన్న, ప్రజా శ్రేయస్సే రాచరికం వారికి ముఖ్యధర్మమని, మీ రెన్నిసార్లో రుజువు చేసుకొన్నారు. మహారాజులు, ఈ విపత్తులోగూడా ఆ ధర్మాన్ని విడనాడరని నేను హామీ యిస్తున్నాను. కానీ, ఇంతటి

యందలి యాదరముచేఁ బారిజాతవృక్షమునకై భగవంతుఁడైన కృష్ణునితోఁ బోలుతఁ బోర నూహించిన యింద్రుఁడే కృష్ణుఁ డొక ద్రోహియైనసిన్నాఁట బారిజాతమును మరల నాకమునకుఁ బంపెదనని పల్కినప్పుడు మాటాడ నోరకుండెక యీ యవలారమునఁ గృష్ణుఁ డుర్విపైనుండునంతకాలము దాని నుంచుకొనవచ్చునను తుదముక వింతగానున్నది. మత్స్యాదకై యౌఁతఁ బిల్లు పలుక యూపివ్వఁ బడి యథార్థముగనే గ్రహించి వృక్షమును శాశ్వతముఁగానే స్వాయత్తము గావించుకొనెను. నారదుఁడు హాస్యోక్తితోఁ బారిజాతప్రసూనము గుణగణములు వర్ణించుచు నది లతాంతాయుధ సంగరసందర్భమునఁ గానించునని తిమ్మన చెప్పిన తోడ్పాటును విడిచి చిలకమర్తి వారౌచిత్యమును బోషించియున్నారు. మూలమునవలెనే నాటకమునఁగూడ సత్యభామ గర్వాభిమానములును స్వాధీనపతికాత్వమును జక్కఁగా వివరింపఁబడినది. కృష్ణుఁడనునయించుచుఁ గోపగృహమునఁ దనకు నమస్కరించినప్పుడు ప్రణయావివశయై సత్యభామ యాతని వామపాదముతోఁ దన్నినను తరువాతఁ గొంచెము పశ్చాత్తాపపడినట్లు వర్ణించి నాటక కవి యామె శీలమున కింపక వన్నె చేకూర్చినాఁడు. సత్యారుక్మిణుల వాక్కలహమును, వారు తప్పెవరిదని కైరవునడిగి నప్పుడాతఁ డొసంగిన హాస్యరసపూరితమైన యుత్తరమును వినోదావహములుగా నున్నవి. మూలమునవలె నాటకమున రుక్మిణి కేవల సత్త్వగుణ సంపన్నురాలు కాదు. సత్యభామ యందంత కాకపోయినను సపత్నీజన సహజములైన యీర్ష్యాద్వేషాదు లామెయందును స్వల్పముగా వర్ణింప బడినవి. కృష్ణుఁడు సత్యభామతో నాకలోకమున కరిగినప్పుడు గావించిన దిక్పాలవర్ణనము కథనమార్గమునుబట్టి కొంత విసుగు కలిగించుటయే కాక యనావశ్యముగాఁ గూడఁ దోచుచున్నది. అసలా రంగమును దొలగించినను నాటకకథ కంతి యంతరాయముండదు. ఇంకఁ జతుర్థాంకమునందలి రంభా సంభోగవృత్తాంతమును, వీరుఁడైన క్షత్త్రియునకును సోమయాజియైన విప్రునకును జరిగిన కలహమును కేవల హాస్యపరమునకై కల్పింపఁబడినట్టివి. ఆ ప్రసంగము కొంచెము మించుమించుగా నంకమంతయు నాక్రమించి దీర్ఘతరమై కథాగమనమున కాటంకముగా నుండుటయే కాక కొంత యనుచితముగాఁ గూడ నున్నది. ఇట్లే యీ సందర్భమునందలి రంభా నాట్యప్రదర్శనమును సామాజిక సంతోషణమునకై కల్పింపఁబడినట్టిదే. అసలీ చతుర్థాంకమును బూర్తిగాఁ దొలఁగించి కృష్ణుని నాకప్రయాణమునే విష్కంభములోనో సూచించిన బాగుగా నుండియుండును.

పారిజాతాపహరణమునందును ప్రధాన రసము వీరమే. కాని యిందిది యాద్యంతము శృంగార హాస్యములతో మిళితమైయున్నది. పారిజాత వృక్షమును సత్యభామ సౌధము పెరటిలో నాటింతునని కృష్ణుఁడు పూనిన యుత్సాహము పంచమాంకము చివర దానిని గొని నాకమునుండి తిరిగి వచ్చుటతోఁ బరిపుష్టమై సిద్ధినొందుచున్నది. ఇందలి కైరవునిహాస్యము లలితమధురమై యాహ్లాదకరముగా నున్నది. అతఁడు సగము నిద్దురలో శాంసపదికను గనకలతయను కొని యామె ముందే యామెను నిందించుట చమత్కారభాసురమై యొప్పారుచున్నది. పలువురు భార్యల పెండ్లాడి యుండఁజెని వ్యక్తి కొండింప యత్నించు మగనియగచాట్లీ నాటకమున రమణీయముగా హాస్య గర్భముగా వర్ణింపబడినవి.

ప్రసన్న యాదవము క్రీ. శ. 1906 నాటికి బూర్తి చేయఁబడినది. కృష్ణుఁడు లోకకంటకుఁడైన నరకాసురుని వధించి యాతని కుమారుఁడైన భగదత్తు ననుగ్రహించుట యిందలి యితివృత్తము. ప్రసన్నుఁడైన యాదవు నధికరించి వ్రాయఁబడిన దగుటచే నీ నాటకమున కీ నామము సార్థకమగుచున్నది. అదిగాక శౌ మంతకమునందే గయోపాఖ్యానమును ప్రచండయాదవమను పేర రచించి యుండుటచేఁ గవిగారు చమత్కారమునకై దీనికిఁ బ్రసన్నయాదవమని పేరు పెట్టియుండిరి. ఉత్తర హరివంశ భాగవతములందున్న నరకాసుర సంహార వృత్తాంతమే యీ నాటకమునకు మూలము. మహేంద్రుఁడు బృహస్పతి హితబోధ ననుసరించి దేవతలు నరకుని చేతఁ బడు నిక్కట్లు విన్నవించుటకై మాణిభద్రుని ద్వారకానగరమునకు రాయబారిగాఁ బంపుట నాటకమునఁ గ్రొత్తగాఁ గల్పింపఁబడినది. ఈ నాటకము చాలవఱకు సంస్కృత లక్షణాను గుణముగ రచింప బడినది. గయోపాఖ్యానమందువలె యుద్ధము నిందు రంగమున నే వర్ణింపక కవిగారు తృతీయ చతుర్థాంకముల యారంభములందు విష్కంభములచే సూచించియున్నారు. ప్రథమాంకమునందు నరకుఁ డింద్రునితోఁ గావించిన సంభాషణ మాతని యౌద్ధత్యమున కెంతయుఁ దగియున్నది. ద్వితీయాంకమునందలి నరకుని విరహవేదనా వర్ణనము ప్రబంధమార్గమున నడచినది. ఊర్వశీ నరకాసురుల సంభాషణ ముత్తర హరివంశమునందువలెనే సరసములైన యుక్తి ప్రత్యుక్తులతోఁ గూడి కమనీయముగా నున్నది. మాణిభద్రుఁడు కృష్ణునితో దేవతలు పడుపాట్లు విన్నవించు సమయముననే యదరి క్రౌర్యము నాసులైన తాపసులు కూడ నరుదెంచి నరకునియుఁ దదను చరులయు దుండగముల వర్ణించుట కృష్ణుని కోపాగ్ని కాజ్యధారయై యాతని వెంటనే కార్యోన్ముఖునిఁ గావించినది. చివరి యంకమునఁ గృష్ణుఁడు భగదత్తు నాదరించి యనుగ్రహించుటయు, నరకునిచేఁ జెఱపెట్టఁబడిన రాజకన్యకల విడిపించుటయే కాక వారిని పెట్టవట్టు నంగీకరించుటయు నతని యార్తరక్షణ పరాయణతకుఁ దార్కాణముగా నున్నది. భర్త మూర్ఛాక్రాంతుఁడైనతఱి సత్యభామ చూపిన పరాక్రమము లోకోత్తరమై సరియైన శిక్షణ మొసంగఁబడుచో స్త్రీలుసైత మెట్టి విద్యలనైన నేర్వఁజాలుదురనుటకు దృష్టాంతమై యొప్పుచున్నది.

ప్రసన్న యాదవమునఁ గూడఁ బ్రధానరసము వీరమే. ఈ రసమునకు నాటకారంభమున నరకుఁడును దుదపరి సత్యాకృష్ణులును నాలంబనములై యొప్పుచున్నారు. ద్వితీయాంకము శృంగార రసాభాసమునకును ద్వితీయాంకము కరుణరసమునకును నెలవులై యున్నవి. భగదత్తుఁడు తండ్రికై విలపించిన ఘట్టమునఁ గరుణ రసము బాగుగాఁ బోషింపఁబడినది. మందపాల వ్రజకంతుల సంభాషణములలోఁ గానవచ్చు హాస్యము కృత్రిమమై పేలవతాదోషమున కాకరమగుచున్నది. నరకుని మరణానంతరము వారేడ్చిన యేడ్పులో దుఃఖముకంటె హాస్యపుఁబాలే యెక్కుడు. కరుణహాస్యముల కెన్నఁడును పొత్తు కుదురదు. కాని సమ్మేళనము విశృంఖలమై

యించుక వెగటు కలిగించును. చతుర్థాంకమునఁ గృష్ణ నరకాసురులకు జరిగిన సంభాషణము కేవల వాగాడంబరమై, యాత్మశ్లాఘల కాలవాలమై యనవసరముగాఁ బొడిగింపఁబడినది. ఆ యంకమున నచ్చిన కౌశ్యము మృగ్యము. స్వల్పములైన ఈలోపముల నటుంచి చూచినచో రసపాత్రపోషణమునను, సంభాషణ చమత్కారమునను, కథాసంవిధానమునను ఈ నాటకము సర్వవిధముల మిన్నగా నున్నది. పంతులుగారికిఁగూడ నీ నాటకమునందే యభిమాన మెక్కువ. "నా నాటకములలో గయోపాఖ్యానము శ్రేష్ఠమని జను లభిప్రాయపడుదురు. ప్రసన్నయాదవము శ్రేష్ఠమని నా యభిప్రాయ"మని స్వీయచరిత్రలో వారాయభిమానమున కక్షరరూప మొసంగియుండిరి.

చతుర చంద్రహాసము మరణాంతమైన నాటకము. తాను కావించిన ప్రయత్నములన్నియు వ్యర్థమై శత్రువుల కుపకారములుగాఁ బరిణమించుటయే కాక తన కపకారులగుటకూడ సంభవించుటచే దుష్టబుద్ధి వేదనాగ్ని దందహ్యమానుఁడై స్వయముగాఁ బొడుచుకొని చనిపోవుటతో నాటకము ముగియుచున్నది. ఈ నాటకమునకుఁ జతుర చంద్రహాసమని పేరుపెట్టఁబడినను ఇందు నాయకుఁడు దుష్టబుద్ధియగు బాదరాయణుఁడే. ఇందు జరిగిన కథాతంత్రమున కంతకును సూత్రధారుఁ డాతఁడే. అతనియందు రాజద్రోహము, స్వార్థపరాయణత, లోభము, క్రూరత మున్నగు గుణములన్నియు మూర్తీభవించియున్నవి. తాను జేయఁదలఁచిన కార్యమును సిద్ధింపఁజేయుటకై యాతఁ డెట్టిఘోరము నొనర్చుటకును వెనుదీయఁడు. చివరికి నిజాశాపరిపూర్తికై యాతఁడు సుగుణాలవాలయైన తనకూఁతు సౌఖ్యమునుగూడ మంటఁగలుప యత్నించెను; సాధువైన యింద్రదత్తునిఁ గపటమార్గమున బంధించెను; సౌశీల్యసంపన్నుఁడైన చంద్రహాసుని రెండుపర్యాయములు చంపింప నిశ్చయించెను. ఆతఁడు పురుషకారమునే నమ్మి దైవమును బూర్తిగా విడనాడియుండుటచే నాతని యత్నములన్నియు సుమంత్రాధిష్ఠితములయ్యు బూడిదలోఁ వ్రేల్చిన హవ్యములవలె నిష్ఫలములైపోయెను. కవి యాతనియందుఁ జిత్రించిన దౌష్ట్యము ప్రతిక్షణమందును గోచరించి సామాజికుల కాతనియెడ హేయభావమునే కలిగించునుగాని సానుభూతి కలిగింపఁజాలదు. పైఁగా దుష్టుఁడైన యాతఁ డట్టిచావు చచ్చుట వారి కెంతో యానందమును జేకూర్చును. అందుచే నీనాటకము మరణాంతమయ్యు విషాదాంతార్హతకు దూరమైపోయినది. నిజమున కీనాటకమునఁ జంద్రహాసుఁడు ప్రదర్శించిన చాతుర్యమేమియును లేదు. సహజ సుగుణశాలియైన యాతఁ డదృష్టవశమునఁ బెక్కుగండములు తప్పించుకొని మహైశ్వర్యమునకుఁ బాత్రుఁడయ్యెను. చతుర చంద్రహాసపదములందుఁ గానవచ్చు నాద్యక్షరసామ్యము శ్రవణసుభగమైయుండుట యను కారణముతప్ప నీ నాటకమున కాపేరుంచుట కింకొక కారణము కానరాదు. ఈ నాటకమున దుష్టబుద్ధిజీవితము పురుషకారము యొక్కయల్పతను, జంద్రహాసునిజీవితము దైవముయొక్క బలీయస్త్వమును జక్కఁగా వ్యక్తముచేయుచున్నవి.

ఈ నాటకమున దుష్టబుద్ధిపన్నిన పన్నాగము లెప్పటికప్పుడే తప్పక ఫలించునట్టివిగాఁ గనఁబడి తుద కన్యథాపరిణమించినవి. అవి నిష్ఫలములగుటకు దైవము చాలకపోవుటయే కారణము. కాని దుష్టబుద్ధి ప్రజ్ఞాలోపము కారణము కాదు. అతఁడు హేమవర్మకుఁ బులిందరాజుపైఁ గోప మెక్కించినప్పుడు చూపినబుద్ధిచాకచక్య మింతింతని చెప్పరాదు. తన యత్నము లన్యథాకరింపఁబడినప్పు డాతఁడు నిరుత్సాహమును గాని నైరాశ్యమునుగాని ప్రదర్శింపక ధీరుఁడై క్రొత్తక్రొత్త మార్గములకు విత్తనములు చల్లుచుండుట యెంతో ప్రశంసనీయముగా నుండును. మదనునికిని దుష్టబుద్ధికిని శీలమునను, వర్తనమందును హస్తిమశకాంతర మున్నది. ఆ తండ్రికొడుకుల ప్రవృత్తిలోఁగల తారతమ్యము నాటకమున స్పష్టముగా వివరింపఁబడినది. ఏ యన్యాయము నెఱుఁగని మదనుఁడు, చివరఁ గాళికాలయమున భీమభైరవులచే ఖండింపఁబడి తండ్రి దౌష్ట్యమునకు బలియగుట విషాదభావమున కెంతో వన్నె చేకూర్చుచున్నది. చంద్రహాసుఁడు కావించిన వనవర్ణన మించుక దీర్ఘమై ప్రబంధమార్గమునుబట్టినది. నాటక కార్యము రెండుమూఁడు ముఖ్యసన్నివేశము లందాకస్మిక సంఘటన (*Chance*) పై నాధారపడియున్నది. చంద్రహాసుఁడు నిద్రించుచున్న సమయమున విషయ కాంచనమాలతో నచ్చటికేగి యుత్తరమును జూచి యందక్షరపరివర్తనము చేయకుండినచో నాటకకథ యింకొకవిధముగా జరిగియుండును. అట్లే కాళికాలయమునకుఁ జంద్రహాసునికి బదులు మదనుఁ డేగకుండినచో భీమభైరవులు దుష్టబుద్ధి తలంచినట్లేమియు నాలోచింపక యాతనినే సంహరించియుందురు. కథాకార్య మీ విధముగా నాకస్మికాపతితములైన సంఘటనలపై నాధారపడియుండుట తత్సంఘటనమునందలి లోపమేయని విమర్శకుల యభిప్రాయము. మదనుఁ డుత్తరమును జూచినంతనే యిసుమంతయు నను మానింపక తండ్రిపరోక్షమునందే సోదరికిఁ బెండ్లి కావించుటయు, నంత పట్టుదలయుఁ బ్రతిభయుగల దుష్టబుద్ధియందు మార్పు కావించిన వారెవరో పరిశీలింపక చంద్రహాసుఁడే యట్లొనర్చి తన్ను వంచించియుండునని తలంచి యూరకుండుటయు వింతకలిగించుచున్నవి.

చతుర చంద్రహాసమునందలి ప్రధానరసముకూడ వీరమే. తన యభీప్సితముల సమగ్రసిద్ధికై యొనర్చు ప్రయత్నములందు దుష్టబుద్ధి ప్రదర్శించు నుత్సాహ మిందు స్థాయిభావము. చతుర్థాంకమున విషయాచంద్రహాసు లొండొరులఁ గాంచి వలపునకు లోనైన సందర్భమున శృంగారరసము పోషింపఁబడినది. కుమార మరణము నారసి దుష్టబుద్ధి కాళికాలయమున విలపించునెడఁ గరుణరసచ్ఛాయలు గోచరించుచున్నవి. మొత్తముమీఁదఁ గ్లిష్టతరమైన కథయు, సిద్ధప్రాయములైన దుష్టబుద్ధియత్నములు హఠాత్తుగా భగ్నము లగుటయుఁ, జంద్రహాసుఁడు దుస్తరములైన యాపదలు తరించి తన యోగ్యతకుఁ దగిన యైశ్వర్యము నొందుటయు నాటకానురక్తిఁ బుష్టి చేకూర్చుచు సామాజికుల మానసముల దృఢముగా నాకర్షించుచున్నవి.

ప్రహ్లాద చరిత్రము భాగవతమునందలి కథ యాధారముగా వ్రాయఁబడిన నాటకము. ఇం దాఱంకములున్నవి. మొదటి నాలుగంకములకును ప్రహ్లాద చరిత్రమునకును నంత సన్నిహిత సంబంధము లేదు. విష్ణువు శ్వేతవరాహ రూపమున హిరణ్యాక్షుని వధించుటయు, హిరణ్యకశిపుఁడు తపశ్చరణమునకై యేగినప్పు డింద్రుఁ

డాతని యంతిపురమునకు వచ్చి లీలావతిని చెఱపట్టుకొనిపోవుటయు, హిరణ్యకశిపుఁడు తపస్సునుండి తిరిగివచ్చి లీలావతికిఁ దన తపశ్చర్యా ఫలసంపాదిత వృత్తాంతము తెలియఁగించుటయు, హిరణ్యకశిపుఁడు తన పరోక్షమున నింద్రుఁ డొనరించిన దుండగమునకుఁ బ్రతిక్రియగా నింద్రలోకముపై దండెత్తి యింద్రుని స్వర్గపదభ్రష్టు నొనరించుటయు నిందలి ప్రధానాంశములు. వీనిలోఁ బ్రహ్లాద జనన వృత్తాంతముతోఁ గూడిన ద్వితీయాంకమునకే ప్రహ్లాద చరిత్రతో నించుక సంబంధమున్నది. మిగిలిన కథయంతయుఁ బ్రహ్లాద చరిత్రయను నాటక నామమును బురస్కరించుకొని చూచినచో ననవసర విస్తరణమువలెఁ గానఁబడుచున్నది. దానిని సంకుచిత మొనరించి సంగ్రహముగా సూచించియుండినచో నెక్కువ సమంజసముగా నుండెడియుండెను.

రస నాయకదృష్టితోఁ జూచినచో నీ నాటకమును రెండు భాగములుగా విభజింపవచ్చును. మొదటి నాలుగంకములలో వీరము ప్రధానరసము. దాని కింద్రుఁడును హిరణ్యకశిపుఁడును నాలంబనములు. చివరి రెండంకములలోని రసము భక్తి. దీని కాలంబనము ప్రహ్లాదుఁడు. ఈ తద్భాగద్వితయమునకు హిరణ్యకశిపుని యునికి యొకవిధమైన సంబంధము కల్పించుచున్నది. ఎట్లయినను హిరణ్యాక్షుని మరణముతో నారంభించిన కథ వంకరలు తిరిగి తిరిగి చివరికి హిరణ్యకశిపుని మృతితో ముగియుటలో సహజమైన పరిణామక్రమము గోచరించుటలేదు. తుది యంకము హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదునిఁ జంపుటకై యొనర్చిన పలుప్రయత్నముల కూడిక. ప్రహ్లాదుఁ డా గండములన్నియుఁ గడచి యక్షతుఁడై బయటఁ బడుట నారాయణుని భక్తరక్షణ పరాయణతను, భక్తి ప్రభావమును జక్కఁగా వ్యక్తము చేయుచున్నది. ద్వితీయాంకమున నింద్రుఁడు లీలావతిని జెఱపట్టుటకై వచ్చినప్పుడు శుక్రుఁడు పల్కిన పలుకు లాతని ప్రభుభక్తికిని, లీలావతి వచనము లామె పాతివ్రత్యమునకును దార్కాణముగా నున్నవి. హిరణ్యాక్షుని మరణమునకు హిరణ్యకశిపుఁడును దితియు విలపించిన సందర్భమున గరుణరసము లెస్సఁగాఁ బోషింపఁబడినది.

తృతీయాంకమున హిరణ్యకశిపుఁడు తన తపశ్చర్యను వర్ణించినఘట్టము కథనాత్మకమై యనాటకోచితముగా నున్నది. చతుర్థాంకమున మొదటనున్న దేవాంతక నరాంతకుల సంభాషణ మనవసరదీర్ఘమై, యనుచితప్రలాపములతోఁ గూడి, నాటకకథాగమనమున కాటంకము గలిగించుచున్నది. ఇంద్ర హిరణ్యకశిపుల ప్రసంగము ప్రసన్నయాదవమునందలి నరకమహేంద్రుల సంభాషణమునకుఁ బ్రతిరూపమై యున్నది. చండామార్కుల పాఠశాల ప్రస్తుత కాలమందలి పల్లెటూళ్ళలోని ప్రాథమిక పాఠశాలలను దృష్టియందుంచుకొని వ్రాయఁబడినట్లున్నది. ఆ యుపాధ్యాయులకు శిష్యులపై వాత్సల్యముకాని, ఆ శిష్యులకు గురునిపై భక్తిగౌరవములుకాని లేశమైనఁ గానిపించుటలేదు. ప్రహ్లాదుఁడు తోడిబాలురకుఁ జెప్పిన హరిభక్తిప్రభావము సందర్భోచితమై చక్కఁగనే యున్నది కాని యాతఁడు హరినొక్కనిఁ బ్రశంసించుచు నీశ్వరాదులను నిరసించుటమాత్ర మాతనిశీలమున కనురూపముగాఁ గానవచ్చుటలేదు. నరసింహమూర్తి హిరణ్యకశిపుని సంహరించుటకై యాతనిఁ జెంతకు బోగినంతనే యవనిక వ్రాలినట్లు సూచింపఁబడినది. అప్పుడు విప్రచిత్తి నరాంతక ప్రహ్లాదులు నరసింహుని నఖక్రీడా విహారమును మాటలతో వర్ణించియుండిరి. దాని రంగమునఁ బ్రదర్శింపరాదను నుద్దేశములోఁ గవిగా రీవిధానము నవలంబించి యుందురు. కాని యంక మధ్యమున నిట్లుచేయుట నాటక సంప్రదాయమునకు విరుద్ధముగా నున్నది.

## సామాన్య లక్షణములు:—

చిలకమర్తివారి నాటకములకు సంస్కృతమునందలి కాళిదాసాదులనాటకములే మార్గదర్శకములు. వారు సాధ్యమైనంతవఱకు సంస్కృత నాటకలక్షణములనే సమగ్రముగా ననుసరించుటకు యత్నించియుండిరి. వారి నాటకములన్నియుఁ బంచషాంక పరిమితములై యుండుటయు, నందలి విదూషక కంచుకుల పాత్రల చిత్రణమును, నాంది ప్రస్తావనా విష్కంభ ప్రవేశకాదుల విధానమును నీ విషయమును దృష్టాంతీకరించుచున్నవి. సంస్కృతలాక్షణికులు రంగప్రదర్శన యోగ్యములు కావని చెప్పిన యనుచిత నీరసోద్వేగకర విషయములను వారు పెక్కుచోట్ల విష్కంభాద్యర్థోపక్షేపకముల మూలముననే సూచించియుండిరి. ఒక్క గయోపాఖ్యానమున మాత్రము కృష్ణార్జునులయుద్ధమును రంగమునందే ప్రదర్శించిరి. చతుర చంద్రహాసమున నొక్కచో నిద్రించుచున్న చంద్రహాసునిఁ బ్రవేశపెట్టియుండిరి. సంస్కృతసంప్రదాయమునకు విరుద్ధముగా వారు కొన్ని యంకములను రంగములుగా విభజించిరి.

వారి నాటకములన్నియుఁ బౌరాణికములైనవే. ప్రఖ్యాతములైన వస్తువులనే గ్రహించి వా రెడనెడ స్వల్పములైన కల్పనలు గావించి యీ నాటకములను రచించియుండిరి. మూల కథలకుఁగాని పాత్రలకుగాని యతి భిన్నముగా వారు గావించిన కల్పనలేవియుఁ గానరావు. కొంచె మించుమించుగా వారి నాటకములన్నియు వీరరస ప్రధానములైనట్టివే. పారిజాతాపహరణ, చతుర చంద్రహాసములలో మాత్రము శృంగార రసచ్ఛాయ లించుక గోచరించుచున్నవి. హాస్యమున వారు సిద్ధహస్తులు. ప్రతి నాటకమునందును నేదో యవకాశమును బురస్కరించుకొని వారు హాస్యమును బ్రవేశపెట్టియేయుండిరి. కొన్నిచోట్ల నీ హాస్యప్రసంగములు దీర్ఘములై యౌచిత్యపు మర్యాద నతిక్రమించుటయుఁ గాననగును. పారిజాతాపహరణమునందలి రంభా సంయోగ ప్రసంగ మిందుకు దృష్టాంతము.

వారి నాటకము లన్నింటియందును లక్షణానుగుణములైన నాందీప్రస్తావనలున్నవి. కొన్ని నాందులలో శబ్దముచేతను గొన్నిటిలో నర్థముచేతను వారు వస్తునిర్దేశము గావించియుండిరి. గయోపాఖ్యానమున శరణాగతత్రాణమును బ్రహ్లాద చరిత్రమున భక్తియుఁ బ్రశంసింపబడినవి. చతుర చంద్రహాసమున శాబ్దికమైన వస్తు నిర్దేశమున్నది. కొన్ని నాటకములలో నాందీ పద్యములందో లేక ప్రస్తావనారంభములందో విద్వత్సభావందనమాచరింపబడియున్నది. ఒక్క గయోపాఖ్యాన నాటకమునఁ దక్క వారి ప్రస్తావనలన్నియు సూత్రధార పారిపార్శ్వక సంభాషణాత్మకములే. వీనిలో నన్నింటి

# ఆంధ్ర ఇన్స్యూరెన్సు కంపెనీ లిమిటెడ్,

## హెడ్డాఫీసు - మచిలీపట్నం

నూతన సంవత్సరము సర్వవిధముల క్షేమోదాయకమగు గాక

శత్వరాభివృద్ధి గాంచుచున్న యీ **భీమా** సంస్థలోనే మీ జీవితమును భీమా చేయుడు!.

| | | |
|---|---|---|
| 1954 వ సం॥ లో నూతన వ్యాపారము | 2 | కోట్లకు మించినది |
| అమలులోనున్న భీమా మొత్తము | 10 | ,, |
| ఆస్తులు ... | 2 | ,, |

1000 కి సం. నకు రు. 12 ల చొప్పున **బోనసు.**

ప్రిమియము రేట్లు తగ్గింపబడినవి.

**ప్రాణ భీమాతోపాటు - అగ్ని, మోటారు, ప్రమాదము, నౌక**

మొదలైన యితర భీమా వ్యాపారములు గూడ జయప్రదముగా నిర్వహింపబడుచున్నవి.

ఇండియా అంతటను మా ఆఫీసులు గలవు.

**ధూర్జటి సుబ్రహ్మణ్యం,**
యం. ఏ., యఫ్. ఐ. ఏ., యఫ్. ఎస్. ఎస్.,
జనరల్ మేనేజరు.

---

ఫోన్. 4880. టెలిగ్రామ్సు "ప్రభుమాయా"

అసలు వజ్రములులాగా ప్రకాశించే

మా యొక్క




మాయా మార్కు రంగూన్ వజ్రములను యెల్లప్పుడు

మీ యొక్క అభరణములకు, వుపయోగించి తృప్తిపడండి.

తయారు చేయువారు:

## కపూర్‌చంద్ అండ్ కంపెని,

నెం. 98 టంకశాలవీధి, సౌకారుపేట

మదరాసు - 1.

---

నూతన సంవత్సరాభినందనలు!

# విజయ ట్యుటోరియల్ కాలేజి,

## విజయువాడ - 2

స్థాపితం: 1950.

ప్రతి సంవత్సరము జూన్ మొదటివారములో

పునఃప్రారంభమగును.

ఆంధ్ర బి. ఏ, ఇంటరు, మెట్రిక్, ఎస్. ఎస్. ఎల్. సి., ఆజ్మీర్ ఇంటరు, పరీక్షలకు, సమర్థులు, అనుభవజ్ఞులూ అయిన అధ్యాపకులచే తర్ఫీదు ఇవ్వబడును. ప్రతి సంవత్సరం మంచిఫలితములు.

## సైన్సు సబ్జక్టులకు లాబరేటరీ సౌకర్యము కలదు.

హాస్టలు వసతి, హోస్టలు ట్యూషన్ ప్రత్యేకం

బాలికలకు ప్రత్యేక తరగతులు.

చిన్నతరగతులకు కూడ శిక్షణ ఇవ్వబడును.

నిబంధనావళికి 4 అణాల తపాలబిళ్లలు పంపవలెను.

**లోకాల చిరంజీవిరావు,**
ప్రిన్సిపాలు.

యందును సుప్రతిష్ఠీకరణమును నంగనుష, కవి ప్రశంసయుఁ గాన వచ్చుచున్నవి. ప్రస్తావనలలో వస్తునిర్దేశము గావించుటకై కవిగా రంతగా యత్నించియుండలేదు. ఋతువర్ణన మొక్క గయోపాఖ్యానమునందే గోచరించుచున్నది. అందైనను నాటకసంబంధి ప్రధాన రసము వీరరసమైయుండ శరదృతువు గాక వసంతర్తువు వర్ణింపబడినది. గయోపాఖ్యాన ప్రహ్లాద చరిత్రలలోఁ బాత్రప్రవేశ సూచన యున్నది. పారిజాతాపహరణమున పాత్రప్రవేశ సూచనకు బదులు సూత్రధారుఁడు నాటకశాలనే నాటకోచితములైన యాయా స్థలవిశేషములుగా భావింపవలెనని సదస్యులను గోరుచున్నాఁడు. ప్రసన్న యాదవములోఁ బ్రస్తావనాంతమున సూత్రధారుఁడు సభా సదులకు “మీరీ నాటకమున నీ యీ సంఘటనలు మాత్ర మూహిం చుఁడు”అని విన్నవించి నిష్క్రమించియుండెను. ప్రహ్లాద చరిత్ర మునఁ గవిగారి ననేకవిధముల సత్కరించి యాదరించిన శ్రీ పిఠాపుర సంస్థానాధిపుల ప్రశంసయున్నది. ఇది యభ్యుదయ పరంపరాభివృద్ధి నాకాంక్షించుచుఁ బ్రబంధావతారికలలో చివరనుండు వచనమును బోలియున్నది. రెండవ మూఁడవ నాటకములలోఁ గవిగారు నాటక ప్రదర్శనము రమణీయముగా నుండ వలెనన్న నేర్పరులును ప్రయోగకుశలులును నైన నటకుల యావశ్యక మెంతో కలదని, వివరించియుండిరి. చతుర చంద్రహాసమున నిట్లె దృశ్యకావ్యములలోఁ గన్న శ్రవ్యకావ్యము లందుండు ఘనత వర్ణింపఁబడినది. అందే కవిగారు పరివర్తనములపైఁ గంటె స్వకపోల కల్పితములైన స్వతంత్రనాటకములపైఁ దమకుఁగల యభిమానమును వెల్లడిచేసియుండిరి. ప్రసన్నయాదవము “మల్లయార్యుండు నా మేనమామయగుటఁ గవిత యెటులున్న నీకృతిగణుతిఁ గాంచు”నని కవిగారు సూత్రధారునితో నిభేదము చెప్పుకొని యుండిరి. చతుర చంద్రహాసములోఁ బ్రస్తావనాంతమున నాటకము నందలి నీతియొక పద్యమున వివరింపఁబడినది. ఈ విధముగా వీరి నాందీప్రస్తావనలలో నొండురెండు స్వతంత్రరీతులు గోచరించు చున్నను బూర్వలక్షణాను సరణముకూడ వ్యక్తమగుచునేయున్నది. దుష్టబుద్ధిమరణముతో ముగిసిన చతుర చంద్రహాసమునఁ దప్ప మిగిలిన యన్ని నాటకముల చివర లక్షణానురూపములైన భరత వాక్యములు వ్రాయఁబడియున్నవి.

పంతులుగారీ యైదు నాటకములందుఁ బలుచోట్ల విష్కంభప్రవేశకములను వాడియున్నారు. సంస్కృతములోవలెఁ దెలుఁగున భాషాప్రయోగమునుబట్టి పాత్రల యుత్తమ మధ్యమాధమత్వముల నెఱుంగుట కవకాశము లేకపోయినను వారా పాత్ర లొనర్చు కార్యములనుబట్టి వారి యంతరువులను నిర్ణయించినట్లు కనఁబడు చున్నది. దీనినిబట్టియే కొంబోలు వారు ప్రహ్లాద చరిత్రయందలి దేవాంతక నరాంతకుల సంభాషణమును బ్రవేశకమని పేర్కొని యున్నారు. మిగిలినవి పెక్కు విష్కంభములనియే సూచింపఁబడి యున్నవి. కాని వానిలోఁగూడఁ బ్రవేశకము లనఁదగినవి రెండు మూఁడున్నవి. వారు సాధారణముగా యుద్ధములను, బ్రయాణము లను సూచించుటకై యీ ప్రవేశక విష్కంభములను వాడి యున్నారు. పారిజాతాపహరణ ప్రథమాంకారంభమునందలి హంస పదికా కైరవుల సంభాషణము విష్కంభప్రాయమై యున్నది. ప్రసన్న యాదవ తృతీయాంకము మొదలున్న దేవలమాణవకుల సంభాషణము ప్రవేశకముగాఁ గాక నాటకరంగముగానే యుండఁ దగియున్నది. విష్కంభప్రవేశకములందలి పాత్రలే తరువాతఁగూడఁ బ్రవేశించి నాటకకథను గొనసాగించునప్పు డవి కేవలము శ్రావ్యములుగాఁ గాక దృశ్యములుగా నుండుటయే యుచితము.

పంతులుగారు నాటక సమాజములతోను నటులతోడను సన్నిహిత సంబంధము కలవారైయుండుటచేఁ దమ నాటకములందు శ్రావ్యపు ప్రయోజనమునకే కాక రంగప్రయోజనమునకుఁగూడఁ బరిపూర్ణ ప్రాధాన్య మొసంగియుండిరి. నిజమున కీ రెండు ప్రయోజనములను సరిగా నెఱవేర్పఁజాలనిచో నాటకము శ్రవ్యకావ్యముల కంటె నెట్టి వైశిష్ట్యమును గలిగియుండ నేరదు. పంతులుగారు తమ నాటకములలో సామాన్యజనులవినోదమునకై మాత్రమే పరికివచ్చు నట్టి రంగముల నెచ్చటనో వ్రాసియుండిరి. హాస్య రసభూయిష్ఠము లైన నాటి రంగములన్నియు నివృత్తితో వ్రాయఁబడినట్టివేయని చెప్పవచ్చును. నాటకకథ కెట్టిభంగము కలుగకుండ వానిలోఁ బెక్కింటిని దొలఁగించుటకో తగ్గించుటకో యవకాశ ముండుటయే యిందుకు దార్కాణము.

సంస్కృత నాటకములలోఁ దఱుచు కానవచ్చుచుండు పాత్ర ప్రవేశసూచనలును, భావిశుభాశుభనిర్దేశనములును, నాటకీయ చమత్కారములును బంతులుగారి నాటకములలో నెడనెడ గోచరించుచున్నవి. గయోపాఖ్యానమున గయుని పట్టపుదేవుఁడు చూచిన దుస్వప్నము, ప్రహ్లాదచరిత్రమున లీలావతి తన మెడలోని హారము నెవ్వరో తొలఁగించినట్లు గాంచిన స్వప్నమును నాకథలలో వారికిఁ గలుగఁ బోవు నపఖ్యములను సూచించుచున్నవి. పారిజాతాపహరణ ప్రథమాంక మున రుక్మిణి కైరవునిఁగూర్చి “అతఁడు మాపాలిటికి నేఁడపర నారదుఁ డయ్యె”నని పల్కుట” నారదపాత్రప్రవేశమును, చతుర్థాంకమున నింద్ర యమ బృహస్పత్యాగులు ధర్మసూక్ష్మనిర్ణయమునుగూర్చి చింతించు సమయమున నింద్రుఁ “డిందిరా మనోహరుఁడగు నయ్యరవింద నాభుఁడీ సమయంబున నిందుండిన బాగుండు”నని పల్కుట శ్రీకృష్ణ పాత్ర ప్రవేశమును జక్కఁగా సూచించుచున్నవి. చతుర చంద్రహాస తృతీయాంకమున దుష్టబుద్ధి చంద్రహాసునిఁ గుంతలపురమునకుఁ బంపుచు “మావీట నీవు స్వర్గమునందున్నట్లుందు”వని పల్కుటయు, చతుర్థాంకమునఁ జాగాయణుఁడు చంద్రహాసునితో “నీ పందిళ్ళ నడుమ నిల్చిన నీవు పెండ్లికొడుక”వని తలంచెదనని పల్కుటయు నచ్చటి కథా సందర్భములనుబట్టి చూచినచో ధ్వనిగర్భితములై గంభీరభావ చమత్కారమును బ్రదర్శించుచున్నవి. ఇట్లే గయోపాఖ్యానమున నర్జునుఁడు సహదేవునితోఁ బ్రసంగించుచుఁ గృష్ణుఁడు తమ కొనరించిన యుపకారములనుగూర్చి చెప్పి “ఆ వసుదేవనందనుఁడు పాండునందులకుఁ బరమమిత్రుఁడుగదా” యని పల్కుటయు, వెంటనే గయుఁడు శరణార్థియై యరుదెంచుటయు నచ్చటి యా సంభాషణమున కెంతో వన్నె చేకూర్చుచున్నవి. కవిగారీవిధముగా నాటకీయ చమత్కారములను బ్రదర్శించినచోట్లు పెక్కుగలవు.

పారిజాతాపహరణమునఁ గైరవుఁడు నిరుపమత్తుచే హంసపదిక వింత వగోయనుకొని యామె నామెయుండే దూషించుటయు నిట్టి చమత్కారమునకు నెలవై యున్నది.

పంతులుగారికిఁ జెక్కు రాజకీయ సాంఘిక విషయములపైఁగల యభిప్రాయము లీ నాటకములలోఁ బ్రసక్తానుప్రసక్తముగా వెల్లడిచేయఁబడియున్నవి. వారు శ్రీ వీరేశలింగం పంతులుగారి శిష్యులగుటచే స్త్రీవిద్యా విషయమునను స్త్రీ జనాభివృద్ధి విషయమునను విశాలాశయములు వహించియుండిరి. ప్రసన్న యాదవమున వారు "ముదితల్నేరఁగరాని విద్య గలదే ముద్దార నేర్పించిన" అని కృష్ణుని ముఖమునఁ దమ యభిప్రాయమును వ్యక్తము చేసియుండిరి. అట్లే చతుర చంద్రహాసమునఁ గన్యలు తమ యిష్టమువచ్చిన వరులను స్వేచ్ఛగా వరింప దగువారైనను వారలఁ దల్లిదండ్రులు స్వార్థచోదితులై వారి నెవరికో యొకరికిచ్చి పెండ్లిచేయుట యయుక్తమనియు సూచించియుండిరి. ఇట్లని స్త్రీలు సర్వస్వతంత్రులై యెల్లవిషయములందును జోక్యము కలిగించుకొనుట వారి కిష్టము లేదు. గయోపాఖ్యానమున సుభద్రారుక్మిణీసత్యభామాదులు శ్రీకృష్ణార్జునులతో సంధికిఁ బురికొల్పిన సందర్భమున స్త్రీలు పురుషుల వ్యవహారములలో జోక్యము కలిగించుకొనరాదని ధ్వనింపఁజేసియుండిరి. చతుర చంద్రహాస నాటకమున వారు జ్యోతిషమునఁ దమకుఁగల యవిశ్వాసమును వెల్లడిచేయుటయే కాక జ్యోతిషికులు దానినెట్లు దుర్వినియోగము చేయుచుందురో కూడ వివరించియుండిరి. ఆ నాటకమునందే వారు పుళిందునిఁ బ్రజలు విడిచించిన సందర్భమునఁ బ్రజాశక్తి ప్రాభవమును వివరించి దానిముందు నిరంకుశత్వము నిలువఁజాలదని విశదీకరించిరి. రణనిహతులును, సోమయాజులును మరణానంతరము స్వర్గమునకరిగి రంభా సంభోగము ననుభవింతు రను విషయమును వారు పారిజాతాపహరణమునఁ బలువిధముల గేలిచేసి యట్టివారికిఁగూడ గా మొనరించిన పుణ్యపాపముల ననుసరించి నరకానుభవము తప్పదని నిరూపించిరి. చతుర చంద్రహాసమున వారొక్కచో మదనునిచే

అస్తమానోదయములఁ బ్రత్యహమునందు
నంశుమంతుని తెలఁగొల్ల నరసి చూడ
జంతు సంతతికి మరణానంతరమున
జన్మమగుచుండుననితోఁచు స్వాంతమందు

నని పల్కించి తమకుఁ బునర్జన్మసిద్ధాంతమునఁ గల ప్రత్యయమును బ్రకటీకరించిరి.

శ్రీ పంతులుగారు గయోపాఖ్యాన పారిజాతాపహరణాది నాటకములను నవలలను రచింప నారంభించుటకుముందే వ్రాసియుండిరి. తరువాత వారు రచించిన నాటకములకంటె నవలల సంఖ్యయే చాల హెచ్చు. వారి నాటకములలో సైతము వర్ణనములందును దీర్ఘ స్వగతములందును నవలారచన ప్రభావము హెచ్చుగా గోచరించుచుండును. వారి వచనరచనమున సంవాదశైలికంటె గధనవర్ణన శైలియే ప్రాచుర్యము వహించును. పురాణ కథలనే వారెక్కువ మార్పులేకుండ నాటకీకరించియుండుటచే వారి నాటకములలోఁ కథా విస్తరణమున నంత వింతదనమేదియు గోచరింపదు. గయోపాఖ్యానమున శరణాగతత్రాణ ప్రేమ హాశాంక్షవ్యామములకును, చతుర చంద్రహాసమున స్వార్థసిద్ధి ప్రవృత్తికిఁ బ్రేమలకును నడుమ సంఘట్టనము (*Conflict*) గోచరించుచున్నను మొత్తముమీఁద వారి నాటకములలో సామాజిక స్ఫూర్తికిఁ గాక్షరణమగు కెక్కువగా సుపరిణామను సంఘట్టన ప్రభావ మగోచరముగాఁ గాలిపింపదు.

పంతులుగారు నాటకసమాజమునందలి నటుల యానుకూల్యము ననుసరించి తొలుత వచననాటకములనే వ్రాసిన దరువాత వాని నన్నిటిని పద్యపాఠాంశములు కొలించియుండిరి. వారన్ని సందర్భములందును బలు నాత్రలకుఁ బద్యములు వ్రాసియుండిరి. ఈ పద్యములు పెక్కుచోట్ల సంస్కృతనాటకములందలి శ్లోకములనే పోలియుండును. సాధారణముగా వారు పద్యమునందలి పూర్వభాగమున విషయమును జెప్పి యుత్తరభాగమున దృష్టాంతమునో, నిదర్శనమునో, యర్థాంతరన్యాసమునో చెప్పుచుందురు. వర్ణన సందర్భములందును భావోద్వేగమును వ్యక్తము చేయు సందర్భములందును మాత్రమేకాక వారు సాధారణ సంభాషణములను గూడఁ గొన్నియెడలఁ బద్యములందే సాగించుచుందురు. ధారాశుద్ధి మార్దవములందును, సంఖ్యా బాహుళ్యమునందును వారి పద్యరచనకును తిరుపతి వేంకట కవుల పద్యరచనమునకుఁ జాల సామ్యము కానవచ్చును. ఈ యిరువురి పద్యములు సుగమము మృదుపదఘటితములును, సరళ సుందరములునై యెంతో నాటకోచితములుగా నుండును. అందుచేతనే యాంధ్రదేశమునందలి యక్షరాస్యులందఱికి వారి నాటకపద్యములందొకటియో రెండో ముఖస్థములై యుండకమానవు. పంతులుగారి ప్రహ్లాద చరిత్రమునందలి పెక్కు పద్యములు పోతనగారి పద్యములకుఁ బ్రతిబింబములుగా నున్నవి. ఒక్క యీ నాటకముననేకాదు మిగిలిన నాటకములందుఁగూడ వారి పద్యములలో మూల ప్రభావ మెంతో గోచరించును. వారి పద్యములలో కొన్ని యనుప్రాస విశేషములతోఁ గూడి వినులవిందుగా నుండును. ఒండు రెండుచోట్ల శ్లేషతోఁ గూడిన పద్యములును గలవు. గయోపాఖ్యానమున వసంతర్తు బాల్యమును బోల్చిన సందర్భమునను చతుర చంద్రహాసమున నింద్రజాలిక మంత్రులను బోల్చిన సందర్భమునను గల పద్యము లిందుకుఁ దార్కాణములు. ఇట్లే వారు రెండు మూఁడుచోట్ల బహు పాదములుగల సీసములను వ్రాసి యందే సంవాదము జరిగించియుండిరి. మొత్తముమీఁద వారి పద్యరచనమువలన నాటకముల కపూర్వమైన యందచందము లావహిల్లిన వనుటలో నతిశయోక్తి యుండదు.

పంతులుగారి శైలి మధురమంజులమైనది. అది శారదాభ్రమువలెఁ బ్రసన్నమై, వర్షాకాలవాహినివలె నిండారి, వసంత వనశోభవలె భావముల నాకర్షించి పరమానంద మావహించుచుండును. వచనమునఁగాని పద్యములలోఁగాని యెచ్చటను గ్లిష్టములైన వాక్యయోజనలును, మాఱుమూలపదములును గాని పింపవు. వారి రచన పదమాధుర్యమునకును, భావసౌష్ఠవమునకును బెట్టినది పేరు. కొన్నిచోట్ల వారనుప్రాసములను వాడిన వాక్య

ములుగ గలవు. "జృంభితకోస్తంభ గంభీరాంబుదను నీ కాంభోజరాజ సింహాసనాగ్రస్థితుపై శుభారంభమిందు నీ యింద్రపదంబిచ్చి మన కరుణించెను" యున్నగుణ బింగుకు నిదర్శనములు. కాని యిట్టివి ముత్తెముమీఁద రెండుమూఁడుకంటె నెక్కువ లేవు. ఇట్లే నాలోక సీసపద్యమునఁ ప్రస్తరించు, విస్తరించు, సుస్తరించు, కుస్తరించు, నిస్తరించు అను క్రియల నొక్కొక్క టొక్కొక్కపాదమున వాడి నాఁడు (చతురచంద్రి) "దేవా! చంపకమాలికిని మదనునిఁ జెచ్చి పొగడ్చుచున్నఁగారిని మనోరథసిద్ధిఁజేయుఁడు" (చ. చం 29క) నన్న వాక్యమున మదనశబ్దముపై శ్లేషయున్నది. దుష్ట బుద్ధి తన కుమారుఁడైన మదనున కెట్లైనఁ జంపకమాలినిని భార్యగాఁ జేయఁ దలంచుట యోచించినచో నిందలి చమత్కారము బోధపడును. పారిజాతాపహరణ ద్వితీయాంకమునఁ గృష్ణుఁడు,

> "రుక్మిణీ సత్యభామ లిర్వురకు నేను
> బంచితిని కూర్మి తులఁదూచుభంగి గాఁగ
> నిపుడు వైదర్భివంకఁ బువ్వొత్తుకూర్మి
> యతిశయంబుగఁ గన్పడు నామెయందు"

అని తలంచునప్పుడు వాడిన "పువ్వొత్తు కూర్మి"యను ప్రయోగము సుకుమారభావమును ధ్వనింపఁజేయుచుఁ గవిగారి పదప్రయోగౌచిత్యమును వేనోళ్ళ విశదీకరించుచున్నది. నారదుఁడు తెచ్చి యిచ్చిన పారిజాతకుసుమమును గృష్ణుఁడు సత్యభామకీయక రుక్మిణి కిచ్చుటను బురస్కరించుకొని చూచినప్పు డిందలి చమత్కారమున కానందింపని వారుండరు. పంతులుగారి గయోపాఖ్యానమునందలి "అల్లుఁడా రమ్మని" ఇత్యాది పద్యము లాంధ్రదేశమున నాబాలవిదితములైనట్టివి. వారి రచన బాలకులకు వ్యాకరణానుగుణమై, లాక్షణికమై యొప్పారుచుండును. కాని యప్పుడప్పుడు "చాలింక, వాంతికులు, మీరెల్లరు తపమాచరించిరి, వృద్ధయౌవనప్రాయము, సార్థపెనిమిది" యున్నగు వ్యావహారిక ప్రయోగములు కొన్ని కాన వచ్చుచున్నవి. కాని వీనింతటి పెద్ద దోషములుగా నెన్నవలసిన పనిలేదు. వారన్ని నాటకములలో నన్ని పాత్రలకు గ్రాంథికమే వాడియుండిరి. వారు ప్రతి నాటకమునందును ప్రస్తావనలో గుణదోషప్రసక్తి తెచ్చి పౌరుషేయ రచనలలో దోషములుండకమానవని చెప్పుచుందురు. అది నిజమే. అసలు గుణగ్రహణపారీణులు రసము వంకనే దృష్టి సారింతురు గాని దోషములు వెదకుటకై యత్నింపరు. అట్టివారికిఁ బంతులుగారి నాటకములు పంచభక్ష్యపరమాన్నముల సరిసాటి భోజనములు. ఆంధ్రమున నాటకము లప్పుడప్పుడే యవతరించుచున్న యా తొలి నాళ్లలో రూపసౌష్ఠవమునను, లక్షణ సామగ్ర్యమునను, సంభాషణ చాతుర్యమునను, ప్రయోగార్హతా పాటవమునను, భావ గాంభీర్యమునను, రసభావ పోషణమునను అసమానములైన యిట్టి నాటకములు రచించి పంతులుగా రాంధ్రవాఙ్మయమున కభ్యుదయము చేకూర్చిరనుటలో నత్యుక్తి యుండఁజాలదు. సంస్కృత మార్గగాములైన యాంధ్రనాటకములలో నిప్పటికిని బంతులుగారి నాటకములకే యగ్రస్థానము లభించుచునుట వారి నాటక నిర్మాణ ప్రతిభకు స్థిరమైన తార్కాణము.

---

# అవిభాజ్యం-
## మీ శరీరపు ఛాయ, గ్లోరీ సబ్బు

ఇదిగో ఎక్కువ నురుగు! ఒక్కసారి ఇలా మెల్లిగా రుద్దితే చాలు అంతే, వెంటనే మేలైన నురుగు విశేషంగా వస్తుంది. వెగటు వేయని కమ్మని వాసన! పరిశుభ్రమైన, స్వచ్ఛమైన గ్లోరీ నురుగు మీ వంటికి తగిలినందున మృదువైన కమ్మని వాసన రోజంతా వుంటుంది.

మీరు వెచ్చించే డబ్బుకు మించిన ప్రతిఫలం! వాడకంలో ఆటివస్తుంది. ఆహ్లాదకరమైన ఇతర స్నానపు సబ్బులకంటె ఎక్కువ నురుగు వస్తుంది.

"గ్లోరీ" సబ్బుతో
ఒక్కసారి స్నానంచేస్తే
మీకు కీర్తి వస్తుంది

మలబార్ గ్లోరీ టాయిలెట్ సోపు-
సౌందర్య పోషకమైన సబ్బులకు రాణి




ఉత్పత్తిదారులు:
**ది వెజిటబుల్ సోప్ వర్క్సు, కోజికోడ.**

ప్రొప్రయిటర్:
సేఠ్ నాగ్‌జీ పురుషోత్తం & కంపెనీ లిమిటెడ్, కాలికట్-1; బొంబాయి-2; మద్రాసు-1.
ఇండియన్ సోప్ & టాయిలెట్రీస్ మేకర్సు అసోసియేషన్ సభ్యులు.

నాటిక:

# బెడద

శ్రీ బోడవరపు రామశేషయ్య

## పాత్రలు

| | | |
|---|---|---|
| ధనంజయరావు | శివరావు | కాళిదాసు |
| అమరేంద్రుడు | నగేంద్రుడు | మాధవరావు |
| వెంకటేశు | సుశీల | అనసూయ |

### మొదటి రంగం

* * ధనంజయరావు గృహం; సమయం: ఉదయం—హాల్లో సోఫాలు, కుర్చీలు; ధనంజయరావు కాఫీ తాగుతూ ఆలోచిస్తుంటాడు. ఇంతలో కాళిదాసు:

ధనంజయరావు: ఇదిగో, వచ్చావు! కబురు పంపాలనుకుంటున్నా.

కాళిదాసు: అనుకోగానే వచ్చాను కాబట్టి అనుకున్న పని అయినట్లే.

ధ : కాకపోవడమేమిటి! కాళిదాసు తలచుకుంటే కాని పని ఒకటి ఉంటుందా?

కా : అమాయిపుణ్ణి చేసి ఆడించాలనుకున్నట్టుంది.

ధ : అదికాదోయ్; ఒక గొప్ప చిక్కు వచ్చి పడ్డది.

కా : ధనంజయరావు కేమిటి! చిక్కేమిటి!! రావడమేమిటి!!!

ధ : అవునోయ్, ఈ కాలం కుఱ్ఱవాళ్లు ముసలివాళ్లను త్రోసి రాజని స్వంతంగా సంబంధాలు కుదుర్చుకుంటున్నారు.

కా : చదువుకోవడం చేత కలిగిన చాదస్తమంటావా?

ధ : చాదస్తం కాకపోతే చదువుకైన ఖర్చులన్నా గిట్టకపోతే అసలు పెండ్లేమిటోయ్?

కా : (నవ్వుతూ) కలిగినవాడికిక్కూడా కట్నంమీద ఆశేనా, బావా?

ధ : ఉంటే పారేసుకుంటామా? ఒక్కగాని ఒక్క కొడుకు; అచ్చటా ముచ్చటా తీరవద్దు.

కా : అచ్చటా ముచ్చటా ఆడవాళ్లకుగాని మనకేమిటి? కొడుకు, కోడలు సుఖంగా కాపరం చేస్తుంటే చూచి సంతోషించ రాదూ?

ధ : మా అక్కయ్యకూడా అదేమాయలో పడిపోయింది.

కా : అయితే నీవు మాత్రం బయట ఎందుకపడాలి? తల్లి కొడుకుల ఇష్టంప్రకారం కారాదూ?

ధ : వాడికి పిచ్చిపుట్టి శివరావు కూతుర్ని వరించావంటే తండ్రినైనకూడా తలఒగ్గవలసిందేనా?

కా : (ఆశ్చర్యంతో) అనసూయనా?

ధ : అవును.

కా : అమరేంద్రుడు బుద్ధిమంతుడు కాబట్టి గుణవంతురాలిని వరించాడు.

ధ : డబ్బులేందే గుణమెందుకోయ్? పోనీ అరవైవేలు ఇవ్వలేకపోతే ఇవ్వలేకపోయాడు. కనీసం ఇరవైవేలన్నా ఇవ్వకపోతే ఎట్లాగోయ్?

కా : (ఆశ్చర్యం) ఇరవైవేలే! శివరావుకున్న నాలుగు ఎకరాలు హరించాలని కలిగిందా ఏమిటి?

ధ : ఆడపిల్లకు అంతమాత్రం ఇవ్వకపోతే అనువైన సంబంధ మెట్లావస్తుంది?

కా : అవునుగాని మరి కొడుకుగతి?

ధ : ఏం? ఇటు ఇస్తే అటు పుచ్చుకోదూ, శివరావు మాత్రం?

కా : (ఆలోచన) నీవు అరవైవేలు రాలేదని విచారపడుతున్నావు గదా; ఆ అరవైవేలు నేనిస్తా ఉమను చేసుకోరాదూ?

ధ : అరవైవేలిస్తావా?

కా : అవును, పెద్దల్లుడికి ఇచ్చినంత ఇస్తాను.

ధ : బాగానేవుంది; ఉమకూడా చక్కని పిల్ల.

కా : ఇహ ఆలోచన ఎందుకు? 'తథాస్తు' అను.

ధ : అమ్మో, తథాస్తే కొంపతీసి. తల్లీ, కొడుకులు నన్ను బ్రతకనిస్తారా? అయినా, మా ఆవిడతో అని చూస్తా. అడుగో, అమరేంద్రుడు వస్తున్నాడు. వాణ్ణి ఒప్పించు.

కా : కలలో బంధించినా బంధించావు; బావా.

ధ : మరి అల్లుళ్ళు లేచికే వస్తారేమోయ్?

(అమరేంద్రుడు ప్రవేశించి)

అమరేంద్రుడు: ఓహో! మామగారా! మామగారు మా ఇల్లే మరచిపోయినట్లున్నారు?

కా : ఇల్లు మరచినా మాత్రం అల్లుళ్ళను మరుస్తామా?

అ : అవును, అక్కర తీరేవరకు.

కా : అది పూర్వం మాట.

అ : ఇప్పుడో?

కా : అంచెలు ఎక్కించి ఊరేగిస్తాం.

ధ : సరే, కాళిదాసూ, నేను బాంకి వెళ్ళివస్తా. పొద్దెక్కి దొరలైనారు.

కా : దొరలు సోమరులైతే ఇందులో వాళ్ళ తప్పేముంది? సరే వెళ్ళిరా, బావా. (ధనంజయరావు వెళ్తారు.) ఇప్పుడే నిద్రలేచావనుకుంటా అల్లుడు!

అ : అవునండి, ఈవేళ చాలా తొందరగా లేచాను. లేకపోతే కాఫీ, భోజనం రెండూ ఒక్కసారి అయ్యేవి. (లోపలికి చూస్తూ) వెంకటేసు! కాఫీ తీసుకురా.

కా : ఈవేళ మామూలు తప్పిందంటే ఏదో విశేషముంది.

అ : మీరు వస్తే విశేషాల కేమితక్కువ!

కా : అయ్యో, నా రాక నీకు నిద్రాభంగానికి కారణమయిందా?

అ : మీరిప్పాటు రాకపోతే నేనే మీ దగ్గరకు వచ్చేవాణ్ణి.

కా : (ఏమీ ఎరగనట్లు) నాతో అంత పని పడిందా! అయినా ముసలివాళ్ళతో పడుచువాళ్ళ కేమి పని ఉంటుంది?

అ : ముసలివాళ్ళంగదా అని ఆరాటపడుతున్నారా?

కా : నాకేం అర్థం కాలేదే?

అ : మీరు కాదు; మా నాన్న.

కా : (నవ్వుతూ) అయితే సంగతేమిటో తేల్చుకోవలసిందే.

అ : ఆ తేల్చవలసింది మీరే.

కా : నేనా!...పడుచువాళ్ళ పోకడలు తెలియని నేనా?

అ : అదికాదు, మామగారూ! బి. ఎ. ప్యాసైనవాణ్ణికూడా పిచ్చివాడిక్రింద లెక్కగడితే ఎట్లా? వివాహ విషయంలో కూడా స్వతంత్రం లేకపోతే....

కా : (మనస్సులో) అవును, స్వతంత్రం లేకపోతే శుద్ధ దండగ అనరూ? (వెంకటేసు ఒక కప్పు కాఫీతో ప్రవేశం)

అ : ఇదేమిటి! మామగారికేదీ?

కా : నేను త్రాగే బయలుదేరాను.

అ : కాఫీ కేమండీ, ఎన్నిసార్లయినా త్రాగవచ్చు.

కా : ఈ కాఫీ త్రాగినకొద్దీ సమస్య లెక్కువౌతాయ్.

అ : సంసారంలోని సమస్యలన్నింటికీ కాఫీయే కారణమంటారా?

కా : అందుకు సందేహమేముంది? మా రోజుల్లో ఈ కాఫీ ఎరుగున్నామా? అంతవర కెందుకు? స్వతంత్రమంటే అసలు ఏమిటో తెలిసేదా? ఏ పిల్లను తెచ్చిచేస్తే ఆ పిల్లే లక్ష్మి అనుకొనేవాళ్ళం.

అ : అయితే ఈ రోజుల్లో ఇష్టం వచ్చిన పిల్లను చేసికోవటం తప్పంటారా?

కా : ఇష్టం వచ్చిన పిల్లను చేసికొనేటప్పుడు కట్నం కోరటం మెందుకూ?

అ : కట్నం చేసికొనేవాడికోసం కాదు; ఆ వచ్చే అమ్మాయికి.

కా : (ఆశ్చర్యం) అమ్మాయికోసమా! మరి అబ్బాయి చదువుకున్నది ఎందుకు?

అ : అబ్బాయిసంపాదిస్తే అమ్మాయికి పంచిపెట్టాలని ఎక్కడుంది?

కా : అయితే అమ్మాయిలు చదువుకుంటున్నారు కాబట్టి వాళ్ళే సంపాదిస్తారు.

అ : ఉద్యోగం దొరక్క మగవాళ్ళే సతమతమైపోతుంటే ఆడవాళ్ళకు ఎక్కడినుంచి వస్తాయ్?

కా : అయితే ఆడపిల్లలకు కాలేజీ లెందుకు?

అ : ఈ సమానత్వం వుండబట్టేగదా మెచ్చుకొన్న పిల్లను చేసికొనడానికి అవకాశం వచ్చింది?

కా : సమానత్వం స్వయంవరానికే; ఆ సౌభాగ్యంకోసం కాదన్నమాట?

అ : ఆ సౌభాగ్యం స్వయంవరంలోనే ఉందంటాను.

కా : అయితే కట్న మెందుకు?

అ : కట్నం లేకపోతే కొంపకు పనికివస్తారా, మగవాళ్ళు?

కా : రెండు నావలమీద కాళ్ళు పెట్టటం నవనాగరికతా లక్షణం కాబోలు!

అ : నవనాగరిక లక్షణం కాబట్టే నాలుగు డబ్బులు చేతిలో వుండాలనటం.

కా : అయితే నా అమ్మాయిని చేసుకో; కట్నం ఇవ్వలేని శివరావు కూతురెందుకు?

అ : మీ అమ్మాయినా?

కా : అవును, అరవై వేలు ఇస్తా.

అ : (ఆలోచిస్తూ) అరవై వేలా!...

కా : ఏం; మాట్లాడవేం? నువ్వు స్వయంగా లక్షాధికారివి. ఇంకా అరవై వేలు వస్తున్నాయి.

అ : అవును....కాని...

కా : 'కాని' ఏమిటోయ్? ఈ కాసుకోసమేగదా మీ ఆగుర్దా?

అ : కాదు, మామగారూ; అనసూయ అయితే అనుకూలంగా ఉంటుందని.

కా : ఏం? మా అమ్మాయి గుణం తక్కువా? రూపం తక్కువా?

అ : అది కాదు; ఉమను నేను చిన్నప్పటినుంచీ ఎరుగుదును...కాని..కాని అనసూయ నా హృదయంలో...

కా : ఆమె నీ హృదయంలో హత్తుకునిపోతే కట్నానికి కక్కుర్తిపడతా వెందుకు?

అ : అవును, కానీ; నాన్నను మరి సంతృప్తిపరచవద్దూ?

కా : చదువుకున్నందుకు ఆమాత్రం సమాధానం చెప్పలేవూ?

అ : (మౌనం)

కా : ఏం, మాట్లాడవేం?

అ : నాకంత సాహసం లేదు.

కా : అంత సాహసం లేనివాడివి ఎందుకు ప్రేమించావు? పరాయిపిల్లను అల్లరిపెట్టడానికా?

అ : ఈ అమరేంద్రుడు అంత నీచుడు కాడు. నేనామెను ప్రేమించానంటే కేవలం ఆమె అందానికి మురిసి కాదు; ఆమె సుగుణాలను చూసి ఆ అణకువ, ఆ అమాయకత్వం, ఆ సౌజన్యం నన్ను ఆకర్షించాయి. ఇది క్షణికమైన మోహం కాదు; అనురాగం.

కా : అయితే ఇంకా అనుమానిస్తావెందుకు?

అ : కాదు, మా నుగారూ! ఒక్కగాని ఒక్క కొడుకుని. నాన్న నన్నెంతో గారాబంగా పెంచాడు. విద్యాబుద్ధులు చెప్పించాడు. యోగ్యునిగా చేశాడు. నామీద ఎన్నో ఆశలు పెట్టుకుని ఉన్నాడు. అటువంటి తండ్రిని నా సుఖంకోసం ధిక్కరించడం న్యాయమంటారా?

కా : కాని, పెళ్ళంటే బొమ్మలపెళ్ళిటోయ్; మూడుముళ్లు వేయడానికి?

అ : కాదు, కాని విజ్ఞానానికి విలువలేదంటారా? కన్న తండ్రిని త్రోసి రాజనడం విజ్ఞానమంటారా?

కా : జీవితం కొన్సాగా పాడైపోతూవుంటే విజ్ఞానమేమిటోయ్? అయినా పిల్లల చదువులలో చిదికిపోయిన శివరావును ఇంకా చితగ్గొట్టడం విజ్ఞానమా?

అ : నిజమే; కాదు, కాని ఆయనమాత్రం తన కొడుక్కి కట్నం కోరకుండా ఉంటాడా?

కా : అది తరవాత సంగతి. ముందు కూతురిపెండ్లికి ఉన్న నాలుగు ఎకరాలు అమ్మివేయవలసిందేగదా? అటువంటి పరిస్థితిలో నరేంద్రుడు ఎం. బి. బి. ఎస్. ఎట్లా పూర్తి చేయగలుగుతాడు?

అ : (ఆలోచన) అవును, అదీ నిజమే. ఈ బాధలు బాధకాలన్నీ తీరుస్తారనే మీతో ఈ విషయం ముచ్చటించాను.

కా : మీనాన్న ఒకరు చెబితే వింటాడా?

అ : మీరు వినేటట్టు చేస్తారని నాకు నమ్మకముంది.

కా : నాకంటె మీఅమ్మ పూనుకుంటే ఈపని చక్కబడు తుంది.

అ : అమ్మ! అమ్మకు అనసూయ కోడలుకావటం ఇష్టమే కాని అచ్చటా ముచ్చటా లేకపోతే ఎట్లాగంటోంది.

కా : నిజమే; వియ్యపురాలికి ఆమాత్రం కోరిక ఉండదూ! కాని మీ నాన్న వింటే మీ అమ్మమాట వినాలిగాని ఎవరి మాట లెక్కచేయడు. ఆ లక్ష్మి అడుగుపెట్టినతరవాతే గదా మీ ఇంట్లో లక్ష్మి తాండవిస్తోంది. లక్ష్మి కంట తడిపెట్టితే కాదనేసాహసం మీనాన్న కుండదు.

అ : ఏమో, మీతో కాబట్టి ఇంత ధైర్యంగా మాట్లాడాముగాని అమ్మతో ఇదంతా చెప్పడమెట్లా?

కా : అవును, నిజమే; సరే, నేనుకూడా వస్తాను. ముందు ఆమెను ఒప్పిస్తే తరవాతిసంగతి చూద్దాం.

అ : అట్లాగే...కాని, నా కిస్తానన్న కట్నమిచ్చి ఉమను నరేంద్రునకిచ్చి పెండ్లిచేయకూడదూ? అతనూ చాలా బుద్ధిమంతుడు గదా? ఇది జరిగితే మనకేమీ చిక్కు లేకుండా పోతుంది గదా?

కా : (ఆలోచన) అవును, ఇది మంచి ఆలోచనే. సరే, పద; మీ అమ్మతో ఆలోచిద్దాం.

అ : రండి, లోపలకుపోదాం. నాన్న పొలంనుంచి రాక పూర్వమే మాట్లాడటం మంచిది.

కా : (చిరునవ్వు) ఈ రోజుల్లో కుఱ్ఱవాళ్లకు తండ్రి అంటే ఇంత గౌరవమూ, భయమూనా.

[ఇద్దరూ లోపలకు వెడతారు.]

## రెండవ రంగం

* * శివరావు ఇంటిబయటి చావడి. సమయం: ఉదయం — శివరావు ఆలోచిస్తూ పచారు చేస్తూవుంటాడు.

శివరావు : ఎంతాలోచించినా దారి తెన్ను కన్పించడంలేదు... అను పెండ్లిచేస్తే నగేంద్రుడి చదువుకు స్వస్తి చెప్పాలి. పోనీ, వాడి చదువు సాగిద్దామా అంటే అనసూయ పెండ్లి ఆపివేయాలి...ఇంక ఈ ఆపడం ఎంతవరకు? ఇప్పటికే ఇంట్లో పోరు పడలేకుండా ఉన్నాను. పోనీ, ఊళ్లో అంటావా? ఊబుసుపోని అమ్మలక్కలకు ఈ శివరావే దొరికాడు. విద్యాధనాలు రెండు అవసరమయ్యేసరికి నాబోటి చాలీచాలని రైతుకు మీనమేషాలు లెక్క పెట్టాల్సివస్తోంది...ఏమిటి దారి?

నగేంద్రుడు : (ప్రవేశించి) నాన్నగారూ! పిలిచారా?

శివ : అవునయ్యా, ఇలా కూర్చో! అనసూయ పరీక్షా ఫలితాలు ఈ దినమే కాదు వెలువడేది?

న : అవును; కాని, ఇంకా మెయిలు రాలేదు.

శివ : అనసూయ తప్పక ప్యాసవుతుందని అనుకుంటాను.

న : అవును, నాన్నగారూ; అందుకనే పది రూపాయలు పెట్టి బహుమతి ఇవ్వడానికి త్యాగరాయకృతులు తెచ్చా.

శివ : (గద్గదిక స్వరం) నీకు చినిగిన చొక్కాలూ; నీ చెల్లెలికి త్యాగరాయకృతులూనా?

న : సెలవలే కదా నాన్నగారూ; ఇంట్లో ఏ చొక్కా వేసుకుంటే ఏం?

శివ : అంతకంటె చేయదగింది మాత్రమేముంది నాయనా?

న : నాన్నగారూ! ఐశ్వర్యం లేనివారికి అగౌరవమేనా?

శివ : ప్రస్తుతమంతే...

న : విద్యకు విలువ లేదంటారా?

శివ : ఓరీ పిచ్చివాడా! విద్యకు గౌరవమే ఉంటే ఈ దినం

మన పరిస్థితులు ఇట్లా ఎందుకు వుంటాయ్? అను పెండ్లికి ఎందుకు అలమటించి పోవలసివస్తుంది?

న : నాన్నగారూ; మేం పెండ్లి చేసుకోకపోతే మీకు బాధగా వుంటుంటా?

శివ : నాకు బాధ కాదు, నాయనా: సంతోషం, కంటిలో కారం పెట్టుకుంటుంది.

న : అయితే అను... పెండ్లి చేస్తే సరిపోదూ!

శివ : మరి నీ పెండ్లో?

న : ఇంకా రెండేళ్లకుగాని ఎం.బి.బి.ఎస్. పూర్తికాదుగదా!

శివ : అనసూయ పెండ్లి చేస్తే నీ చదువుకు డబ్బేది? ఉన్న అయిదు ఎకరాలు అమ్మితేనేగాని అమ్మాయిపెండ్లికాదు. [అనసూయ : (పత్రికతో ప్రవేశించి) నాన్నగారూ! ఇదిగో నా నెంబరు.]

న : నేను చెప్పలేదా, అనూ; నీవు ప్యాసవుతావని?

శివ : క్లాసు వచ్చిందా, తల్లీ?

అన : అవును, నాన్నగారూ!

న : క్లాసు కూడా వచ్చిందే! అయితే, నా బహుమతి నీకు యోగ్యమైంది కాదు. అయినా తెస్తానుండు.

శివ : (సంకోచం) అమ్మా; ఇక నీ చదువు ఆపివేస్తే...

అన : (ఉలిక్కిపడి) ఆఁ! అదేమిటి నాన్నగారూ?

శివ : ఆర్థిక పరిస్థితి.

అన : (కంపితస్వరంతో) నాన్నగారూ!..(నరేంద్రుడు ప్రవేశం)

న : ఇదిగో, అనసూయా; ఇదిగో నీకు బహుమతి. కనీసం రోజుకు ఒక కృతి అయినా పాడి నాన్నగారికి వినిపించాలి.

శివ : అట్లాగే చేస్తుందిలేవోయ్. వచ్చిన సంగీతం మరచిపోతుందా!

న : మీరు హామీ ఇస్తున్నారు కాబట్టి ఈ పూజ్య గ్రంథాన్ని మీరే బహూకరించండి. (ఇస్తాడు)

శివ : ఇదిగో, అమ్మా! తీసికో.

అన : (తీసికుని) నమస్కారం.

శివ : (బయటకు చూస్తూ) ఇదేమిటి, కాళిదాసు వగర్చుకుంటు వస్తున్నాడు! (కాళిదాసు ప్రవేశం)

కా : మీ అమ్మాయి ప్యాసయిందని విని పెడల్సులేని సైకిలెక్కి పదిమందిని పడగొట్టుకుంటూ పరుగెత్తుకుని వస్తూనే ఉన్నాను; అప్పుడే ఇక్కడ బహుమతులు, ధన్యవాదాలు అయిపోతూనే ఉన్నాయి.

అన : నమస్తే; మామగారూ!

కా : ఆఁ! పెద్దచిక్కే తెచ్చిపెట్టేవమ్మా!

శివ : (చిరునవ్వు) ఇంతలో ఇంత చిక్కేమి వచ్చిందోయ్?

కా : చిక్కంటే చిక్కా! పెద్ద చిక్కే వచ్చింది. 'నమస్తే' అందుకుని అభినందనాలు చెప్పడమా? లేక అభినందనాలు చెప్పేవరకు అనసూయ నమస్తే వాపసు చేసికోవడమా?

అన : ఈ సమస్య ఒక కప్పు కాఫీతోగాని విడిపోదు.

కా : అవును; సమస్త సమస్యా నివారిణి కాఫీదేవి.

అన : అయితే, ఇదిగో తెస్తా. (వెళ్లును)

శివ : నరేంద్రా; కాఫీదేవి తరవాత సిగరెట్టు కేళిక ఉంటా లేమో చూడు, మీ మామకు.

కా : నేను కాలేజీ కుఱ్ఱవాణ్ణి కాదోయ్, శివరావు.

న : కాలేజి కుఱ్ఱవాళ్లందఱు సిగరెట్టు త్రాగుతారంటారా?

కా : త్రాగకపోతే వాడు ఒట్టి అసభ్యుడు.

అన : ఇదిగో, మామగారూ! కాఫీ తెచ్చాను.

కా : ఇదేమిటి? ఇందులో కూడా మరల సమస్యయేనా?

న : మీరు రావడమే ఒక సమస్యేమో!

కా : అది కాదోయ్, నరేంద్రం; ఈ కప్పు కాఫీతో నాకు లుబ్ధాగ్రేసర చక్రవర్తి బిరుదివ్వటం న్యాయమేనా?

శివ : మేమందరం ఇప్పుడే తాగాం.

న : మామగారూ; మీకింత సందేహమెందుకు? నేను మీకు విందుచేస్తా.

కా : మీ కంటే?

న : ఇక్కడ ఉన్నవారందరికి; అప్పు ఉండటం ఒక పంక్తిని కూర్చుండవచ్చు.

కా : అప్పుడింకో సమస్య తల ఎత్తుతుంది.

అన : మామగారు సమస్యలకు సాక్షీభూతుల్లా ఉన్నారు.

కా : విందనటం, పచ్చడి మెతుకులు పెట్టడం సమస్య అవునా, కాదా?

శివ : అవునోయ్, అదిగో; ఇదంతా ఆ ముసలి ఆయన మహోత్కృష్టమోయ్. (గాంధిపటం చూపుతాడు)

న : శాకాహారం సాత్వికగుణప్రధానమైంది కాదా?

కా : ఏదో హారం వేయవోయ్; కాని కాస్త చెప్పుకోవడానికి వీలుగా ఉండేమాత్రం చూడు.

శివ : మీమామ భోజనప్రియుడోయ్.

అన : అయితే, ఈవేళ మామగారికి పరీక్ష.

కా : మీ పరీక్షలపిచ్చిలోకి నన్ను కూడా దింపబోకండి.

న : అనూ, ప్రొద్దెక్కితే మామయ్య మంచం వేస్తాడు.

అన : ఇదిగో, ఒకగంటలో తయారవుతుంది; వెళ్తున్నా.

కా : (అనసూయ వెళ్లినతరవాత) పెండ్లివిందు ఎప్పుడోయ్?

శివ : వియ్యంకుడికి విందుకూడానా?

కా : పూలదండలతోనే లేదనిపిస్తావా, ఏమిటి?

శివ : ఏదిండలైనా కట్నంమాత్రం తప్పదుగదా?

కా : కట్నానికేం? ఇంకా అయిదుఎకరాలుందిగదా!

శివ : ఉన్న కొంచెం కాస్తాఅమ్మి కొడుకుచేతికి చిప్ప ఇవ్వనా?

కా : చిప్ప ఇవ్వనమెందుకు. ఇటు ఇస్తావు, అటు పుచ్చుకుంటావు. నీవుమాత్రం తెలివితక్కువవాడవా?

న : ఇచ్చుకోవడం, పుచ్చుకోవడం లేకపోతే పెండ్లిండ్లే కావంటారా?

కా : మీ నాన్ననే కనుక్కో; నీ కెంతపాట పెట్టాడో?

శివ : ఇచ్చేవాడుంటేగదా?

కా : ఇవ్వడం తప్పితే పుచ్చుకోవటం ఎరగని పెద్దమనుషులు పడిగాపులు పడివుంటే లేరంటావేమిటి?

శ : మామగారు, నిజంగా సమస్యలో నే పడ్డాను.

కా : ఇంట్లో కన్నెఉన్నప్పుడు కావలసినన్ని సమస్యలోయ్. అరనైవేలిచ్చి మా ఉమను ఇస్తాను; ఏమంటావ్?

శివ : చేసేకు నేనాడుఇక్కడవుండగా నన్ను అడగడమెందుకూ?

శ : లేదు, మామగారూ; నేను ఇప్పుడు పెండ్లిచేసుకోను.

శివ : (ఉలిక్కిపడి) ఇదేమిటోయ్?

శ : క్షమించండి, నాన్నగారూ, చదువు పూర్తి కానీయండి.

శివ : అంతవరకు ఆడపిల్లను అట్టే పెట్టమంటావా?

శ : అట్టేపెట్టడం మెందుకు?

శివ : ఉన్న పొలం కాస్తా అమ్మివేయమంటావా?

శ : ఏంచేస్తాం!

శివ : అమ్మకు, నాన్నకు అక్షయపాత్ర ఇస్తావా?

శ : నాన్నగారూ, నిజంగా అపనే చేయాలిసివస్తే నేను చేస్తాను; గాని మిమ్మలను బయటికి రానిస్తానా?

కా : అరనైవేలు అడగకుండా ఇస్తుంటే అడుక్కోవటం ఏమి కర్మమోయ్, అల్లుడా?

శ : అరవైవేలని ఆత్మహత్య చేసుకోమంటారా?

శివ : నీవొక్కడవేనా ఈ ఆత్మహత్య చేసుకునేది?

కా : కట్నాల చదువులరోజుల్లో కూడా కాశీకి ప్రయాణమేమిటోయ్!

శ : అదృష్టముంటే కాశీలో కూడ ఐశ్వర్యం దొరుకుతుంది.

శివ : ఐశ్వర్యంకాదు, సన్యాసం.

శ : తల్లిదండ్రుల సేవకంటె నాకు మరో ఐశ్వర్యం అక్కరలేదు.

కా : దానికైనా డబ్బుకావాలి గదోయ్.

శ : ఆత్మవిశ్వాసముంటే అన్నీ అవే వస్తాయి.

కా : ఆత్మవిశ్వాసమని చేతికందింది వదిలిపెడ్తారా?

శివ : ఇటువంటి తెలివితక్కువవాళ్లు అంతకంటె ఏంచేస్తారు?

శ : ఇది తెలివితక్కువైతే మరి పురుషార్థమేమిటి?

శివ : ఓహో, అట్లాగా; ఇదంతా పురుషుని పౌరుషం కాబోలు. సరే, నీవు నీయీ పౌరుషంతోనే బ్రతుకు; వెళ్లు.

శ : నాన్నగారూ!...

శివ : కడుపు కట్టుకొని కష్టపడ్డ మమ్మల్నే కాదంటే ఇహ నీకు, మాకు సంబంధమేమిటి? (కోపంతో వెళ్తూ)

కా : ఇదిగో, శివరావూ! వెళ్లకు; ఏదో చిన్నతనం.

శివ : చిన్నతనమైతే తిన్నగానే మాట్లాడేవాడు. తను గొప్ప ఆదర్శపురుషుడ ననుకుంటున్నాడు. (వెళ్తాడు).

కా : కని పెంచినందుకు ఇదిటోయ్, మీరుచేసే ఉపకారం?

శ : మామగారూ! (గాద్గదికంగా) నాన్నగారి కింతకోపం వస్తుందనుకోలేదు.

కా : ఇప్పుడైనా మించిపోయిందిలేదు; ఉమను చేసుకో.

శ : మామగారూ; ఇంత చదువుకుని కట్నానికి కక్కుర్తి పడమంటారా? పెద్దలు నాకోటివారికి దారిచూపిస్తారని ఆశిస్తున్నాను.

కా : చదువుకున్న వాళ్లంతా కట్నాలకు ఎగబ్రాకుతుంటే నీ యీ ఆదర్శమేమిటోయ్?

శ : అపవాదం ఉండకూడదంటారా?

కా : ఈ అపవాదం అనర్థానికే దారితీస్తుంది.

శ : ఆత్మవిశ్వాసిని అనర్థం ఏమీచేయలేదు. (అనసూయ ప్రవేశం)

అ : మీ మాటల కంతుండదు. రండి, విస్తళ్లు

శ : రండి, మామగారూ! అనసూయ వాకం ప్రసాద పరీక్ష నివమిది.

అ : మామగారు నాకు తప్పకుండ సర్టిఫికెట్లు ఇస్తారు.

కా : అత్తగారు ఇవ్వవలసిన సర్టిఫికెట్లు నేనిస్తే ఆవిడ ఊరుకుంటుందా?

శ : ముందు మీరివ్వండి. (అందరూ నవ్వుతారు)

కా : సరే, పదండి. (అందరూ వెడతారు)

## మూడవ రంగం

* * శివరావు గృహం, లోపల చావడి; సమయం మధ్యాహ్నం అనసూయ వీణ చేతబూని కూర్చుండి ఆలోచిస్తూ ఉంటుంది.

అన : అందరూ భోజనంచేసి హాయిగా నిద్రపోతున్నారు. ఎంత ప్రయత్నించినా నాకుమాత్రం నిద్రపట్టలేదు...నాన్నగారు నా చదువు ఆపివేయమంటున్నారే!...అవును, వారుమాత్రం ఏంచేస్తారు డబ్బులేనప్పుడు?...ప్చ్! లేలు లేనప్పుడు విచారపడడమెందుకు? వీణన్నా వాయించుకుందాం.

[లోపలినుంచి వీణ తెచ్చి శ్రుతులు సరిచేస్తుంది]

ఏలనీదయరాదు పరాకుజేసే
వేళ సమయముగాదు
బాల కనకమయ చేల సుజనపరి
పాల శ్రీరమాలోల విధృత శర
జాల శుభద కరుణాలవాల ఘన
నీల నవ్యవనమాలికా భరణ
రారా దేవాదిదేవ రారా మహానుభావ
రారా రాజీవనేత్రా రఘువరపుత్రా॥ ఏల॥

(సుశీల ప్రవేశం) రా, సుశీలా; ఇంత ఎండలో వచ్చావు!

సుశీల : నీకు అభినందనాలు చెప్పడానికి.

అన : ప్యాసయినందుకు ఆనందముంటే గదా, అభినందనాలు అందుకోవడానికి!



ఒకరి అనుభవం మరొకరికి విశ్వాసం యిస్తుంది. సుఖజీవనానికి పూలబాట వేస్తుంది. భరింపరాని గర్భవేదనతో, దిగజారిన మనస్సుతో జీవితాన్ని యీడ్వవలసిన మహిళలకు "లోధ్ర", విశ్వసనీయమైన శరణ్యం.

"లోధ్ర" అన్నిచోట్లా లభ్యమవుతుంది.

సు : అదేమిటి, అట్లా అంటావు?

అన : ఏం ప్యాసయితే ఏం లాభం?

సు : నీ విచారానికి కారణమేమిటో తెలియటం లేదు.

అన : కారణమేముంది? కట్నానికున్న విలువ చదువుకు లేదు గదా? ఏం చదువుకుంటే ఏం?

సు : మగవానికి మనుగడమీద మక్కువ ఆరోజు కారోజుకు ఎక్కువైపోతోంది.

అన : ఈ మనుగడ స్త్రీ ధనంతోనే సాధ్యమౌతుందా?

సు : అభిమానమున్నవాడు అట్లా చేస్తాడా?

అన : అటువంటి అభిమానం లేనివాణ్ణి అంటగట్టుకోవడం ఎందుకు? కన్య బ్రహ్మచారిణిగా ఉండకూడదా?

సు : అప్పుడు మనను మన ఆడవాళ్లే మగవాళ్లకంటే ఎక్కువ అల్లరి పెడ్తారు.

అన : ఇంత అన్యాయమా?

సు : సంఘం స్త్రీని అవమానపరచటమే పనిగా పెట్టుకున్నప్పుడు మనం ఏంచేయగలం?

అన : ఆదర్శానికి ఆహుతి అయిపోవాలి గాని ఇటువంటి సంఘానికి భయపడటమా?

సు : ఇదీ మనకు సాధ్యంకాదు. కన్నవారు కన్నెచెరవిడిపించుకోవడానికి కటకట పడుతూవుంటారు.

అన : కాబట్టి కన్య కర్మ కన్యకే,

సు : ఆధునిక సభ్యతా మహాత్మ్యం. ఆయన అరవై వేలైతే పుచ్చుకున్నారు; కాని ఆదరించడం తెలిసిందా?

అన : ఎం.ఏ. ప్యాసయిన మాధవరావు కూడా అంతేనా?

సు : ఆడది అంటే అలుసైపోయినప్పుడు ఆయన తప్పేముంది?

అన : ఇంత చదువుకుని నీవుకూడా ఇట్లాగే మాట్లాడుతున్నావా?

సు : ఈ చదువులు మనలను ఉద్ధరించేవి కావు.

(కాళిదాసు ప్రవేశము)

కా : అభివందనాలు చెప్పడానికి ఎండలోనే పరుగెత్తుకుని వచ్చావా; అమ్మాయీ! (ఇద్దరు నిలబడతారు)

సు : ఎండ తగ్గిపోయిందె; నాన్నా.

కా : రేపు అనసూయను విందుకు పిలు.

సు : ఒక ప్రక్కను కుందుతూవుంటే విందు లేమిటి ఆమెకు!

కా : (ఆశ్చర్యం) కుందుతోందా! ఎందుకు!!

సు : మీరంటే ఉన్నది కాబట్టి అడిగినంత ఇచ్చి నా బెడద వదల్చుకున్నారు. మరి మామయ్య సంగతి నీకు తెలిసిందే గదా?

కా : (బాధగా) అటు ఇటు గొప్ప చిక్కే తీసుకుని వచ్చావే. పెండ్లి అయి నీవూ, పెండ్లిగాక ఆమె; ఇద్దరి పరిస్థితి ఒకటిగానే వున్నట్లుంది.

సు : నాన్నా, నీ మనస్సుకు బాధ కలిగించాననుకుంటాను.

కా : లేదమ్మా, ఆడపిల్లలు వుంటే ఆగచాట్లు తప్పవౌతాయా?

[నగేంద్ర, అమరేంద్రుల ప్రవేశం]

న : ఇదిగో, అనూ; అమరేంద్రుడు నీకు అభినందనాలు చెప్పడానికి వచ్చాడు.

అన : (తలవంచి) ధన్యవాదాలు. (నమస్కరిస్తుంది)

కా : ధన్యవాదాలకు కాదు; దారాపహరణానికి వచ్చినట్లుంది.

అమ : ఎప్పుడూ పరిహాసమేనా, మామగారూ?

అన : సుశీలా; అమ్మను చూడవు?

సు : పద, పోదాం; అనసూయా.

కా : అవకాశం వచ్చినప్పుడు అంగలార్చితే అమ్మాయిల పెండ్లిండ్లు ఎట్లా అవుతాయ్?

సు : పెండ్లింట్లకు పెద్దలున్నారుగదా; నాన్నా? (ఇద్దరు వెళ్లుదురు)

శివరావు : (ప్రవేశించి) ఓహో! అమరేంద్రుడా!

కా : అమ్మాయికి అభినందనాలు చెప్పడానికి వచ్చాడు.

శివ : బి. ఇ. ప్యాసయినావుట గదోయ్?

అమ : అవునండి; మామగారూ.

కా : మామగారిని మంచిమాట చేసుకుంటేనే మనుగడోయ్.

శివ : అందరికి అతని మామలయ్యే మహాద్భాగ్యముంటుందా?

కా : మహాభాగ్యాని కేముంది! మనుగడకు సరిపోయే మూట కటి ఇస్తే సరి.

అమ : వెడదామా, నగేంద్రం?

న : సరే; పద.

అమ : వెళ్లివస్తా; మామగారూ! నమస్తే.

కా : రత్నంలాంటి కన్య వుంటే మళ్ళా రాక ఏంచేస్తావు?

[అందులు నవ్వు; అమర, నగేంద్రులు వెడతారు]

శివ : ఏమిటోయ్, కాళిదాసూ; ఈ చలోక్తులు.

కా : సరసం తెలీనివాడు సన్యాసం పుచ్చుకోవడం మంచిది

శివ : 'రసం' రసాతలానికిపోతే ఇంకా 'స' కూడా ఎక్కడ నుంచి వస్తుంది?

కా : నిరాశకు నీరా మంచిస్నేహితుడోయ్.

శివ : కాళిదాసులోని కారం చాలకనా?

కా : ఈకారం కంటిలోపడితే మరి కలియుగమే లేదు.

శివ : త్రేతాయుగం చూడాలనేగదా?

కా : ఆశ నిరాశకాదు లేవోయ్.

శివ : అమరేంద్రుడు అల్లుడౌతాడంటావా?

కా : అందుకు సందేహమా! అమరేంద్రుడు అనసూయకోసం అలమటించి పోతున్నాడు. కాని...

శివ : 'కాని', ఏమిటి?

కా : ధనంజయరావుకు ధనంమీద మమకారం బాగావుంది.

శివ : న్యాయమేగదా.

కా : న్యాయాన్యాయాలు అమరేంద్రునిచేతిలో ఉన్నాయి.

శివ : తల్లిదండ్రులనుకాదని అతనేమిచేయగలడు!

కా : తల్లిని మేమిద్దరం ఒప్పించాం.

శివ : అట్లాగా! ఇంతవరకు తెచ్చినతరవాత తండ్రినిమాత్రం ఒప్పించలేకపోతావా?

కా : ధనంజయరావు సామాన్యుడు కాడుగదా. ధనం తస్తుం దంటే ధర్మాన్ని కూడా వదలిపెడ్తాడు. సరే, నేను మళ్ళీ కలుస్తా. (వెళ్ళును)

శివ : కాకపోతే కలియుగమే తేదా! (నిష్క్రమణ)

## నాలుగవ రంగం

* * సుశీల గది; సమయం: సాయంకాలం; గది చక్కగా అలంకరించి ఉంటుంది. కుర్చీలు, సోఫాలు, పందిరి మంచం ఉంటాయి. సుశీల 'హాండ్ బాగ్' తీసుకుని బయలుదేరబోతూ వుంటుంది. ఇంతలో మాధవరావు ప్రవేశించి:

మాధవరావు: ఎక్కడికీ ప్రయాణం; సుశీలా?

సు : (అయిష్టంగా) అంటే?

మా : అంటే, ఏమీ లేదు; మేం సినిమాకు వెడుతున్నాం.

సు : మేమంటే?

మా : నగేంద్రం, అమరేంద్రుడు, మరి నేను.

సు : మంచిది, వెళ్లండి

మా : నీ అనుమతికోసం కాదు చెప్పేది; కారు కావాలని చెప్పడం.

సు : మరి, నేనో?

మా : నీవా? నీ వెక్కడకు వెడుతున్నావు?

సు : ఈ వేళ మహిళా సంఘం వర్కింగు కమిటీ మీటింగు.

మా : అయితే, నీవు కూడా మాతో రా.

సు : (ఆశ్చర్యం) మీతోనా? కారులో చోటేది?

మా : నీవు డ్రైవరు ప్రక్కన కూర్చో.

సు : (కోపంగా) డ్రైవరు ప్రక్కనా? చదువుకున్న సభ్య మానవులు అనవలసిన మాటలేనా ఇవి?

మా : ఏం చేద్దాం? పెద్దమనుష్యులను కారులో పోదామని ఇంటికి తీసికుని వచ్చినప్పుడు.

సు : అయితే, బస్సులో వెళ్లండి.

మా : (చికాకుగా) బస్సులోనా! ఇట్లా అనటం సభ్యత్వమా?

సు : (తీవ్రంగా) సభ్యత్వం గాకపోతే స్వంత కారు పెట్టుకో పోయారూ?

మా : (వికటంగా) ఓహో! స్వంత కారా!! ఒక కారు కొని ఇవ్వమని మీ నాన్నతో చెప్పకపోయేవూ?

సు : ఏం? ఇచ్చిన డబ్బు అరవై వేలు చాలకా?

మా : లక్షాధికారి కూతుర్నని మిడిసిపడిపోతున్నావా?

సు : మర్యాదగా మాట్లాడండి.

మా : మర్యాద నీకే తెలుసుననుకుంటాను. ఇంటికి వచ్చిన అల్లుణ్ని అవమానం చేయటం మర్యాదే కాబోలు?

సు : ఇందులో అవమానమేముంది. కారు నాకు కావాలన్నా.

మా : ఇది అవమానంగాక ఆప్యాయతా?

సు : ఆప్యాయతకూడా తెలుసు; భార్యను బానిసగా చూసే వారికి.

మా : అయితే నేను నీ బానిసనా?

సు : అంతమాట నేను అనను; కాని అన్నా తప్పులేదనుకుంటాను.

మా : ఆఁ, ఇంత అపరిపాటా? (మీదకు వెళ్లబోవును)

సు : (తీవ్రంగా) ఆగండి, అక్కడే. ఎం. ఏ. పాసయితే మాత్ర మేమి? అమర్యాదిగా ప్రవర్తించడం అల్లుళ్ళకు అలవాటయిపోయింది.

మా : నీమాదిరి అసభ్యులకు ఇంతకంటె చేయవలసిన మర్యాదేముంది?

సు : (పరిహాసం) ఓహో! అట్లాగా!!...సరే, కానియ్యండి. నేను వెడుతున్నా. (పోబోవును)

మా : (తీవ్రంగా) ఆగు.

సు : (నిర్లక్ష్యంగా) ఏం? ఎందుకు?

మా : నీవు వెళ్ళడానికి వీల్లేదు.

సు : ఏం? నేనేమీ మీ బానిసను కాదే; ఎక్కడ నిలబడమంటే అక్కడ నిలబడడానికి?

మా : అయితే 'డైవర్సు' చేసికో.

సు : (ఆశ్చర్యం) డైవర్సా!

[తెరలో మాధవరావు, మాధవా...]

సు : లోపలికిరండి, అమరేంద్రా! వీరుని వీరత్వం చూద్దురుగాని.

[అమరేంద్ర, నగేంద్రుల ప్రవేశం]

అ : (పరికించి) ఏమిటోయ్; ఏదో యుద్ధసన్నద్ధుడవైనట్లుం దే!

సు : ఏం లేదు; అల్లుళ్ళ ఆర్భాటం.

మా : (తీవ్రంగా) ఏయ్, సుశీలా!

న : అసలు విషయమేమిటి?

సు : ఏముంది? తనభార్య డ్రైవరుప్రక్కన కూర్చోపోతే డైవర్సు చేస్తారట. (కాళిదాసు ప్రవేశం)

కా : ఏమిటీ గలభా? రాచకీయాల్లో ప్రవేశించారేమిటి?

సు : అదికాదు, నాన్నా; అల్లుడు డైవర్సు చేస్తారట.

కా : డైవర్సంటే ఏమిటమ్మా?

అ : డైవర్సంటే విడాకులు.

కా : (ఆశ్చర్యం) విడాకులా! విడాకులంటే...

న : చేసుకున్న భార్యను విడిచి పెట్టడం.

కా : (నిర్ఘాంతపోయి) ఓహో! అదా?...నూతనసంస్కారం మా ఇంట్లోనే ప్రారంభమా?

మా : అసభ్యులకు అదే తగినశాస్తి.

కా : అదేమిటి, మాధవరావూ? అమ్మాయి ఏదైనా తొందర పడితే మందలించాలిగాని ఇంత తొందరపాటు బాగుంటుందా! (తెరలో) కాళిదాసూ! కాళి...ఓహో, ధనంజయరావువచ్చారల్లే వుంది. ఆయనకొడుకు కట్నంకోసం కటకట పడిపోతున్నాడు. రా, బావా; లోపలికిరా.

[ధనంజయరావు ప్రవేశం]

ధార్మిక సిద్ధాంతాలకుగాని ప్రాముఖ్యం ఇవ్వలేదు. అలంకారికులు మానవహృదయంలో కొన్ని స్థాయిభావాలున్నాయనీ ఇవి కావ్యాస్వాద సమయంలో ఆయా విభావానుభావాదులవల్ల రసస్వరూపంలో అభివ్యక్తి పొందుతున్నాయనీ దీనివల్ల కావ్యానందం కలుగుతున్నదనీ ప్రతిపాదించారు. భరతుని కాలం మొదలుకొని జగన్నాథ పండితరాయల కాలంవరకు అభివృద్ధిపొందిన అలంకార శాస్త్ర దర్ప అంతా ఈ సూత్రంలో ఇమిడి ఉన్నది.

భరతుని నాట్యశాస్త్రంలో కేవలం రసదృష్టితప్ప మిగిలిన తాత్త్వికసిద్ధాంతాల ప్రసక్తి ఏమీకనిపించదు. ఆతరవాత వచ్చిన అలంకారికులుకూడా ఈ రససిద్ధాంతానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చారు.

అయితే అభినవగుప్తుడు, జగన్నాథ పండితరాయలు మొదలైన ఆలంకారికులు కొందరు అలంకార శాస్త్రసిద్ధాంతాలలో మన వేదాంతసిద్ధాంతా లంతర్గర్భితంగా ఉన్నాయని ప్రతిపాదించారు. కాని వీరుకూడా తమ రసచర్చల్లో తమ తాత్త్వికసిద్ధాంతాల కేమీ ప్రాధాన్యం ఇవ్వలేదు. నిజానికి ఆలంకారికులందరు రసోల్లసితమైన కావ్యానంద మొక్కటే కావ్యలక్ష్యమని ముక్తకంఠంతో ప్రతిపాదించారు. కావ్యంలో రమ్యములు, అరమ్యములు, జుగుప్సితములు మొదలైన కావ్యవస్తువులన్నీ కవిభావుక భావనలో రససిద్ధి పొందుతున్నాయని ప్రతిపాదించారు. ఈ క్రింది శ్లోకం దీనికి తార్కాణం.

"రమ్యం జుగుప్సిత
ముదార మథాపి నీచమ్
ఉగ్రం ప్రసాది గహనం
వికృతం చ వస్తు
యద్వాప్యవస్తు
కవిభావుక భావ్యమానం
తన్నాస్తి యన్న
రసభావముపైతి లోకే"

ఆలంకారికు లించుమించుగా రెండు వేలేళ్ళనించీ సాగించిన కావ్యచర్చలో కేవలం రసం (*Aesthetic ioy*) ఒక్కటే కావ్యలక్ష్యమని సిద్ధాంతీకరించారు. ఆ కాలంలో ఆయా తాత్త్విక సిద్ధాంతాల విషయంలో తీవ్రమైన వాదోపవాదాలు గాని, అభినివేశాలు గాని చెలరేగలేదని చెప్పలేము. నిరీశ్వరవాదము, అనాత్మవాదము, భౌతికవాదము మొదలైన వాదాలారోజుల్లో కూడా ఉన్నాయి. కాని ఆరోజుల్లో కావ్యతత్త్వజ్ఞులీవాదాల అభినివేశాల్లో పడి సాహిత్యలక్ష్యం విస్మరించలేదు. వారందరు లౌకిక ప్రయోజనాలకంటె అలౌకికమైన కావ్యరసాస్వాదమే కావ్యలక్ష్యమని ముక్తకంఠంతో ఉద్ఘోషించారు.

పైగా ధార్మికప్రచారాదులే కావ్యలక్ష్య మన్నవారిని తీవ్రంగా నిరసించారు. ఈ క్రింది శ్లోకంలో ఈ నిరసన స్పష్టంగా వినిపిస్తున్నది.

"ఆనంద నిష్యందిషు రూపకేషు
వ్యుత్పత్తి మాత్రం ఫలమల్పబుద్ధిః
యోపీతిహాసాది వదాహ సాధుః
తస్మైనమః స్వాదు పరాఙ్ముఖాయ"

—దశరూపకము.

ఇది రూపక లక్ష్య వివరణంలో రచించిన శ్లోకము. రూపలాగ వీటిల్లో వ్యుత్పత్తిమాత్రమే (ధర్మాది జ్ఞానమే) ఫలితమని నిర్వచించేవారు మందబుద్ధులనీ, వీరందరు రసాస్వాద పరాఙ్ముఖులనీ ఇటువంటి వారికొక నమస్కారమనీ దీని తాత్పర్యము. దశరూపకంలో రూపక నిర్వచన సందర్భంలో రచించిన ఈ శ్లోకం మొత్తం కావ్యాలన్నింటికీ సమన్వయించేదే. ఇలాంటి శ్లోకా లలంకార గ్రంథాలలో చాలాచోట్ల కనిపిస్తున్నాయి.

ఆలంకారికు లీ కావ్యానందం ఆధ్యాత్మికమైన బ్రహ్మానందంతో సదృశమైనదనీ ఇతరములైన లౌకికానందా లన్నింటికన్నా ఇది ఉత్కృష్టమైనదనీ ప్రతిపాదించారు. దీనివల్లనే మన సంప్రదాయంలో రసాస్వాదనకు కావ్యరచనకు అనితర సాధారణమైన ఆర్షగౌరవం లభించింది. "నానృషిః కురుతే కావ్యం" అన్న ప్రాచీన సూక్తిలోకూడా ఈ అర్థమే స్ఫురిస్తున్నది.

రసానందం ఆధ్యాత్మికపరిణతి కొకసాధనమనీ మానవపరిణతికి ఇది ఒక మహోత్తమసాధనమనీ అరవిందుని సాహిత్యవిమర్శ ప్రతిపాదిస్తున్నది. ఆలంకారికు లింత స్పష్టంగా ఈ విషయం నిర్వచించి ఉండకపోవచ్చును. కాని వస్తుతః అరవిందుని నిర్వచనానికీ ఆలంకారికులనిర్వచనానికీ అంతగా భేదమేమీ లేదు.

ఐ. ఎ. రిచర్డ్స్ (*I. A. Rechards*) మొదలైన నేటికాలపు పాశ్చాత్యవిమర్శకులు కొందరు కావ్యానుభూతివల్ల మానవుని దైనందినజీవితంలో ప్రతిహతములైన మానసికప్రవృత్తులకన్నింటికీ సమన్వయపూర్వకమైనసమ్మేళనం ఏర్పడుతున్నదనీ ఈవిధమైన మానసికవృత్తులసమ్మేళనం మానవవికాసానికి దోహదం కల్పిస్తున్నదనీ కళల కిదే పరమప్రయోజనమనీ ప్రతిపాదిస్తున్నారు. వీరందరు సాహిత్యంలో లౌకికమైన ఔపయోగికతావాదాలకు కేవలం వ్యతిరిక్తులు. చిన్న చిన్న విషయాలలో భేదాలున్నా వీరివాదం ఆలంకారికుల రససిద్ధాంతానికి చాలా సన్నిహితంగా ఉన్నది. సంగ్రహంగా భారతీయసాహిత్యదృక్పథం ఇది. ఇంచుమించుగా ఇరవయ్యోశతాబ్ది ప్రారంభంవరకు భారతీయవాఙ్మయంలోను ఆంధ్రవాఙ్మయంలోను ఈ దృక్పథమే ప్రాధాన్యం వహించింది. సాంప్రదాయికమైన సాహిత్యవిమర్శకూడా ఈ మార్గంలోనే నడిచింది.

నేటివరకు గడిచిన భారతీయసాహిత్యంలోను ఆంధ్రసాహిత్యంలోను ఎంతో సిద్ధాంత వైవిధ్యం కనిపిస్తున్నది.

మన ప్రాచీనసాహిత్యంలో ఈ వైవిధ్యంతోబాటు సర్వాంగ సుందరమైన జీవితసమన్వయంకూడా కనిపిస్తున్నది. ఈ సమన్వయం ఇంతవరకు అవిచ్ఛిన్నంగా ప్రవహించిన మన సంస్కృతిస్రవంతి కొక ప్రత్యేకలక్షణం. దీని కనేక కారణాలు పేర్కొనవచ్చును.

## అద్వైత వేదాంత దృక్పథము

అన్నింటికన్నా ముఖ్యమైనది అద్వైత వేదాంత దృక్పథము. ఇంతటి సహనశీలమైన కారుణిక దృక్పథం ప్రపంచంలో మరి ఏ తాత్త్వికదృక్పథంలోను కనిపించడంలేదు. సర్వతాత్త్విక సిద్ధాంత సమన్వయమే దీనిలక్ష్యం. ఇందువల్లనే మన దేశంలోని నిరీశ్వరవాదము, అనాత్మవాదము మొదలైన అసాంప్రదాయిక వాదాలెన్నెన్నో సాంప్రదాయిక వాదాలతోబాటు సమాన గౌరవప్రపత్తులతో వర్ధిల్లాయి. అద్వైత వేదాంతం పునాదులమీద ఆవిర్భవించిన మన మతవిశ్వాసాలలో ఉన్న సహనశీలత తదితర మత విశ్వాసాలలో కనిపించడంలేదని తత్త్వజ్ఞు లనేకులు ప్రత్యేకంగా ప్రశంసించారు. నిజంగా నేటికాలపు ప్రజాస్వామ్య సిద్ధాంతాలుకూడా అందుకోలేని ఉదాత్తప్రజాస్వామ్యలక్ష్యాలీ అద్వైతవేదాంతంలో

కాని, ఇటీవల సాహిత్యవేదికలో విమర్శకులు కొందరు అద్వైతసిద్ధాంతాలు నియంతృత్వానికి దారితీస్తాయని వ్రాశారు. ఇది కేవలం నిరాధారమైన నిందారోపణ! ఈ వేదాంతాన్ని గురించి సమగ్రపరిశీలన లేకపోవడంవల్లనే ఇటువంటి అపోహలు బయలుదేరుతున్నాయి. అయినా ఈ వ్యాసానికిది అప్రస్తుతం. కనక ఇది ఇంతటితో విడిచివేస్తున్నాను.

విశ్వజనీనమైన అద్వైత వేదాంత దృక్పథం అంతర్లీనమై ప్రవహించడంవల్లనే భిన్నభిన్న దృక్పథాలున్నా మన సాహిత్య స్రవంతి నేటివరకు అపూర్వమైన సమన్వయ సౌందర్యంతో ప్రవహించింది.

## నేటికాలపు వాఙ్మయ పరిస్థితి

అయితే 20 వ శతాబ్ది పురోగమించినకొద్దీ రచయితలలోను, రచనలలోను సాంప్రదాయికంగా వస్తూన్న ఈదృక్పథం బాగా సన్నగిల్లిపోయింది. రచయితల ప్రాథమిక విశ్వాసాలలో పరస్పర విభేదాలు హెచ్చు పెరిగిపోయాయి. దీనికి విదేశ తాత్త్విక సిద్ధాంతాలు, సాహిత్యధోరణులు చాలావరకు కారణమని చెప్పవచ్చును. చాలామంది రచయితలలో లుప్తప్రాయమైపోతున్న సంస్కృతాంధ్ర సాహిత్య విజ్ఞానంకూడా దీనికొక ముఖ్యకారణంగా పేర్కొనవచ్చును.

ఇవిగాక నానాటికీ పెరిగిపోతున్న సాంఘికార్థికసమస్యలు, వీటివల్ల బయలుదేరుతున్న విప్లవధోరణులు, కొంతవరకీభిన్న భిన్న విశ్వాసాలేర్పడడానికి ప్రధాన కారణాలని చెప్పవచ్చును.

ఆ యీ కారణాలవల్లనే నేటి రచయితలలో కేవలం పరస్పర విరుద్ధమైన విశ్వాసాలావిర్భవిస్తున్నాయి. ఏ యిద్దరు రచయితలను తీసుకున్నా ప్రధాన సిద్ధాంతాలలో ఐకమత్యమున్నవారు చాలా అరుదుగా కనిపిస్తున్నారు.

ఈ పరిస్థితిలో రచయితల గురుతర బాధ్యతనుగురించి తీవ్రమైన వాదోపవాదాలు చెలరేగడంలో ఆశ్చర్యమేమీ లేదు. నిజానికీవాదం కేవలం సాహిత్యదృక్పథంతో జరగవలసిన అవసరమేమీ కనిపించదు. వస్తుతః ఈ వాదంలో కమ్యూనిజమే ప్రధానసమస్య. ఈ సమస్య సాహిత్యంతో సమన్వయించడంవల్ల వాదోపవాదాలలో కొంత సందిగ్ధస్థితి కూడా ఏర్పడింది. నేటి మన సమాజానికి కమ్యూనిజం ఆవశ్యకతను గురించీ, కమ్యూనిజం స్వభావ దృక్పథాలనుగురించీ ఈ వాదోపవాదాలు జరిగిఉండవలసింది. ఏది ఏమైనా ఈ వాదోపవాదాలవల్ల పాఠకులలో ఒక అపూర్వ చైతన్యం బయలుదేరిన మాట వాస్తవం.

## సాహిత్యము - సాంఘిక సమస్యలు

ఒకసంఘంలో ఉద్భవించిన సారస్వతమేదీ ఆ సంఘ సమస్యలాకళించుకోకుండా అభివృద్ధి పొందలేదని అందరు అంగీకరిస్తారు. అయితే సాహిత్యం ఈ సమస్యలాకళించుకునే ధోరణి వేరు. సాహిత్యంచూపించే సమస్యాపరిష్కారాలు, సమన్వయాలు ప్రత్యేకమైనవి. కేవల రాజకీయదృష్టితో చేసే సమస్యాపరిష్కారాలకు వీటికి చాలా భేదాలున్నాయి. సాహిత్యంలో ఈసమస్యల సమన్వయంలో ఒక విధమైన నిర్లిప్తత ఏర్పడుతుంది. ఈ నిర్లిప్తత లేని రచనలన్నీ మనం కేవలం ప్రచారప్రవాహంలో జమకడుతున్నాము. వీటి కేమాత్రము సాహిత్యగౌరవం ఇచ్చి ఆదరించడం లేదు. ఇది సర్వత్ర అనుభవంలో ఉన్న విషయమే. కేవలం సాంఘిక సమస్యలే సాహిత్యానికి పట్టుగొమ్మలు కావలసిన అవశ్యకత కూడా ఏమీ లేదు. ఉదాహరణకు ప్రకృతి సౌందర్యవర్ణన పరమైన రచనలలో ఈ సాంఘికసమస్యల ప్రసక్తి లవమైనా కనబడదు లేదు. స్వర్గసంగీత చిత్రలేఖనాల్లో ఇది ఇంకా స్పష్టంగా కనిపిస్తున్నది.

## ప్రజాస్వామ్య దృక్పథం

సానుభూతి, ఆర్ద్రత, కరుణ మొదలయిన ఉదాత్తదృక్పథాలవల్లనే ఉదాత్తసాహిత్యం ఆవిర్భవిస్తున్నది. ఆదికావ్యావిర్భావానికి క్రౌంచమిథున వియోగంవల్ల పెల్లుబికిన కారుణ్యమే కారణమని మన సంప్రదాయం చెబుతున్నది. ఇందువల్ల సహజంగానే సాహిత్యంలో ప్రజాస్వామ్యం దృక్పథం అంతర్లీనంగా ఉన్నదని చెప్పవచ్చును. కనక రచయితలందరు సహజంగా ప్రజాస్వామ్యవాదులే.

ప్రజాస్వామ్యంలోని వ్యక్తిస్వాతంత్ర్యం కళావిర్భావానికి తగినదోహదం కలిగిస్తున్నది. సిద్ధాంతదృష్ట్యా పరిశీలిస్తే ఈవిధమైన వ్యక్తిస్వాతంత్ర్యం కమ్యూనిజంవల్ల లభించడంలేదు. నియంతృత్వంలో సమష్టికున్నంతప్రాధాన్యం వ్యష్టికి లేదు. సమష్టికోసం వ్యష్టిని బలివెయ్యడం గాని, వ్యష్టి స్వార్థంకోసం సమష్టి శ్రేయోనాశనం గాని మానవాభ్యున్నతికి దోహదాలు కాజాలవు. వ్యష్టి సమష్టి శ్రేయోలక్ష్యాలకు సరియైనసమ్మేళనం ఉన్న సమాజాలలోనే కళలకు సహజమైనస్వాతంత్ర్యం వాతావరణం ఏర్పడగలదు. వ్యక్తిస్వాతంత్ర్యంద్వారానే ఇటువంటి సమాజస్థాపన సుకరం కాగలదని గత చరిత్ర ఋజువుపరుస్తున్నది. నియంతృత్వము, ప్రజాస్వామికము పరస్పరవిరుద్ధమైనసిద్ధాంతాలు. నియంతృత్వంవల్ల ప్రజాస్వామ్యం వర్ధిల్లగలదని ప్రతిపాదించే సిద్ధాంతంలో సాధ్యసాధనవైరుధ్యం స్పష్టమే.

ప్రపంచంలో క్రమక్రమంగా వ్యక్తిస్వాతంత్ర్యాలకు అవకాశం తక్కువైపోతున్నాయి. సంఘశ్రేయోదృష్ట్యా ఈ పరిమితినిర్ణయం కొంతవరకు సహజమే. కాని సంఘక్షేమవ్యాజంతో వ్యక్తివికాసానికి అవరోధంకలిగించేధోరణు లెన్నో నేటిసమాజంలో కనిపిస్తున్నాయి. ఈ ధోరణి మన దేశంలోకూడా వృద్ధి పొందుతున్నది.

ఈవిధంగా క్రమక్రమంగా యాంత్రికమైపోతున్న నేటి సమాజంలో ప్రజాస్వామ్యానికే గొడ్డలిపెట్టుగా పరిణమించే శక్తులు వృద్ధిపొందడం సహజం. ఈ పరిస్థితిలో కళలకేగాక ప్రజాస్వామ్యానికికూడా వ్యక్తి స్వాతంత్ర్యం సంరక్షణం అత్యవసరం.

సహజంగా మన సంప్రదాయంలోనే ప్రజాస్వామ్య దృక్పథం అంతర్లీనమై ఉన్నదనీ, సాహిత్యదృష్టిలో కూడా ఈ దృక్పథం అంతర్వాహినిగా ప్రవహిస్తున్నదనీ అనుకున్నాము. ఆంధ్రదేశంలో ఇటీవల జరిగిన వాదోపవాదాలవల్లకూడా ఈ విషయమే స్పష్టపడింది. ఎవరో పది పన్నెండుగురు రచయితలు తప్ప మిగిలిన ప్రఖ్యాత రచయితలందరు ప్రజాస్వామ్యాదర్శాలవైపే నిలబడ్డారు. ఆంధ్రదేశంలో ప్రజాసామాన్యంలో కూడా ఈ విధమైన అభినివేశమే కనిపించింది. దీనివల్ల ప్రజాస్వామ్య శక్తులకీనాడాంధ్రదేశంలో అఖండ విజయం లభించింది. ఈ విజ

యాని కనేకమైన మహత్తర కారణాలుండవచ్చును. రచయితల ప్రజాస్వామ్యాభిమానము, చర్చలు కొంతవరకీ విషయంలో నిశితమైన జిజ్ఞాసాభిమానాలు రేకెత్తించాయి. ప్రజాస్వామ్య విజయానికివికూడా కొంతవరకు హేతువులే అని విజ్ఞులెవరైనా అంగీకరిస్తారు.

అయితే ప్రజాస్వామ్య లక్ష్యాలకు తమ అంగీకారం తెలియజేసి నంతమాత్రాన రచయితల బాధ్యత తీరిపోలేదు. ప్రజాస్వామ్య విజయం దైనందినాచరణంలో ప్రతిబింబించేటట్టు చూడవలిసిన బాధ్యతకూడా రచయితలమీద ఉన్నది. నేటి మన ప్రజాస్వామ్యం చాలావర కాదర్శరూపంలోనే నిలబడిఉన్నది. రచయితలతోబాటు రాజకీయ నాయకులుకూడా నిజాయితీతో ప్రవర్తిస్తేతప్ప దేశంలో ప్రజాస్వామ్య శక్తులు కాలూనుకుని నిలబడడం కష్టం.

ప్రజాస్వామ్య విజయానికి విద్యావ్యాప్తి, తద్వారా సజీవమైన సారస్వతాభివృద్ధి అత్యంత ముఖ్యమైనవి.

అయితే నేటి మన సారస్వతపరిస్థితి అంతగా ప్రోత్సాహకరంగా కనిపించడం లేదు. ఒక అర్థశతాబ్ది పూర్వందాకా ఆంధ్రదేశంలో సంపన్నులీ సారస్వతాభివృద్ధికి చేయూత ఇచ్చి ప్రోత్సహించేవారు. క్రమక్రమంగా నేటి సంపన్నులలో సారస్వతాభిమానం సన్నగిల్లి, కేవలం అధికారాభినివేశము, ధనకాంక్ష ప్రబలిపోతున్నాయి. ఈపరిస్థితుల్లో సారస్వతానికిక ప్రభుత్వము, ప్రజమాత్రమే పట్టుగొమ్మలుగా మిగిలారు. ప్రజలలో గ్రంథాల కొనుగోలు శక్తి ఇంకా బాగా వృద్ధిపొందడం లేదు.

ఇక ప్రభుత్వవర్గాల మాట. ఇంతకు పూర్వం ప్రభుత్వాధికారంలో ఉన్న నాయకులీ విషయా లంతగా పట్టించుకోలేదు. నిజానికి వీరిలో చాలామంది కేవలం ఉపన్యాసాలలో మాత్రమే తమ సారస్వతాభిమానం ప్రకటిస్తూంటారు. వీరిలో సరియైన సాంప్రదాయిక విజ్ఞానము, సంస్కృతి తగినంతగా లేకపోవడమే దీనికి కారణం కావచ్చును.

నేటి పరిస్థితిలో ఆంధ్రదేశంలో సుస్థిరమైన ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడే అవకాశం కనిపిస్తున్నది. ఇకముందునించైనా ఆంధ్రప్రభుత్వం ఈ విషయంలో తగినంత శ్రద్ధ వహించగలదని ఆశిద్దాము.

ఇటీవల జరిగిన సాహిత్యవేదిక చర్చలలో కొందరు మన సారస్వతాభివృద్ధికి కొన్ని ముఖ్యమైన సూచనలు చేశారు. మన ప్రాచీన సారస్వతం ప్రభుత్వమే ప్రచురించి ప్రజల కందుబాటు తీసుకురావాలని ఒక రచయిత సూచించారు. ఇది ప్రభుత్వానికి సులభంగా ఆచరణ సాధ్యమైన సూచన. సహకార గ్రంథ ప్రచురణ సంస్థ ఏర్పాటు చెయ్యాలనికూడా ఇంకొక సూచన వచ్చింది. ఇదికూడా బాగా సులభసాధ్యమైనదే.

గడిచిన పది ఏళ్ళలోను ఆంధ్రదేశంలో ప్రముఖమైన సాహిత్య సంఘాలన్నీ. నేటికి నామమాత్రంగా మిగిలి ఉన్నాయి ఈ పరిస్థితిలో రాష్ట్రాని కంతటికీ ప్రాతినిధ్యం వహించగల సాహిత్య సంస్థ ఏర్పాటుచేసి అది సక్రమమైన పద్ధతుల్లో నడిపించవలసిన అవశ్యకత ఎంతైనా ఉన్నది. రచయితలతోబాటు ప్రభుత్వము, ప్రజలుకూడా సహకరిస్తేతప్ప పై సూచనలేవీ ఆచరణలోకి వచ్చే అవకాశం కనిపించడం లేదు.

ఇటీవల కాలంలో ప్రభుత్వము, ప్రజలు అంతగా సహకరించినా సహరించకపోయినా రచయితలే కొంతవరకు తమ రచనలకు దోహదాలు కల్పించుకున్నారు. మన పత్రికలు చాలావరకు వీరి కృషికి సహాయంచేశాయి.

కాని ఇంతమాత్రం చాలదు. సంపన్నులలో తిరిగీ సాంప్రదాయికమైన సాహిత్యాభిమానము, భాషాభిమానము రేకెత్తాలి. ప్రజలలో రాజకీయాభినివేశాలతోబాటు స్వరాష్ట్రాభిమానము, భాషాసారస్వతాభిమానాలు అభివృద్ధిపొందాలి. ముఖ్యంగా ప్రజాస్వామ్యపరిరక్షణభారంవహించనున్న మన ప్రజాప్రభుత్వంమీద నిలిచిన బాధ్యత వీటి అన్నింటికన్నా గురుతరమైనది.

పై వారందరు విజయగర్వంతో విర్రవీగకుండా తమ బాధ్యతలు నిర్వర్తించగలరనీ, తద్వారా మనసారస్వతం దినదినాభివృద్ధి పొందగలదనీ రచయితల రచనాలక్ష్యం క్రమక్రమంగా ఆచరణరూపం ధరించగలదనీ ఆశిస్తున్నాను.



# శుక్రనీతి

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

౧

ఇతఁడొక భూసురుండనుచు నెంతువొ యేమొ? ప్రమాదముండు; శ్రీ
హితమునుగోరి పల్కెద మహీశ్వర! విష్ణువె వీఁడు దేవతా
తతికిని మేలుసేయుటె విధాయక కృత్యమటంచు నెంచు ని
ష్కృత మదిఁ జక్కఁగా నెఱుఁగఁగావలె దానముసేయ మానవలెన్.

౨

సురవిహితంబు పొంచె దితి సూనులఁ జంపనగోరు—దేవతా
వరుస యవస్థఁజూచి వినిపాతితులైన సురాళిఁగాంచి యు
ద్ధర నతఁడే జనించెను ముదంబునఁ గశ్యపనందనుండుగా;
నరయుము లెస్సగా మఱియు నాతని కిచ్చుట సర్వనాశమే.

౩

ఎఱుఁగక యిత్తునంటివి మహీశ్వర! వాఁడొక బ్రాహ్మణుండుగాఁ
జెఱచెరవచ్చి కృత్రిమపుఁ జేష్టలచే భవదీయ రాజ్య సుం
దరిఁ జెఱఁబట్టఁగాఁ దొడఁగె దానవనాథ! త్వదీయ జాతి కా
దరమును జూపుదేని నిఁక దానము గీనము మానుటొప్పగున్.

౪

మాటకు మూఁడు పాదములు మాత్రము చాలునటంచుఁ గోరె; నీ
యాటలు సాగనేరవు—దయానిధి వంచును నిన్నెఱింగి పో
రాటము మాటలేకయె పరాక్రమవంతుని నిన్నుఁబట్టి యి
ప్పాట జయింపవచ్చె; రశుభంబని దీని గణింపవో ప్రభూ!

౫

తొలుత భవద్ధితంబు గనుధోరణి నల్పముకోరె నాతఁ డా
వల జగమెల్ల నిండి యొక పాదము పెట్టెడిచోటు సర్వ భూ
వలయమునందు లేదనెడి వైఖరి తెచ్చి పరాభవింపఁగాఁ
దలఁచియు వచ్చె నింతకు వృథా శ్రమమందెదవయ్య పిమ్మటన్.

---

* [వదాన్యుఁడు బలీంద్రునితో శుక్రుఁడన్న మాటలు]

౬

అలఁతి యలంతి కోర్కి యని యట్టె యుపేక్షవహించి దాని సు
ఫలితము పొందఁబోకుము - శుభంబని దానము సేయఁబూని చూ
వల మొదలంట రూపఱుట భావ్యమె? తన్నుఁ దిరస్కరించువాఁ
డిలఁ గలఁడే మహాత్మ! యిది యిట్లని నేను వచింప న్యాయమా?

౭

గొనకొని యిత్తునంచనియుఁ గోరికి తీర్పనినాఁడు నారకం
బెనయును దానిఁ ద్రోవఁ దరమే భువి నీకును? గాన మానుమో
యనఘ! ప్రయత్నమిట్టి—దనయంబును జూపిన వ్యక్తి మానసం
బును దనియింపఁ జేయఁగల బుద్ధియు నీ కది యేల? చెప్పుమా!

౮

దానము యోగముం దపము ధర్మము కర్మము విత్తవంతుఁడై
మానవుఁ డాచరించును జుమా! యది మాని నిరర్థకంబుగాఁ
బ్రాణము సైత మీయఁగఁ బ్రయత్నము సేయుట నీకె చెల్లె; నే
డేనియు వీనికిచ్చి యిపు డెట్టులొ యోడను సాగనెట్టుమా!

౯

తనకు సమూల నాశనము తప్పని దుర్దశ పట్టునేని నె
వ్వనికినిగాని మాట యొకపాటున నుండనురాదు—వాఁడు చె
ప్పిన దొకమాట చేసినది వేఱని వంకలు పెట్టరాదు శా
సనముగఁ జెప్పి చూపినవి శాస్త్రములే యిటువంటి ధర్మముల్.

౧౦

మఱియొకమాట—దానము సుమా! యనృతంబును బల్కరానటుం
డురు గద! యందువేమొ—యిట దోసము కల్గదు నీదు ప్రాణమున్
దఱిగెడి ఘట్ట మియ్యది వృథా శ్రమమేలొకొ! దానమీయఁ ద
త్తఱ పడెదేల? నామనవి దానవనాథ! వినంగ వేఁడెదన్.

౧౧

కులమును రాజ్యమున్ నిలిపి కూళలు వన్నిన వ్యూహమెల్ల ని
శ్చలమతి భంగపుచ్చి నిజశౌర్యము ధైర్యము దానధర్మముల్
వలసినచోటఁ జూపి బలవంతులలోఁ బ్రథితుండవై ధరా
తలమునఁ బేరుమోయుము ముదంబును బొందెదరయ్య యిందఱున్.

౧౨

అని హిత ముగ్గడించు సచివాగ్రణి శుక్రునిఁ జూచి దానవుం
డనియెను లెస్స పల్కెదు మహాత్మ! భవద్ధితమైన ధర్మమున్
గొనుటయె నాకు సంతసముఁ గూర్చునుగాని పరీక్ష సేయఁగా
మనసున కిందు మాత్ర మనుమానము తోఁచె క్షమింపుమా ననున్!

---

**కథానిక:**

# సంప్రదాయం

శ్రీ కొనకళ్ల వెంకటరత్నం

అనుకోలేదు నారాయణబాబు. అప్పుడే భోంచేసి కొంచెం నస్యం సేవిస్తూ నడవలో అటూ ఇటూ వో గడియ తచ్చాడి పొద్దున ఒక పెట్టెతాళంచెవులు సవరించుకునేసరికి ఆవలింత లొచ్చాయి. వాకిట్లో జట్కా ఆగిన అలికిడి గమనించ లేదాయన. బెడ్డింగు లోపలకొస్తోంది. కమలకి కాలేజీ సెలవలని తెలుసునుగాని, ముందస్తుగా వుత్తరం వ్రాయకుండా వొచ్చే అలవాటు లేదే అన్న దిలాసాలో వుండిపోయాడు. అమ్మాయి జట్కా దిగి "గుడ్-బై" చెబుతోం దప్పుడే ఎవరితోనో.

"రేపు లైబ్రరీనించి 'షా' తెచ్చిపెడతారుగదూ?" అంటోంది. — పరకాయించి చూచాడు. సన్నటి క్రాపూ, పొందూరు ఖద్దరులాల్చీ, చిన్న రిస్టువాచీ అతిసింపిల్ గా ఉన్నాడు. ఎరిగిన మొహమల్లేఉంది—ఎవరా, అని గుమ్మంలో విలబడిచూస్తూ నిల్చుండిపోయాడు, నారాయణబాబు. — కమల లోపలకొస్తోంది. ముత్తవతల్లి ఎదురొచ్చి "ఎంత చిక్కిపోయావే బుచ్చితల్లీ" అంటూ తల నిమిరింది. సూట్ కేసూ, హోల్డాలూ హ్యాండ్ బాగ్గూ బెంచీ మీద సర్దించి మొకమల్ స్లిప్పర్లు విడుస్తూ "ఎప్పుడొచ్చినా బామ్మ చిక్కిపోయావంటుం దెవిటినాన్నా" అని కిలకిలా నవ్వింది కమల.

నారాయణబాబు అడుగుదామా వొద్దా అని పస్తాయిస్తున్నాడు. కాని టెన్నిస్ రాకెట్ చేతికందిస్తూ కమల తనకుతానే చెప్పింది.

"ఆయనెవ్వరుగుదువానాన్నా—భాస్కరరావు—చంద్రంగారబ్బాయిట—మనవూరేట నాన్నా..."

"సరిసరి చంద్రశేఖరంగారిఅబ్బాయా? అవునవును—అతనూ మీ కాలేజీలోనేగా చదువుతుంటా"

గుర్తుకొచ్చింది నారాయణబాబుకి. కాని ఇది పరిచయమా? స్నేహమా? ఎన్నాళ్ళనించీ అన్న మీమాంస తెక్కుండా వొచ్చిం దతనికి. "నాకూ తెలియదునాన్నా—ఇవ్వాళ ట్రెయిన్లో ఫస్ట్, సెకండ్, క్లాసులలో సరేసరి బెర్తులు ఖాళీ లేనేలేవు. ఇన్టర్ లో కూడా చెప్తే 'రష్'గా ఉంటేనూ చాలా సాయపడ్డారు పాపం. 'ఇంటిదగ్గర దిగవిడిచి వెడతాను' అంటే కాదవలేకపోయాను. వాళ్లయింటికి మన మేడమీదుగానే వెళ్ళాలిగదా ఒకేజట్కాలో వచ్చేంనాన్నా" అని ఒక్కబిగిని, ముందస్తుగానే వల్లించి కంఠస్తం చేసినపాఠమేదో వొప్పగిస్తున్నట్టు, అడగనిపంజాయిషీ అప్రయత్నంగా ఇచ్చేసింది కమల.

"చిన్నప్పుడుచూశానితన్ని—జులపాలూ, ముచ్చటముడీ—గలీజుగా వుండేవాడు. ఇప్పుడు నేవళం తేరాడు—నాజూ కమిరింది—చక్కా పుష్టిగా—బొద్దుగా—"తక్కింది తల పంకింపుతో పూర్తిచేసి ముసిముసిగా నవ్వుకున్నాడు నారాయణబాబు.

బావుంది వరస! కమల సిగ్గుపడింది.

మర్నాడు వుదయం కాఫీ గట్రా సేవించి డబ్బులు చెల్లించేందుకు భాస్కరం పర్సు తడుముకొంటోవుంటే 'కౌంటరు' దగ్గర నారాయణబాబు అవుపించాడు.

భాస్కరరావు నిర్ఘాంతపోయాడు. అతని కర్థమయింది. కమల భవాని కేఫ్ ప్రొప్రయిటరు కూతురన్నమాట—నిన్నంతా ట్రెయినులో అంతసేపు ఇష్టాగోష్ఠిలోవున్నా కమల ఎవరో తెల్సుకుందామనే ఆత్రమే లేకపోయింది. అసలా అమ్మాయి ఏమి చెబుతోందో వినాలనే తోచలేదు తనకి. ఎంత ముద్దుగా, ఎంత అందంగా, ఎంత శృంగారంగా మాట్లాడుతోందో, పలికే పలుకులో ఆ అమ్మాయి చిరునవ్వు తళుకెంత కలిసిపోతోందో ఆరాలు చూచుకోవడంతోనే సరిపోయె. మొత్తంమీద కమల మంచి రూపసి! ఆమెని చూచిన దగ్గరనించీ ఆమె లావణ్యం అతని రక్తాన్ని గిలకొడుతూనే వుంది.

రాత్రి డాబామీద వెన్నెట్లో వొంటరిగా పడుకుని నెమరుకి తెచ్చుకుంటున్నాడు. కృష్ణకాలవలో తెప్ప గలగల వినిపిస్తోంది. కమల మాట్లాడుతోంటే సరిగ్గా అల్లాంటి గలగలలే మోగినట్టు గుర్తు—ఆకాశంమీద మబ్బులు పింజెలు పింజెలుగా గంభీరంగా నడుస్తున్నాయి. స్త్రీ 'గజగమన', 'హంసయాన' అన్నారు గాని కవులు, కమల నడిస్తే మబ్బులు గంభీరంగా ప్రయాణం చేసినట్టుంటుంది—పరిమళమేదో ముందుకి ప్రవాహంగా సాగినట్టుంటుంది—ఒకటే ధ్యాస—ఆమెలో ఏదో ఒక వింత ఆకర్షణ అతన్ని గజిబిజి చేస్తోంది....ఖండితంగా మాట్లాడుతుంది. మాటలలో వెకిలితనం లేదు. నిర్భయంగా నిర్మలంగా చూస్తుంది. చూపులలో దొంగతనపు జీరయినా వుండదు. ఎంతో సహజంగా సిగ్గుపడుతుంది. ఆ సిగ్గులో నేరం కనిపించదు—సరిపోయింది—తెల్లవారేటట్టుంది. వెన్నెట్లో చలి వేస్తుందేమోనని శాలువా తెచ్చుకున్నాడు పైకి—ఉక్కపోస్తోంది ఎదురు. అనుకొన్న టయిముకి "షా" నాటకాల సీరీస్ లో మొదటి వాల్యూము లైబ్రరీనించీ తీసికొని చక్కా వెళ్ళాడు. కమల కిద్దామని, మొదటి వాల్యూమయింతరువాత రెండో వాల్యూ మెట్లాగూ అడుగుతుంది. తరవాత సరే మూడూ, నాలుగూ...ఒకసారి అనుకున్నదల్లా మూడుసార్లు, నాలుగుసార్లు కమలను కలుసుకొనే అవకాశాలు ఒకదాని తరవాత ఒకటి గొలుసుకట్టుగా లభించే వీలూ పాలూ అంతా స్టడీ చేసుకొనే బయలుదేరాడు. తీరా మెట్లెక్కుతుంటే నారాయణబాబు చిరునవ్వుతో ఆహ్వానించాడు—సరిపోయింది—ఈయ నింకా కేఫ్ కి వెళ్ళ లే

లేదన్నమాట—పక్కని రిసెప్షన్ రూములో కూచున్నారిద్దరూను. అటూ, యిటూ, సోఫాలు, మధ్య మేజామీద 'చైనావేస్'లో గులాబీ రెమ్మ, 'బుక్ షెల్ఫు'లో లైనుగా అమర్చిన పుస్తకాలూ, గట్రా...బావుంది—చక్కని సీటుగా...స్ప్రింగ్ కుషన్‌లో కూచుని సీలింగ్ వంక చూస్తున్నాడు భాస్కరం. నారాయణబాబు కాలేజీ వ్యవహారాలేవో భోగట్టాలు అడుగుతున్నాడు. బోసిగా, క్లుప్తంగా, సమాధానాలు చెప్పుకొంటూ పోతున్నాడు భాస్కరం.

మళ్ళీ అందులో తను శాఖా చంక్రమణాలూ గట్రా చేస్తే సంభాషణకి చిలవలూ, పలవలూ, మొలిచి ఇహ తెమలదేమోనని భయం. అసలు తను అంత పెందరాళే రావడమేమిటి? గడియారంతో పందెం వేసికొని పరిగెత్తుకొచ్చినట్టుంది. ఇంకా ఏడు కాలేదు. ఎంతో ఎండెక్కిపోయినట్టనిపించింది.

"ఈ పుస్తకమేనా మా అమ్మాయి కావాలంట?"

అని చేతిలోవున్న పుస్తకం చటుక్కున తీసికొన్నాడు నారాయణబాబు—కొంప మునిగింది! అంత ప్రమాద మొస్తుం దనుకోలేదు భాస్కరం.

తీరా పుస్తకం ఆయన చేతికిచ్చింతరవాత ఆయ నెట్లాగూ కమల కిస్తాడుగా—తా నింకా వుంటం దేనికని? ఏ వంక పెట్టుకొని చక్కావచ్చాడో ఆ వంక కాస్తా వూడి చక్కాపోయింది. లేచాడు. "పుస్తకం కమల కిచ్చెయ్యండి" అని చెప్పి ఏదో అర్జంటు పనివున్నట్టు వెళ్ళి పోబోతున్నాడు కొంచెం మొరటుతనంగా. ఆపినా ఆగలేదు—నారాయణబాబు యథాలాభంగా పుస్తకంలో పేజీ లటూ యిటూ తిరగేశాడు. మొదటి పేజీలోనే నీలైన బ్లూ లెనిన్ పేపర్ మీద ఒక చిన్న వుత్తరం భద్రంగా మడిచి పెట్టివుంది. ఉత్తరం కమల పేరనే వ్రాసివుంది. అతని మొహం జేవురించింది—కొసాకూ చదివాడు—కొంచెం శాంతించాడు. మరి జాలాయిరకంగా లేదు. ఉత్తరంలో బాధ్యతతో కూడుకున్న ప్రణయతత్వం అంతో యింతో గోచరించిం దతనికి. ఏమనుకొన్నాడో, వుత్తరం ఏ పేజీలో వున్నదా పేజీలో ఎట్లావున్న దట్లా జాగ్రత్తగా వుంచేసి కమలకిచ్చి వెళ్ళిపోయాడు.

చెల్లాయి కూరాముచేస్తే తీసుకుని సినిమాకి వెళ్ళాడు భాస్కరం. తలవని తలంపుగా కమలా వచ్చింది సినిమాకి. ఇద్దరూ ఒకళ్ళనొకళ్ళు చూచుకొన్నారు. ఫలితం అవ్వాళ ఇద్దరూ సరిగ్గా సినిమా చూడలేదు. చెల్లాయి కటు కమలా ఇటు తనూ కూచున్నారు. రిజర్వులో—సినిమా ఆఖరు రీలు మొదలయింది—లైట్లన్నీ ఆరిపోయినై—సోడావాళ్ళ కేకలు సద్దుకొన్నాయి. కమల చల్లని కంఠస్వరం చెల్లాయి తలమీదనించీ చెవిలోపడింది భాస్కరానికి. "పుస్తకాలలో వుత్తరాలు పెట్టకండి తప్పు" అన్నది కమల. భాస్కరం వులిక్కిపడ్డాడు. చీకట్లో ఆమె కళ్ళు కొంటెగా మిలమిలలాడాయి. "అల్లరి పెట్టాలని వుద్దేశ్యం నాకు లేదు స్మీ" అని వూదేడు. "అయితే మా నాన్నగారితో మాట్లాడండి—సరేనా?

"నీ విష్టపడితేనే"

"మాట్లాడండి—తప్పదుగా"

గప్పున లైట్లు వెలిగాయి. చెల్లాయి చెయ్యిపట్టుకొని భాస్కరం లేచాడు. చీకట్లో ఎవళ్ళ తోవని వాళ్లు పోతున్నారు. చుక్కలు చక్కలిగింత పెట్టా యిద్దరినీ.

సెలవలలో బద్ధకమెక్కువ. మధ్యాహ్నం వో నిదరతీసి లేచి మొహం కడుక్కొని టీకని ఫర్మాయిష్ ఇచ్చిపంపి తలగడామీద మోచెయ్యి ఆనించి చిన్నకథల పెద్దపుస్తకం చివర పేజీ ఆవలిస్తూ తిరగేస్తున్నాడు భాస్కరం. "కులాసాగా వున్నారా?" అని పలకరించాడు నారాయణబాబు. భాస్కరరావు కలవరపడ్డాడు. వుత్తర మాయన కంటబడిందా కొంపదీసి? కంప్లెయింటు చేదామని వచ్చేడా? ఇంతా చేసి చంద్రంగారికోసం వచ్చాడేమో తన ఖంగారే కాని, "చంద్రంగారు కోర్టు పనిమీద వెళ్ళారు కూచోండ"ని పడకకుర్చీ చూపించి ఇష్టాగోష్ఠిలో ఆయన్ని మరిపించట మెట్లాగా అని మథనపడుతున్నాడు భాస్కరం.

"నువ్వు మా అమ్మాయికి వ్రాసిన ఉత్తరం చదివానోయ్ భాస్కరం" అన్నాడాయన హఠాత్తుగా. భాస్కరానికి గుండె ఆగింది. సంజాయిషీ అడుగుతాడా? ఏమి చెప్పాలి? కళ్ళ యెదట స్టూలుమీద స్పష్టంగా అవుపిస్తూవుంటే ఎక్కడో పడిపోయిం దనుకొన్న పెన్సిలుకోసం రగ్గు మడతలలోనూ తలగడా కుచ్చిళ్లలోనూ చకచకా వెతికేస్తూ వినిపించుకోనట్టు నటిస్తున్నాడు భాస్కరం.

"కాని నువ్వు సీరియస్‌గానే వ్రాశా వనుకుంటున్నాను నేను" తీక్ష్ణంగా చూశాడు నారాయణబాబు.

"నాకు మరో ఉద్దేశ్యం లేదండి" ఏదో అనేస్తే సద్దుకుపోక పోతుందా అని తాపత్రయపడుతున్నాడు భాస్కరం.

"నువ్వూ చదువుకున్నవాడవు. బాధ్యత ఎరిగున్నవాడవు. అంచాత ఏదో అల్లరిచిల్లరగా కాకుండా సక్రమమైన వాంఛనే వెల్లడించావనీ, నీకు మరొక దురుద్దేశ్యం లేదనే నాకూ అనిపించింది. చెప్పొద్దూ—అదే నీముఖతా తేల్చుకుందామని వచ్చాను. నే నెంతవరకు సరిగ్గా వూహించగల్గిందీ నువ్వే చెప్పాలి" అని వాలేశాడు నారాయణబాబు.

అమ్మయ్య! కొండంత బరువు దించేసినట్టయింది భాస్కరరావుకి. అతని కర్థమయింది.

"ఆ ప్రస్తావన ఎట్లాగూ వచ్చింది గనుక స్పష్టంగా చెప్పేస్తున్నాను. నాకు నిజంగా కమలని వివాహం చేసికోవాలనే వున్నదండి" అని తల వంచుకొన్నాడు భాస్కరం.

"నీ కిష్టమే కావచ్చు—కాని మా........"

"నా కిష్టమయింతరవాత ఒకళ్ళ ఇష్టానిష్టాలతో నాకు పని లేదు."

అతని నిర్లక్ష్యాన్ని గుర్తుపెట్టుకొంటున్నాడు నారాయణబాబు.

"నీకు లెక్క లేకపోవచ్చు, కాని......

"కట్నాలతోటీ కానుకలతోటీ నాకు ప్రసక్తి లేదు."

"అవన్నీ నాకు వొదిలేసెయ్—మీ నాన్నగారితో నేను సంప్రదిస్తాగా!—చూశావ్రా భాస్కరం—కమల నాకు ఏకైక సంతానం నీకు తెలుసునో లేదో—అది తల్లిలేని పిల్ల—దానిని కంటికి రెప్పలా ఎంత అల్లారుముద్దుగా పోషించుకుంటూవచ్చానో భగవంతుడికే తెలుసు. దానిని ఒక అయ్య చేతిలో పెట్టేముందు అభిమానంగా చూచుకునే అత్తమామలూ ఆడబిడ్డలూ ఆదరణ చూపే బంధుకోటీ కావలసిన అగత్యం నాకు సహజంగా వుంటుంది. నీనించీ అభ్యంతరాలు లేవని అనిపించుకోవాలని మాత్రమే నీదగ్గర కొచ్చాను."

"నా కిష్టమే?"

నారాయణబాబు వెళ్ళిపోయాడు.

పర్యవసానం ఇంత సులువుగా ఇంత తృప్తికరంగా పైన లయిపోతుందని భాస్కరరా వనుకోలేదు. అతనికి నిజంగా ఆనందం పుక్కిలింతలయింది. కాని ఇలా వొస్తుం దనుకోలేదు—ఉత్తరాలూ, పత్తరాలూ, ప్రత్యుత్తరాలూ, సంకేతాలూ, సమావేశాలూ, నిరీక్షణలూ, నిర్వేదనలూ, ఒక టేమిటి ఎడతెగని ప్రేమ లేఖల పరంపర! అతను వూహించుకొన్న శృంగార చిత్రమంతా మధ్య మజిలీలన్నీ దాటేసి ఖచ్చితమైన 'బిజినెస్' లోకి దిగి చక్కా వూరుకుంది. సరిపెట్టుకోక చేసేదేముంది? కాని అతనికి జంకు లేకపోలేదు. ఆలోచనకి అవకాశ మివ్వకుండా వొచ్చాడు నారాయణబాబు ఏదో గండం తప్పుతుంది గదా అని పెళ్ళాడతానని ఫెడీమని అనేశాడా?...ఎట్లాగూ కమల కొంచెం పెరుసు—చదువుకొన్న పిల్లని పెళ్ళిచేసుకోవాలనే వుంటుంది కాని పెనిమిటంటే దైవసమానంగా చూచుకోవడమూ భర్తమాట వేదాక్షరంగా పాలించటమూ ఇత్యాది సుగుణాలమీద మమత్వం అతని ఎముకలలో జీర్ణించిపోయివుంది. అతని నిర్ణయం సందేహ తరంగాలమీద కొంచెంసేపు అటూ యిటూ వూగిసలాడి ఆఖరికి వొడ్డున చతికిలబడింది—చట్—చదువూ సంధ్యాలేని ఒక మొద్దు చేత చాకిరీ చేయించుకోటంకంటె కమలలాంటి సౌందర్యవతితో విజ్ఞానవతితో కలహించినా ఆహ్లాదకరంగా వుంటుంది అనిపించింది భాస్కరరావుకి. ఇక మనస్సుని ఆ తర్కం పొంతకి పోనివ్వ దల్చుకోలేదు. పైగా కొనులలో మంచి చేతుల్లో పెడతారు పిల్లని.

పెళ్ళిచూపులయినాయి—కట్నాలూ లాంఛనాలూ వారడిగినంతా, వీరిచ్చినంతా—ప్రధానమయింది కోడలు వజ్రపు తునకలా వుంటుందని మురిసిపోయింది భాస్కరం తల్లి. "మీ యింటికి వెలుగొస్తుందోయ్" అని చంద్రంగారి భావమరిది పరిహాసం చేశాడు. కమల పరీక్షా ఫలితాలకి ఎదురుచూట్టం మానుకుంది.

కమల నాయనమ్మకి పట్టశక్యం కాకుండావుంది. అమ్మలక్కలతో అవేప్రసంగ మామెకు.

రాత్రి వంటయిల్లుకడిగి పాలలో తోడుచుక్క వేసి వెళ్ళిపోతోంది చంద్రశేఖరంగారివంటలక్క సుభద్రమ్మ. వకాలంలో పెళ్ళిపనులు ప్రారంభించాలనీ, పప్పులువెయ్యటానికీ, కారాలు కొట్టడానికీ పనిమనుషుల్ని చూడాలనీ చెబుతున్నారు చంద్రంగారు. వెడుతూవున్నదిఆగి "అమ్మాయికి మా అన్నయ్యగారి సమంధం రైటయిం దనుకున్నారు. నిజమేనాండి బాబూ!" అని నిలబడిపోయింది సుభద్రమ్మ. ఆ ప్రశ్న తప్పించి—"నమ్మకమైన వాళ్లనిచూడాలి—పనులు చురుగ్గాసాగాలి—ముహూర్తం బహుశా ఫాల్గునంలోనే వస్తుంది" అని పైకిచూచి డాబా మెట్లెక్కిపోతున్నారు చంద్రంగారు. భాస్కరానికి కింకా నిదరపట్టలేదు. తుని కవటాకులు నములుతో, సగమయిన విల్స్ సిగరెట్టు పారెయ్యలేక వీధి అరుగుమీద కొంచెంసేపు విశ్రాంతిగా కూచున్నాడు. సుభద్రమ్మ లాంతరు స్తంభందాకా వెళ్ళిపోయింది. వెనక్కి పిలిచాడు. వొచ్చింది.

"మీ అన్నయ్యగారిసమంధమంటా వేమిటే?" బానీ పెట్టు మీదవున్నవాడల్లా గొంతుకూర్చుని రహస్యంగా అడుగుతున్నాడు భాస్కరం—ఏదో అనుమానం సాలీడు బూజులా పట్టుకుందతన్ని.

"నారాయణబాబూ మేమూ పెత్తండ్రి పింతండ్రి బిడ్డలం కదండీ" అన్నది.

"అంటే మీ తండ్రులిద్దరూ సయానా అన్నదమ్ములన్నమాటేనా?"

"సయానా"

"విన లేదే" అంటూ కూచుండిపోయాడు భాస్కరం.

"ఎందుకు వింటారు బాబూ—చెప్పుకుంటే మాకు ప్రతిష్టా అతనికి ప్రతిష్టా—మాకూ అయిశ్వర్యముంటే మేమూ చెప్పుకోందుము—అతనూ చెప్పుకునేవాడు."

సుభద్రమ్మ వెళ్ళిపోయింది. భాస్కరరావు ఆలోచనలో పడ్డాడు. ఇదెక్కడి సంప్రదాయం? ఆవ్వేళ సరిగ్గా నిద్దరపట్టలే దతనికి.

మర్నాడు పార్కులో స్నేహితుల మధ్య ఆ ప్రస్తావన వచ్చింది. అంతా సరిగ్గానే మాట్లాడారు నిజానికి. కాని ఒకళ్లిద్దరు మాత్రం ఏదో సూటీపోటీగా అంటున్నా రనుకుని, లేని అర్థాలు కల్పించుకుని బాధపడుతున్నాడు భాస్కరం—అందులోనూ శంకరానికి ఎంత తోస్తే అంత. "జమీందారు బాలంగారి మేనల్లుడికి, దొరక్క దొరక్క చివరికి వంటపూటి సమంధం దొరికిందన్నమాట." అన్నాడు ఫెడీమనివాడు. అని వూరుకోక "డబ్బురా నాయనా, డబ్బు, డబ్బు" అంటూ న్యూస్ టయిమయిందని మునిసిపల్ లౌడ్‌స్పీకర్లవంక తొరతొరగా వెళ్ళిపోయాడు. భాస్కరరావు తల వంచుకుని కుండీలో నూరు వరహాల చెట్టు తుంచుతున్నాడు. స్నేహితులు సంభాషణ మార్చారు.

రెండు రోజులదాకా భాస్కరరావు ఎక్కడికీ వెళ్ళలేదు. సాయంత్రం జనం మసలనిచోట, లాకుల కెగువని, తమ్మిలేటిగట్టున చల్లగాలి సేవించి చీకటిపడిం తరవాత ఇంటికొచ్చాడు. ఇంటిదగ్గర గలభాగా వుంది. దక్షిణపు గదిలో ఇనప్పెట్టిదగ్గర కవిలెకట్ట చూస్తున్నారు చంద్రంగారు. చంద్రంగారికి వడ్డీవ్యాపారం. వసారాలో గడిసమ్మందగ్గర నుంచుంది నూకమ్మ. నూకాలు నారాయణబాబుగారింటో పనిమనిషి. నూకమ్మ తన చినతమ్ముడికి జబ్బుగా వుందీ,

రూపాయికి రోజుకి కొంత చొప్పున వడ్డీ నిర్ణయించుకొని, రెండు తులాల రాగిడీ రెండు నెలలకి లోపాయికారిగా తాకట్టుపెట్టి 15 రూపాయలు పట్టుకెళ్లింది చంద్రంగారిదగ్గరనించి. వ్రాత కోతలు లేవు. పత్తిరం వ్రాయాలనంటే రెండు తులాల తాకట్టు చాల దన్నారు చంద్రంగారు. వాయిదా నాటికి సొమ్ము చెల్లించకపోతే మటుకు తాకట్టు వాకట్టని షరతు. యింగ్లీషు లెఖ్ఖప్రకారం రెండు నెలలూ చూచి సూకమ్మ ఎంతకూ రాకపోతే రాగిడీ అమ్మేశానంటాడు చంద్రంగారు. అమావాస్య వెళ్లిన చవితినించీ తెలుగులెఖ్ఖ ప్రకారం రెండునెలలూ అంచనా వేసుకుని రాగిడీ అమ్మిన మన్నాడే వచ్చింది సూకమ్మ, అప్పుతీర్చి వస్తువు తీసికెడదామని. అది ఘర్షణ.

"సూకమ్మా నిన్ను నేనేమీ అన్యాయం చేయలేదు. నీకు తెలియకపోతే ఎవర్నైనా పెద్దమనుషుల్ని అడుగు. వడ్డీ లెఖ్ఖలకి ఇంగ్లీషు మాసాలు చూస్తారుగాని తెలుగు నెలలు బద్ధంపు వేస్తారా ఎక్కడైనా? అందరికీ ఒక లెఖ్ఖా నీకొక లెఖ్ఖా కడతానా! నాకయినా నిజంగా ఫాయిదాతో కలిపి అంచనా వేసుకుంటే వకటీ రెండు రూపాయలు తక్కువే కిట్టాయి. నమ్మి నమ్మకపో. ఆనాడు గంగిగోవులా తలవూపిన కంసాలి వీరభద్రయ్య ఇవాళ బంగారం జబ్బుదనీ మచ్చిబంగారంకన్న నాసిగా వున్నదనీ చప్పరించాడు." అని ప్రశాంతంగా జవాబిస్తున్నాడు చంద్రశేఖరంగారు. సూకమ్మ బుడిబుడి దుఃఖాలు సాగించింది. వస్తువు యింట్లోనే వున్నదని ఆమెకు గట్టి నమ్మకం. కొంచెం సేపటికి పాకం ముదిరింది. ఎవరి కమ్మాడో ఆ ఆసామీనే వెళ్లి ప్రాధేయ పడతాను. ఎవరో చెప్పమని నిగ్గతీసింది. దానికి చంద్రంగారు అతుకి అందకుండా పోకకి పొందకుండా సమాధానాలు చెప్పుకుంటూ పోతున్నాడు. తాకట్టు వాకట్టయింతరవాత ఎవరి కమ్మిందీ ఎంత కమ్మిందీ చెప్పాలిసిన అగత్యం తనకి లేదనీ, తన యిష్టం మెచ్చినవాళ్లకి, ఇష్టమెచ్చినంత కమ్ముకునే హక్కు తనకి వున్నదనీ కచ్చితంగా మాట్లాడుతూ చేతిలోవున్న దస్త్రం నేలకేసి కొట్టాడు చంద్రంగారు. దానితో సూకమ్మ రెచ్చిపోయింది. ఆమైన నిప్పులు గక్కుతో కొప్పుముడి విడిపోతుంటే బారలు చాపుకుంటో శోకాలు పెడుతో వాళ్లెరగని కోపంతో నిర్ధారణ చెయ్యడానికి వీలులేని కంఠస్వరంలో "తినవయ్యా తిను—నా సొమ్మే తినవయ్యా నువ్వు—పదిరూపాయలు చేతిలోపెట్టి రెండు తులాల బంగారం మింగేస్తావటయ్యా నువ్వు—నా వుసురు నీకు తగలకుండా పోతుందాంట? కొంపలో మళ్లీ పెళ్లి పెటాకులూ చేసుకోబోతున్నావాడయ్యెను—పైనించీ లక్షలు కొంపమీదికి వేసుకుంటున్నా ఎంగిలికూటికి ఎగబడతావెందుకయ్యా నువ్వు? నీ యేదాన్ని నేనెన్నిసార్లు ఎంతవడ్డీ పొయ్యలేదు?-నన్నే ఏడిపించాలటయ్యా? నా పొట్టమీదనే కొట్టాలిటయ్యా" అని పొలికేక లేస్తూ వీధినపడింది. వసారాలో ఇందాకా నిశ్శబ్దంగా కూర్చున్న భాస్కరం చర్రున లేచి అటకాయించి "ఆగు భడవా—నీకు అన్యాయం జరిగితే కోర్టులో దావా వేసుకో. అంతేగాని మాటలు మిగిలావంటే లాకప్‌లో పెట్టిస్తాను జాగర్త" అని ధిమాకీ చేశాడు.

కలిగినవాళ్లకి అన్యాయం జరిగితే ఏ కచేరీలోనో ఏ వ్యవహారంలోనో ఎక్కడో వోకచోట నొక్క ప్రతీకారం చేస్తారు. అన్యాయంగాని దానికి ప్రతీకారంగాని జరిగినట్టు రెండో కంటి వాడికైనా తెలియదు. కాని అలగా జనానికి కించిత్తు అక్రమం జరిగిందంటే వాళ్లు ఎట్లాగూ ప్రతీకారం చెయ్యలేరు. కాని వాళ్ళకు చాతనయిందల్లా యాగీ. అది ఎంతమంది నోళ్లల్లో పడితే అంత తృప్తి వాళ్ళకి. అంచాత పనిమనిషికిగాని, చాకీదానికిగాని, బిచ్చగాడికిగాని కష్టం కలిగిందంటే వాడవాడంతా మోగిపోతుందంతే! కాని మోగటం మటుకే!!

రాత్రి భోజనాలప్పుడు మళ్లీ ఆ ప్రస్తావన రాలేదు. భోంచేసి తిరిగా దొడ్లో చామంతి మడిదగ్గర పైరగాలికి మడతమంచా లేసుకుని ఇష్టాగోష్టిలో పడ్డారు తండ్రీ కొడుకు లిద్దరూ—భాస్కరరావు అందుకున్నాడు.

"అయితే నాన్నా కొన్నేళ్ళక్రితం బహదూర్ మామయ్య గారింట్లో వంటపని చేశాడా నారాయణబాబు?" జమిందారు బాలంగారికి రావుబహదూరు బిరుదున్నది. ఆయన్ని బహదూర్ మామయ్య అంటాడు భాస్కరం.

"అక్కడ చేశాడో లేదో నాకు గుర్తులేదుగాని, ఇతర్రత్రా వంటపనులు చేసినవాడే నారాయణబాబు—నీకూ తెలుసుగా—"

"మరి ఈ అయిశ్వర్య మెట్లా పట్టం దతనికి?"

"నారాణబాబు పాపం చిన్నతనంలో చాలా పేదరికం అనుభవించాడు. ఇప్పటి ఆస్తిఅంతా అతని స్వహస్తాలమీద ఆర్జించిందే. వంటపని చేసి చేసి విసిగి ఆమధ్య మద్రాసులోనూ, బెంగుళూరులోనూ తనకింద మనుషుల్ని పెట్టుకుని పెద్ద హోటలు వోపెన్ చేసీ పికిల్ షాపింగు సేర్చగా సాగించీ చాలా ఆర్జించాడని వినికిడి"

"పికిల్ షాపంటే?"

"అప్పట్లో అక్కడవున్న మన ఆంధ్రాస్టూడెంట్సూగట్రా వూరగాయలకి మొహంవాచిపొయ్యేవాళ్లట. వాళ్లకని గోంగూర పచ్చడీ, చింతకాయపచ్చడీ, వూరగాయలూ గట్రా అన్ని బాటిల్స్‌లో ప్యాక్ చేసి పెద్దవ్యాపారం సాగించాడీయన, ఇక్కడ కొచ్చిన పదిహేనేళ్లనించీ హోటలూ, బోర్డింగూ, లాడ్జింగూ తెరిచి డబ్బు చెరలకొద్దీ సంపాయించాడు. షుమారు పదిలక్షలదాకా వుంటుంది. చాలా మంచివాడు పాపం. అతని సత్ప్రవర్తనా, అతంహోదా, అతని దర్జా ఇపుడుచూస్తే ఒకప్పుడితనేనా గరిట పట్టుకుని హీనంగా బ్రతికినవాడనిపిస్తుంది."

"అయితే ఇట్లాంటి నీచమైన సమంధం చూస్తావా నాకు"

"నేనా ఈ సమంధం చూస్తా నీకు?"

భాస్కరానికి వొళ్లు తెలియటంలేదు. అసలీబురదలోకి మొట్టమొదట అడుగుపెడతానే అన్న సంగతి మరిచిపోయాడు.

"నేను తెలిసుండే దిగా వనుకుంటున్నావా?"

"తెలియదని ఎట్లా అనుకోను—ఈవూళ్లోపుట్టి, ఈవూళ్లో పెరిగి మన పొరుగువీధినవున్న ఆసామీ పుట్టుపూర్వోత్తరాలు నీకు

తెలియకుండా కూపస్థమండూకంలావున్నావని కలగన్నావా? పోయి అడుగు మెడకాయమీద తలకాయివున్న వాడికల్లా తెలుసు"

"ఏమిటేమిటి? పోని తెలిసే నే నంగీకరించాననుకో. నువ్వు చెప్పక్కర్లే నాకు? సమంధ మెట్లావున్నా సంప్రదాయం కావాలి కావాలని చొంగలు కారుస్తూ చెప్పేనువ్వు—మంచిసంప్రదాయం గలకుటుంబమైతే చాలు పిల్లని సయితం మాడనక్కర్లేదు—కట్నం చిల్లిగవ్వయినా కాంక్షించను అని రొమ్ము విరుస్తూ ప్రగల్భాలు పలికే నువ్వు—అబ్బాయీ ఇది ఇట్లాంటిసమంధం అని నాతో చెప్పనక్కర్లే?"

"చెప్పలేదు. నా కభ్యంతరంలేదు కాబట్టి"

"నీ కభ్యంతరంలేదూ?" నువ్వు వియ్యమందబోయేవాళ్లు వంటమనుషులయినా అడుక్కుతినేవాళ్లయినా నీకు నిమిత్తం లేదన్నమాట."

"ఆ పని ఇప్పుడు చెయ్యకుండావుంటే చాలు."

భాస్కరానికి రగులుకుంటోంది లోపల. కాని అతనికి తెలుసు చంద్రంగారు హెచ్చితే తగ్గుతాడు—తగ్గితే హెచ్చుతాడు.

"అయితే మొన్న నామధ్య లక్కవరంనించీ వో సమంధం వస్తే వాడి పింతల్లి మేనల్లుడు కొలంనాడు నిడదవోలు పడవల రేవులో జంతికలమ్మాడనీ, వాడి పినతండ్రి కొడుకు గొందులూరు సంతలో కొలగారం చేసేవాడనీ, నెరుసులేరి ఆ సమంధం తిరగ్గొట్టా వెందుకని?"

"వాళ్లకు డబ్బు లేదు కాబట్టి"

"అయితే డబ్బు చూచుకునే నారాయణబాబుగారి సమంధం రైటుచేశావన్నమాట?"

"ఇందులో నేను చూచుకొన్న దేమీ లేదురా అబ్బాయీ—కట్నంకూడా అంతనీ యింతనీ నేను మొరాయించలేదు"

"మాటల కేమిలే—నారాయణబాబుకి కమల వొకర్తే కూతురని తెలియదాయేం నీకు?"

"అది నాకంటే నీకే ఎక్కువ తెలిసివుండాలి మరి."

భాస్కరరావుకి కొరడాతో కొట్టినట్టయింది.

"అయితే అబ్బాయీ—ఈ ప్రశ్నలన్నీ నీకు ఎవరు నూరిపోశారురా?"—అన్నాడు చంద్రంగారు, ఇక సంభాషణ తను నడపాలన్న సంకల్పంతో.

"నువ్వనుకోవడం, మనం నారాయణబాబు డబ్బుకోసం ఎర వేసుకుని కూచున్నామనీ జరిగిన తతంగమంతా దానికోసం పన్నిన పన్నాగమేగా!"

"అందుకు సందేహమా?"

"ఇందులో నారాయణబాబు స్వార్థం ఏకోశానా లేదనే వుద్దేశం—అవునా?"

"ఆయన తప్పేముంది. కమల నేనంటే ఇష్టపడింది అంచేతన్న కదిపాడు—నువ్వు సరే గంగిగోవులా తలవూపేశావు."

"తప్పుకాదురా నాయనా—ఈమాత్రం చదువుకున్న కుర్రాడూ ఈమాత్రం ఆస్తిపాస్తులున్న సమంధమూ నారాయణబాబుగారికి రాకపోలేదు తెలుసునా? అతనూ సంప్రదాయమైన కుటుంబంలో పిల్లని పడెయ్యాలని ఎంత తాపత్రయపడ్డాడో సులభంగా అర్థమవుతుందా? నీ వూహ కందలేదింకా! జమీందారు బాలంగారి మేనల్లుడుగాని అతనికి నచ్చలేదు తెలుసా?"

"అందులో అతని తప్పేముంది? వంటపూట బ్రతుకు బ్రతికినా అతనికి సంప్రదాయంగల కుటుంబంలో, పిల్లని పడెయ్యాలన్న జ్ఞానం వుంది—మనమంటే గడ్డి కరవడానికి సిద్ధమయ్యాం కాని..."

"అక్కడే పొరపడుతున్నావు నాయనా—సాంప్రదాయమైన సమంధాలకోసం పాకులాడవలసిన ప్రారబ్ధం మన కేమిట్రా? ఆ సంప్రదాయం మనకుందిగా?"

"అయితే ఆ ప్రారబ్ధం నారాయణబాబుకి పట్టిందంటావు? మనకేమో డబ్బున్న...."

"మనం వెతుక్కోలేదు. కావాలని డబ్బున్న సమంధాల కోసం వెతుక్కోవడం నీచం. వెతుక్కోకుండా వొళ్ళో వాలినపుడు పెడమొహం పెట్టుక్కూచోవడం తెలివితక్కువ. పైగా ఇందులో తప్పేమిటో నాకు గోచరించడంలేదు. అతనిక్కావలసిన సంప్రదాయం మన దగ్గరుంది. మనక్కావలసిన డబ్బూ దస్కం అతని దగ్గరుంది. ఈ సమంధంతో అది మనకీ, ఇది అతనికీ సంక్రమిస్తుంది. అతని డబ్బుకోసరం మనం పాకులాడుతున్నామనుకునే బదులు మన సంప్రదాయంకోసం అతను పాకులాడుతున్నా డనుకోరాదూ?"

భాస్కరరావు బి. ఏ.లో 'లాజిక్కు' తీసికున్నాడు, కాని తర్కంలో ఈ వింతపోకడ లింకా అతని బుర్రదాకా రాలేదు. అతనికి విసుగ్గావుంది.

"ఏది ఎట్లావుండనీ—సంప్రదాయంలేని కుటుంబమని తెలిసీ కూడా డబ్బుంది కదా అని జొరబట్టం నీచం" అన్నాడు భాస్కరం.

"అట్లాగే డబ్బు అంత లేదుగదా లొంగిరాకపోతాడా అని సంప్రదాయమైన కుటుంబాలలోకి జొరబడాలని చూట్టం పనికుడికీ నీచమే. నువ్వనే నీచం ఉభయత్రావుంది. ఒరే అబ్బాయీ నీకింకా ఈ ప్రపంచంలో విలువలు తెలియవు. డబ్బున్నవాడికి ఇవాళ కాకపోతే రేపొస్తుంది సంప్రదాయం. అయితే ఎవడో వొకడు ఆ ముద్ర వేయడానికి పూనుకోవాలి. ఆ ముద్రాధికారం ప్రథమంలో ఎవడు తీసుకుంటాడో ఎవడు తీసుకుందుకు సాహసిస్తాడో వాడికి ఐశ్వర్యమబ్బుతుంది. అంతే. సంప్రదాయమైన కుటుంబీకుడికి సుళువుగా ఆస్తులు సంక్రమించాలంటే మనం తొక్కే మార్గం—లేకపోతే దేనికి సంప్రదాయం మట్టికొట్టుకోనా?"

"అయితే సత్సంప్రదాయ మల్లా డబ్బుని ఆకర్షించటానికే నంటావు!"

"డబ్బున్నవాడు సంప్రదాయం కొనుక్కుందామని చూట్టంలేదే? అట్లాగే సత్సంప్రదాయమున్న సమంధం దొరకడం సామాన్యమా అని నేను అందరిచెవుల్లోనూ ఇల్లుగట్టుకుని పోరడం లేదనుకున్నావుటే—"

"నీకు సాంప్రదాయ మక్కర్లేదన్నావుగా!"

"నా కక్కర్లేకపోవచ్చు—కాని పలుగుర్లోనూ సాంప్రదాయమంటే వుండాల్సిన విలువ పోషించుకుంటూ రావద్దూ? మన కుంటూ సంప్రదాయమే అయెను."

"పోవుంది—సంప్రదాయానికి వుండాల్సిన విలువ వుండనే వుంది. నువ్వు పనిగట్టుకుని పోషించేదేమిటి? డబ్బులేని వాడేం జుకూ కొరగాడనీ, డబ్బున్నవాడే గొప్పనీ డబ్బు విలువని శ్లాఘిస్తూ మెడలో డప్పువేసుకుని తిరిగాడా నారాయణబాబు?"

"డబ్బు విలువ బ్రతికున్న వాడికల్లా తెలుసు. చెప్పనక్కర్లేదు. తెలిసిందా? కాని సత్సంప్రదాయమంటే, వుండాల్సిన మోజూ, ఇయ్యాలిసిన విలవా ఎప్పటికప్పుడు నలుగురి చెవుల లోనూ గింగురుమని మోగిస్తుంటే తప్ప నిలబడి చావదు."

"ఛ—నాకీ సమంధం అక్కర్లేదు"

అని చివ్వున లేచాడు భాస్కరరావు.

"అక్కర్లేకపోతే మానవోయి నాయినా—అక్కర్లేదనగానే ఊ నాయనగా అని బ్రతిమాలాడతానని గాని అనుకుంటున్నావేమో—నాకవసరం లేదు తెలిసిందా? పిల్ల రత్నంలా వుంటుంది. చదువుకున్నది — నిన్ను ప్రేమించినకన్య — నువ్వు కోరుకున్న అప్సరస. కాళ్ళదగ్గరకొచ్చిన సమంధం—కనకవర్షం కురుస్తుంటే గొడుగేసుకుపోతావా? ఛా—ఇందులో కవిశోచ్చేదమైనా వుంటే అది నాకుమాత్రం కాదన్న సంగతి మరోకసారి జ్ఞాపకం చేస్తున్నా. నాకు తెలుసులే—ఈ చదువుకున్నవాళ్ళకి ఆశయాలనీ, ఆదర్శాలనీ మారని సరుకంతో బుర్రలో మసుల్తోవుంటుంది. చూపులు ఆకాశంమీదపెట్టుకున్నా నడవాలిసింది నేలమీదరా నాయనా! నేలమీద! ఇప్పుడు నిన్ను ఎలాగయినా బలవంతపెట్టి ఈ వివాహానికి దింపుతానేమోనన్న అపాయానికి ఉపాయమేమిటా అనే ఆలోచనలో పడనక్కర్లేదు. నువ్వు ఎదురుకోవాలిసినప్రమాద మేమిటంటే—నాకక్కర్లేదని గాని నువ్వు అనాలోచితంగా నోరు జారితివా నిన్ను కారణాలైనా అడక్కుండా వొదిలేసుకుని కూచోడానికి సర్వసిద్ధంగా ఉన్నాను. తెలిసిందా?" అని ఉపదేశ పూర్వకంగా హెచ్చరించి పక్క సద్దుకున్నాడు చంద్రంగారు.

నారాయణబాబు నాలుగైదురోజులనించీ చంద్రంగారింటికి ఎడతెరిపిలేకుండా వెళ్ళివస్తూవుండడం గమనించింది కమల. ఆవేళ ఆ చెవిగాడుపు ఈచెవికి కొడుతో వుంది. తిరిగితిరిగి యింటికొచ్చాడు నారాయణబాబు. రాగానే హాల్లో మడతకుర్చీలో కూలబడి వృత్తిశయంతో విసురుకుంటున్నాడు. ఏదో అయోమయంగా కూచున్నట్టనిపించింది కమలకి. అతని మనస్సులోపడ్డ అగాధమేదో మొహంమీద కనిపిస్తోంది. గబగబ నాలుగు సీమబాదంపలుకులు మిశాయించి కొంచెం నిమ్మకాయషరబత్తుచేసి అందించింది. పట్టెవేళ్ళ విసనకర్రమీద కూజాలోని చల్లనినీళ్ళు కసింత చిలికి పక్కన నిల బడింది. "పంకావేయి అమ్మా" అన్నాడు నారాయణబాబు. "పంకాగాలి వేడిగా వొస్తోంది నాన్నగారూ" అని వారించింది కమల. కొంచెంసేపు బడలికతీరింతరవాత "ముహూర్త మింకా కుదరలేదా నాన్నా" అని అడిగింది కమల. తన వివాహవిషయంలో తనే కలిపించుకుని అడగటమదే మొదటిసారి ఆమెకు.

"దానికే తడిమున్నూ పొడిమున్నూ అయేలా తిరుగుతున్నా నమ్మా—చంద్రంగారు భాస్కర్రావుని అడగమంటా డేమిటే?"

"ఆయననా? ముహూర్త విషయంలోనా?"

"కాదు—అసలు పెళ్ళివిషయమేట."

"అదేమిటి?" ఆమె కర్థంకాలేదు.

భాస్కరరావు కింకా అభ్యంతరాలున్నయ్యా?

వెండిప్లేటులో పూరీలూ బజ్జీలూ పట్టుకొచ్చి దగ్గర పెట్టింది నాయనమ్మ. పూరి బాగా వేగినవైపు ఒక్క పిసరుతుంచి మునిపంటికొరికి "సయించడం లేదమ్మా—తీసెయ్యి—" అన్నాడు నారాయణబాబు. "అదేమిటి నాయనా—పిదపాడు నుంచీ కర్పూరంలాంటి నెయ్యివచ్చింది—కన్నతల్లి కావాలని సొంతంగా చేసింది. ఇవాళే పోరాటాలు—ఒక్కటి నోట్లోవేసుకో నాయన గాదూ" అని బామ్మ పరసనే వున్న ముక్కాలిపీటమీద కూచుని లాలనచేస్తోంది. ఎంత వయస్సొచ్చినా నారాయణబాబు పసిపాపడే ఆమెకు. "మందంగా వున్నదమ్మా" అని మొహం చిట్లించాడు నారాయణబాబు.

కమల మంచినీళ్ళకని మరచెంబు పుచ్చుకుని

రీడింగు రూమనుకుని, పడకగదిలోకి పరధ్యానంగా వెళ్ళి, టేబిలుమీద వున్న రంగూను పాలరాతి బుద్ధవిగ్రహం చేతికి తగిలి, ఇక్కడెకెందుకొచ్చానా అని నిలబడిపోయింది—ఆమెకు మనస్సు మనస్సులో లేదు.

అనుకున్నట్టే నారాయణబాబు భాస్కర్రావుతో మాట్లాడ డానికని వొచ్చాడు. తండ్రి యింతా తనమీద రుద్దియ్యాలని మాస్తున్నట్టు గ్రహించాడతను. భాస్కరం వొకయెత్తు వెయ్యాలని చూశాడు. తను ఏదో కొంత మొరటుతనంగా మాట్లాడేస్తే అతనికి మండి చర్రుమంటాడు దానితో తనూ తారస్థాయిలో అందుకునేది. ఒక పెద్ద గలాటాకింద దింపేశేది. అంతేగాని అతనితో తాపీగా వాదానికి దిగితే తనకి వొక్కపాయింటూ మిగిలిచావదు. అదీ అతని భయం.

"అయితే భాస్కరరావూ—మీ నాన్నగారు నీ కింకా ఏదో అభ్యంతరాలూ గట్టా..."

"క్షమించండి. నాకు వుండుకున్న అభ్యంతరాలన్నీ మీ తోటి చర్చించదలచుకోలేదు నేను. సమంధం నా కక్కర్లేదని మాత్రమే మీతోటి చెప్పమన్నాను."

"అది సబబైనమాటే—కాదనను—ఎంచేతనంటే నా కక్కర్లేదని నువ్వంత నిష్కర్షగా చెబుతోన్నప్పుడు నీ కారణాలకోసం ఎదురుచూడాల్సిన అవసరం, నాకూ లేనేలేదు. అది మొదట్లో

అయితేనేం—కాని, అప్పుడు, ఇంతదూరం వచ్చిన తరవాత, ఇన్ని తంతులు జరిగిన తరవాత..."

"మించిపోయింది దేమున్నది లెండి."

"నీకు తెలియదు భాస్కరరావు—తాంబూలాలు పుచ్చుకున్న తరవాత, ప్రధానమయిన తరవాత—సంభ్రమం లప్పటిలా వుంటే సమంధం శోధించంటే నీకు మించిపోయిందనిగా శంక్షా వచ్చును—కాని ఆడపిల్లని కన్న తండ్రిని, నాకు కలిగే నష్టాన్ని నువ్వు భర్తీ చెయ్యలేవు. తెలిసిందా? ఈ నేజలో ఎంతో ప్రబ్రదమైన కారణాలు వుంటేనే తప్ప సమంధాలు చెడవు. చెడితే మరి సకుందా లెక్కవు. ప్రధానమయిన తరవాత మగో పెళ్లిమాటలకి దిగడం నూరుమనువుకింద పరిగణిస్తారు మనవాళ్లు. నలుగురూ నాలుగు విధాల చెప్పుకుంటారు—పిల్లకు ముక్కు వంకరో మూతి వంకరో—నడవడి మంచిదవునో కాదో అని శంకించేదాకా వెడతారు. ఇంతదూరం ఎందుకు చెబుతున్నానంటే మీ రిద్దరూ ప్రేమించి పెళ్ళిచేసుకుంటున్నారని కూడా పుకారు పుట్టింది—నీకు తెలుసునో లేదో."

"అయితే సంజాయిషీ ఇమ్మనమంటారా?"

"నే నంతమాట అనను. కాని నీ సందేహం ఒక అపోహ మాత్రమే కావచ్చు. అది ఎంతవరకూ సహేతుకమో పరిశీలించుకోవడానికీ, సాధ్యమైతే నీకు నచ్చచెప్పడానికీ నాకు అవకాశం యివ్వడం సబబు. నిమెడలు విరిచి ఎట్లాగైనా నాపిల్లని నీకు కట్టబెట్టాలని చూసుకునేటంత కక్కుర్తి నాకులేదు. నమ్ముతావా?"

ఎంతకీ వదలడు! సరిగదా చల్లగా వ్యవహారంలోకి దింపుతున్నాడు. తా నింత గరిగమ్మ వాటంగా మాట్లాతూన్నా కోపం రాకండా వొచ్చిందేమిటేయనికి? తనవత్తు సాగేలాలేగ — ఇప్పుడెట్లా? సావకాశంగా ఆలోచించ నేలేదతను. తొణుకూ బెణుకూ లేకుండా ప్రశాంతంగా చెప్పుకొంటుపోతున్నా డంతే. ప్రపంచపు వొడుదుడుకుల్లో నలుగుడుపడి వొళ్లంతా కాయలుగాచి చేవదేరినవాడిలా అవుపిస్తాడు. పథకం మార్చాడు.

"పోనీ క్షమించండి—మీ సంప్రదాయానికి సంబంధించిన కొన్ని అంశాలు నాకు అప్పట్లో తెలియక మాట యిచ్చాను."

"సులువుగా క్షమాపణకోరేసి గతాన్ని తుడిచి పెట్టేశారెయ్యాలని చూడకు. కాని అట్లాంటి ముఖ్యమైనఅంశాలు ముందే తెలుసుకుని వుండాలిసింది నువ్వు—అవునా?"

"అదే—చెబుతున్నా కదండీ—తెలుసుకోవలసింకే! కాని తెలుసుకోలేదు—నాకెవరూ తెలపలేదు. క్షమించండి—సరేనా?"

"సరేసరే—అయితేఏమిటి? నాసాంప్రదాయాన్ని గురించా?"

"అవును"

"అంటే నేను చిన్నప్పుడు వంటమనిషిగా బ్రతికాననేగా? స్పష్టంగా చెప్పు — అందులో తప్పులేదు—ముసుగులో గుద్దులాటెందుకూ? వంటపనంటే అంత నీచమా?

"ఏదో అంతా అట్లా అనుకుంటారుకదండీ"

"అంతా అట్లా అనుకుంటే నువ్వూ అనుకోవాలా? అంతా కలిసి ఏ విషయం తప్పనుకుంటారు? నువ్వు తప్పులేదని చాటిస్తావంటేనా?—అంతా అడుక్కుతినే ఒకపని చూడమంటారు — నువ్వుచదివించాలని పట్టుబడతావా కానీ? చదువుకున్న ఫలిత మిదా? అంతా అనుకొంటూవుంటే నువ్వూ కొట్టుకుంటున్నావా? స్వతంత్రంగా ఆలోచించి మాట్లాడాలికదా. ఆలోచించుకోగల శక్తి నీకు వున్నదా లేదా?"

"అంతా అనుకోవడమే కాదండి—నాకూ అట్లాగే అనిపించింది చెప్పాను—ఏమీ అనుకోకుండా వుంటే ఇంకా స్పష్టంగా చెబుతా మరి, ఏమిటి చేసేది. వంటమనిషి. అంటే ఎట్లాగా ఒకడికింద నౌఖరి కదండీ"

"అయితే మీ నాన్నగారు చిన్నప్పుడు పావుకారు గుమాస్తా చేశాడు. గుమాస్తా గిరి నౌఖరీకాక యాజమాన్య మవుతుందా?"

"గుమాస్తా గిరి అంటే అది వేరు. వంటపని అంటే కూలిపని గాదండీ! మీ కోపమొస్తే చెప్పలేనుగాని..."

"కూలిపని అంటే రెక్కలాడ్చుకునే పని-అనేగాని అర్థం —గుమాస్తా గిరిలో మాత్రం రెక్కల కష్టంలేకండా వున్నదా? కావలసిన వస్తువు తూచడం—అందివ్వడం—లెఖ్ఖవ్రాయడం—సరిపుచ్చడం—సరుకు నిల్వలు చూచుకోవడం అంతా వొళ్లు శ్రమలేనిపనా—చెమట పోడకండా వొళ్ళు మకిలి కాకుండా పంచె నలక్కుండా జరుగుతుందా గుమాస్తాకి! వంటపనిలో మాత్రం తెలివితేట లఖ్ఖర్లేదా! ఎట్లా తంపచేసినా సువాసనగల పోపులూ, కమ్మని వంటకాలూ తయారైపోతియ్యా? గుండిగ పొయ్యెక్కిస్తే చాలు ఫప్పళం దానంతటదే చవులూరి చల్లారుతుందా?

"శ్రమపడాలి—తెలివితేటలూ వుండాలనుకోండి"

"అంగుళంలోనూ ఇందులోనూ కూడా"

పైగా వంటమనిషంటే చాలా చులకనకదండీ—యజమానులు అడ్డమైన మాటలూ అంటారు—హీనంగా చూస్తారు.

"అడ్డమైన మాటలూనా? నన్నవటానికి దమ్ములెవడికీ లేవా నాకు మరి—కనుక్కో—రాచవానివారింట్లో మీ నాన్నగారు గుమాస్తాగా వున్నప్పుడే నేనూ వంటకి కుదిరాను. మీ నాన్నగారి నడుగుపోనీ వా రబద్ధమాడరు. రాత్రి తొమ్మిదిన్నరకి గ్లాస్కోపంచె కట్టుకుని, అమ్మా హాయిరాయిలు రాసుకుని క్రాపున్నగా దువ్వి వేళ్లసందున విల్స్ పొగవొదుల్తూ సినిమా రెండో ఆటకి దలాయిస్తుంటే అపరాత్రివేళ అప్పుడే వొచ్చిన చుట్టపాయనకి బియ్యంపోసి వెళ్లమని ఇంటావిడ ప్రాధేయపడ్డమూ నేను వినిపించుకోకుండా దులుపేస్తుండడమూ, బాగమూరే వారికేనులాంతిరు దగ్గర జడతొగెఖ్ఖ కుదుక పంచపాళీలో ముక్కుతో మూలుగుతో కూచున్న మీ నాన్న వోరకంట కని పెడుతూ నవ్వుకునేవాడు. అసలు నేనంటే ఇంటాయన లగాయతూ, పిల్లా జల్లా సమేతా అందరికీ వొకటే హడలు—దీనికి కారణం నేను పని కరెక్టుగా చేసేవాడి ననుకుంటున్నా వేమో. నెలకు కనీసం పది నాగాలైనా పెట్టేవాడిని. నాగాలైన మర్నాడు హాజరైతే ఏమని అడిగేందు

కెవళ్ళకి ఖలేజా వుండేదికాదు. అందాకా ఎందుకూ, మీ నాన్న గుమాస్తా అన్నమాటేగాని రోజూ కొట్టు తెరిచేముందు కూరా నారా కొని ఇంట్లో పడేసి వెళ్లడం పిల్లలకేమన్నా కొంచెం నలతగా వుంటే ఆసుపత్రికి వెళ్లి అరఖులాగట్టా పట్టుకురావటం వగయిరా ద్యూటీలు వుండేవిలే. తెచ్చిన కూరలో పుచ్చు వంకాయనీ, పండు కాకరనీ, చేదు దోసకాయనీ, కుళ్లు మిరపకాయనీ తీసిపారే స్తుంటే ఇంటాయన మీ నాన్నమీద గుర్రుగా వుండేది. నేను ఏరి పారేస్తున్నానని గాదు. మీ నాన్న చేసిన నిర్వాహకానికి. ఆ విల వకి కారణం లేకపోలేదు—గుమాస్తాని తొలిగిస్తే ఆస్థానే బజా రులో తొక్కితే లేస్తారు పడివుంది. వంటమనిషిని తొలిగిస్తే ఇల్లా లికి తక్షణం గరిటె చేతికొస్తుంది. మళ్ళీ వొక మనిషికోసం గాలించి పట్టుకునేసరికి ఏ దాని గిర్రున తిరిగి వస్తుంది."

పోని నీఇల్లు మానిపోను!—వూపిరి సలపనిచ్చేటట్టు లేడీయన!—మొత్తానికి రణరంగంలోకి ఈడ్చుకొచ్చాడు తనని—తను మొదట్లో అనుకున్న దేమిటి? ఇంతదూర మెట్లా వచ్చాడూ తను? జ్ఞాపకంలేదు. చూడగా చూడగా ఈయనా తన తండ్రీ ఒక స్కూల్లో చదువు కున్నారేమిటి అనిపిస్తుందే? ప్లేటు మార్చాడు.

"కేవలం మీరు వంటపని చేశారని కాదనుకోండి—ఆ తర వాత మీ రవలంబించిన వృత్తీ అదీ......"

"అంటే హోటలు పెట్టాననా?"

"అదేలెండి అన్నం అమ్ముకునే వృత్తి."

"అన్నీ అమ్ముకోవచ్చు గాని అన్న మమ్ముకోగూడదా?"

"అన్నం పరబ్రహ్మస్వరూపం..."

"అన్నం పరబ్రహ్మమంటే ఫక్కున నవ్వే నువ్వు అన్నం పరబ్రహ్మమంటే నమ్ముతావా? విద్య అమ్ముకోవచ్చా?"

"అదీ అమ్ముకోగూడదు నిజానికి—మన ప్రాచీన మహర్షులు గురుకులాల్లో......"

"అయితే స్కూలు మేష్టర్లంతా సంప్రదాయం చెడ్డ వాళ్లేనా?"

"ఆ—చెడినవాళ్ళనే నా వూహ."

అయితే కాలేజీలో చేరిం తరువాత కూడా హైస్కూలు మేష్టర్లెవరయినా అవుపిస్తుంటే అతివినయంగా ఇంకా దణ్ణాలు పెడతావు దేనికని?—ఆ విద్యావిక్రేతలకి—అంతటి గౌరవానికి అర్హతలేనివాళ్లకి — ఇంతయెందుకూ? మానప్రాణాలలో ఏది వున్నతం?

"మానం"

"ప్రాణం నిలుపుకునేందుకు తినేది అన్నం — మానం కాపాడుకునేందుకు కట్టేది బట్ట—అవునా?

"అవునా"

"అయితే మరి నీ లెఖ్ఖప్రకారం అన్నమమ్ముకోవడం నీచమయితే గుడ్డ అమ్ముకోవడం నీచాతినీచమవుతుందా కాదా? మీ బహదూర్ మామయ్యకివొచ్చే సాలుసరి రాబడిలో మూడువంతులు బట్టలషాపుమీదవని తెలుసునా నీకు? తెలిస్తే ఎవరివల్ల నీకేదో సాంప్రదాయం సంక్రమించిందని అనుకుంటున్నావో ఆ ఆసామీ తాలూకూ సాంప్రదాయం నాలుగింటి మూడుపాళ్లు చెడినట్టే ఎందుకనుకోవూ?"

"మీవాదన విపరీతంగా వుంది. గుడ్డ అమ్ముకోవడానికీ పచ్చళ్లు అమ్ముకోవడానికీ సాపత్య మేమిటండీ?"

"నేను పచ్చళ్లని పేరుపెట్టి అమ్మకం పెట్టలేదే! అవకాయికి కొన్నికొన్ని మార్పులతో "అరుణోదయలేహ్యమని" పేరుపెట్టాను. గోంగూరచట్నీకి కుదేనాగట్టా తగిలించి రుచిలో ఒక విలక్షణత కలిపించి "బ్రెడ్ స్ప్రెడర్" అని పేరుపెట్టి జాడీల్నలో..."

"'బ్రెడ్ స్ప్రెడర్' ఏమిటది?"

దొరలు రొట్టెలమీద "ఛీజ్"లాగ, "జామ్" వాడినట్టు వుప యోగించేవాళ్లు దీన్ని—ఆ చట్నీ అంటే దొరలంతా వూటలూరుతో తినేవాళ్లు తెలుసునా? మాంబళంనించీ, 'యూరపియన్ కోలనీ నించీ', వాల్తేరు 'అప్లాండ్సునించీ', 'బెంగుళూరు కన్టోన్ మెంటు'నించీ, కుప్పతిప్పలుగా వొచ్చిపడే ఆర్డర్లకి తట్టుకోలేక పొయ్యేవాళ్లం"

"ఎన్ని పేర్లుపెట్టినా ఆవకాయ ఆవకాయేకదండీ? మా పెత్తండ్రిగా రనేవారులెండి..."

"మీ పెత్తండ్రిగా రెక్కడున్నారిప్పుడు?"

అమ్మయ్య సంభాషణ మార్చినట్టున్నాడు. — —

"బెజవాడలో మెడికల్ స్టోర్సు పెట్టాడులెండి"

"మెడికల్ స్టోర్సా" అయితే ఆ స్టోర్సులో టానిక్కులూ ఇంజక్షన్లూ గట్రా అమ్ముతారా?"

"అట్లా అడుగుతాడేమిటి? పల్లెటూరి జేవయ్యలా!...మళ్ళీ ఏ చెంపనించో దెబ్బ తీస్తున్నాడా?

"ఎందు కమ్మరూ?"

"ఓవల్టిన్ దేనితో చేస్తారో?"

"కోడిగుడ్ల సొనతోటి."

"కాడ్ లివరాయిలూ?"

"చేపనూనెతో—అది పేరులోనే వుంది."

రక్తహీనంగా వున్నప్పుడు, కొన్ని ఇంజక్షన్లిస్తారు చూశావూ విరూహెపటిక్సనీ, హెపటిక్సనీ...అవి దేనితో తయారి అంటావు?"

"ఏమో నాకు తెలియదు."

లేకపోతే ఏమిటి క్రాసింగు?

"తెలియకపోతే చెప్తా విను—అవ లేమిటంటే మేకల కారిజంతీసి, దాని 'ఎసెన్సు' 'యాంప్యూల్సు'గా పిలుచేసి అమ్ము తారు."

"అయితే కావచ్చును."

"ఓవల్టిను టిన్నులూ, హార్లిక్సు యాంప్యూల్సూ ఆ మెడికల్ షాపుల్లో సేలవుతాయిగదా—మీ దాబాయి కోడిగుడ్లూ మేక మాంసమూ అమ్ముతున్నాడంటే వొప్పుకుంటావా?"

"సరిపోయింది. ఓవల్టిన్ కోడిగుడ్డు సొనటండీ? ఆ సొనతో ఇంకా ఏమేమి మిశాయిస్తారో, నిలవవుంటానికి, ఏయే సాధనాలు అవలంబిస్తారో మీకూ తెలియదు—నాకూ తెలియదు—కోడిగుడ్లలోంచీ ఓవల్టిన్ డబ్బా వూడిపడుతుందిటండీ." దానికి దీనికి మధ్య ఎన్ని బుర్రలు, ఎన్ని చేతులు ఎన్ని యంత్రాలు పనిచేయాల్లో గమనించారా మీరు?"

అల్లాగే ఆవకాయలోనించీ 'అరుణోదయ లేహ్యమూ' వూడిపళ్ళే. ఇంకా అపురూపమైన యితర సామాగ్రీ, పాళ్లు కలపటం లగాయతు బ్రహ్మరుద్రుడికయినా తెలియని రహస్యాలూ ఎన్ని వున్నాయి. ఆ ఇన్‌డస్ట్రీలో...ఎలక్ట్రిక్ స్టౌలమీద పని జరిగేది. రుబ్బురోళ్లలో కలిపి రాచ్చిప్పల్లోపెట్టి అమ్మాలనుకున్నా వ్రుగామాలు—నేను ఎగుమతి చేస్తుంటూ వూరగాయనీ, గోంగూర పచ్చడినీ ఎవడైనా వీసం గ్రహిస్తే నాలుగురోజులు వ్యాపారం సాగించగలిగేవాడినా నేను? ఆ వ్యాపారంలో ఒక్క ఏడాదిలో లక్ష ఏభైవేలు సంపాయించాను. రెండువందలమందికి పని కల్పించాను. తెలివితేటలందులో పని చెయ్యలేదని అనటానికి ఎవడికైనా ఎన్ని వేల గుండెలుండాల్నో ఆలోచించి అంచనావేసి చెప్పచూదాం."

భాస్కరం వుక్కిరిబిక్కిరయిపోయాడు.

"అయితే మీ వాదన సహేతుకంగానే కనిపిస్తోంది నాకు. ఎందుచేతనంటే ఇప్పుడు నాకర్థమవుతోంది క్రమక్రమంగా. మీరు దానిలో కొంత కృషిచేసి వొక 'మాన్యుఫేక్చరింగ్ కన్సరన్' కింద ఇండస్ట్రీ స్టార్టుచేసి లార్జిస్కేలుమీద ఎగుమతిచేస్తూ వ్యాపారం సాగించారన్నమాట."

"అట్లా దారికి రా. అయితే యింతకీ ఆవకాయి ఆవకాయి అని నూటిగా చెప్పేదగా లేకుండా అమ్ముకుని డబ్బు చేసుకుంటే సంప్రదాయహీన మన్నమాట! ఆవకాయని మార్చి అరుణోదయ లేహ్యమని చెలామణీలో పెట్టి, బాటిల్స్‌లో బిగించి కార్కులతో సీల్ చేసి లేబిల్సు అంటించి మసిపూసిన మారేడుకాయిగా తయారుచేసి నల్లవాడి లగాయతూ తెల్లవాడివరకూ దొరక్కుండా అందరి కళ్ళల్లోనూ సరిసమానంగా నిష్పక్షపాతంగానూ కారం గొట్టి ధనం రెండు చేతులా తోడిపారేస్తే సంప్రదాయం దెబ్బ తినకుండా అట్లా నిలబడి వుంటుందన్నమాట."

"ఆపరేషను చేస్తున్నానండీ." తల గోక్కున్నాడు భాస్కరం.

"అది కాదు. సంప్రదాయమని నువ్వు కల్పించుకున్న అదృశ్య నీడల్లో ఎన్ని వైపరీత్యాలు దాగుడుమూతలున్నయో నీకంటికి కనుపించాలనీ, నువ్వు యిన్నాళ్ళూ పోషించుకొంటూవస్తూవున్న విలువల్నీ నీకే చీల్చి చూపాలని నా ఆశయం, అంతేగాని, నిన్ను నొప్పించాలనీ, కుతర్కాలతో నిన్ను నావేపుకు తిప్పుకోవాలనీ నేను కాంక్షించటం లేదు. నాకూ వివరాలన్నీ తెలుస్తూనే వున్నాయి. లోకంలో ఎన్ని రకాలయినా సాధ్యాలున్న వెన్నో అన్నింటిలోంచీ కూరుకుని వచ్చాను నేను—ఇప్పుడు ఎవళ్లు నిన్ను పత్రికాలోకి కూడలాలో గానలన్నీ చెప్పి నిన్ను నావద్దకి పంపించారో వాళ్ళంతా ఎప్పుడో వొకప్పుడు ఎవడిచేతనో వొకడిచేత తమ తమ సమయాలను కూర్చి నాకు రహస్యంగా చెప్పించుకుని చాటునా మాటునా కన్ను వెరగించి మాయనున్న వాళ్ళే—వాళ్లేవళ్లకీ పట్టుని అప్పజెపుతారా? మనోహరు పట్టభద్రుడవుతుంటే హార్మోన్ పూరకం టానిక్ వాళ్లే అక్కడికా అనూయా అన్నీ పేరుకుని పూరుజేపాలలో కెటుకోరం యూసేజా వెళ్ళగక్కకుండా వుంటారా? అది నీమీద గాబట్టి బాహాటం పనిచేసివుంటుంది."

"నారాయణ బాబుగారూ క్షమించండి. పోనీ మీ ఇష్టమొచ్చినట్టు అట్లాగే కానీండి." బరువు దించేసుకున్నాడు భాస్కరం.

"నా కట్లా పనికిరాదు. నీకు నిజంగా నా సంప్రదాయమంటే వేరేక అభిప్రాయంలేవని నాకు రూఢిఅయితేనే నీతో వియ్యమందుతాను నేను. అంతేగాని నేనేదో చాలాదూరం చెప్పాను గదా అని సద్దుకోకపోతే ఎట్లాగూ అన్నట్టు కొంచెం దిగ్గివొచ్చి నాకేదో వొరగబెడుతున్నట్టు నటిస్తే మాత్రం నా అభిమానం గాయపడుతుంది. నువ్వు తీరుగానే ఆలోచించి మరీ చెప్పు. ఎటాగూ కొంత మగనపడితేనేగాని, మనిషి ఏ నిశ్చలమైన నిశ్చయానికీ తేరుకోడు. అదీ వొకందుకు మంచిదే—నేను వెడతా."

నారాయణబాబు వెళ్ళిపోయాడు.

ఇదంతా ఇంద్రంగారికి తెలిసింది. తెలుసుకోకుండా వుంటాడూ? ఆయన భాస్కరంతో ఘర్షణపడ్డాడేగాని తెలివితక్కువగా వొదిలేసు కూర్చోరే—ఆయనకి బాహాటెలుసు నారాయణబాబు సత్తా—కాని వొక అనుమానం ఆయన్ని పీకుతోంది. నారాయణబాబు మళ్లీ పెళ్లిచేసుకుంటాడా? ఏమో—.

భాస్కరాన్ని కదిపిచూచాడు. సుభద్రమ్మని పురమాయిస్తే ఆ కీలకం తెలుస్తుందని సలహాయిచ్చాడు భాస్కరం. సుభద్రమ్మ ఇక్కడికీ అక్కడికీ కనపడని టెలిగ్రాఫ్ తీగలా పనిచేస్తో వున్నదని ఇద్దరికీ తెలియదు.

రెండు రోజులయింది మూడు రోజులయింది. నారాయణ బాబు రాలేదు. భాస్కరానికొక వుపాయం తట్టింది. కాలేజీలో తన మిత్రబృందానికీ కమల స్నేహితురాండ్రకీ ఎవరెవరికి ఆహ్వానాలు పంపాలో ఆమెతో తను కూడబలుక్కోవాలిసిన అవసరమేదో వున్నట్టు హటాత్తుగా స్ఫురించిందతనికి. సరేనని బయలుదేరి చక్కా వెళ్లాడు. కమల స్టడీరూములో రాకింగు ఛెయిర్లో కూచుని మేటీగుడ్డమీద డి. యం. సి. దారంలో పూలగుత్తి డిజైను వేస్తోంది. భాస్కర్రావు చూచాడు. అట్టే అలంకారాలు లేనే లేవు. అంచేతనే మరీ అందంగా వున్నదా? ఆమె ముందుకి రాగానే తానేదో మారిపోయినట్టే ఉన్నాడు భాస్కరం. ఆమె సౌందర్యం అట్లాంటిది. అంతర్గతంగా పరిమళమై పాకుతుంది గాని ఆకృతిగా కనురెప్పలు పట్టుకుని వేళ్లాడదు. నిజంగా ఇట్లాంటి అందాలరాణి ముందు సంప్రదాయమనీ ఛట్టుబండలనీ

ఏమిటి తనకీ కళ్ళు వరీక్ష? నారాయణబాబు తనతో అంత వాగ్వివాదం పెట్టుకున్నాడుగాని కమలతో వొక్కసారి మాట్లాడ మంటే వొదిలిపోయేది.

భాస్కరాన్ని చూడగానే కమల ప్రొద్దుతిరుగుడు పువ్వులా గిరుక్కున తిరిగి "రండి కూచోండి." అని సవినయంగా స్వాగత మిచ్చి పావురాయిలా తుర్రుమంది ఇంట్లోకి.

అదేమిటి? అంతా సిగ్గే?

క్షణంలో కాఫీ పట్టుకొచ్చింది కమల—అంతకన్నా!

"వుంటారుగా పూరీ ఇంకా వేగలేదు—వస్తా" అని వెళ్ళిపోబోతోంది. కాఫీ కొంచెం సేవించి "చాలా బావుంది—నీలగిరి కాఫీగింజలా? నువ్వేనా చేస్తా? అని వోరకంట ప్రశ్నార్థకంగా చూశాడు భాస్కరం.

"ఏదోలెండి—వంటపనిలో ఆమాత్రం నైపుణ్య మబ్బకపోతే—ఎంతలేదన్నా వంటమనిషి కుమార్తెనాయెను."

సరిపోయింది. మురుకుమాటలలో చురకత్తులేవో నూరుతున్నట్టుం దీవిడగారు. అక్కడికే మాటతప్పించి "నీకెందుకులేమిగాని కాలేజీలో మనం ఆహ్వానాలు పంపాల్సిన ఫ్రెండ్సు లిస్టొకటి వ్రాసియ్యి" అని పెన్ తీశాడు భాస్కరం."

"చెబుతా వ్రాసుకోండి — గుమాస్తావంశీకులకి వ్రాతపొంకంగా అమురుతుంది." కిసుక్కుననవ్వి నాలిక కొరుక్కుంది కమల.

అతనికి ఘర్రుమంది. అంతా తనని లొంగదియ్యాలని చూస్తారేమిటి? ఎక్కడైనా వోటమి భరించవచ్చునుగాని—ఇక్కడ!—తను ప్రేమించిన తరళాక్షిముందు!!—తనకి కాబోయే ధర్మపత్ని యెదట!!!—అతనికి కోపమాగలేదు.

"నా సంప్రదాయం నువ్వేమీ ఎంచనక్కర్లేదులే—మాది వంటపనిగాదు. వంటపూటింటి పనిగాదు."

తిప్పికొట్టాననుకొన్నాడు. ఇహ లిస్టువ్రాయడాని కుపక్రమించాడు.

"తమవృత్తి ఏమిటో సెలవిస్తారా?"

"మాది వడ్డీవ్యాపారం."

ఆమెకు తెలియదుగావాల్ను!

"తాకట్టువ్యాపారమంటే నిజాని కింకా దగ్గరగా వుంటుందేమో."

"తణఖాలూ తాకట్లూ ప్రోనోట్లూ అన్నీ వడ్డీవ్యాపారం కిందకే వస్తాయి."

"అందులోనూ తాకట్లు మీ నాన్నగారు 'స్పెషలైజ్' చేశారులెండి."

"ఏమో నాకు తెలియదు."

తెలియదుగాబట్టే నే చెబుతున్నా — వడ్డీవ్యాపారమంటే బ్యాంకింగుకాదు మీ నాన్నగారుచేసేది. తూరుపుపేటలో మెగిడీలకీ, కొత్తపేటలో మిల్లుకూలిలకీ పిరంగిదిబ్బమీద వుప్పర్లకీ పాచిపని చేసుకునే పాటకజనానికి రోజువారీ వడ్డీ కట్టాకొ, పదులూ, యిరవైలూ, పుత్తరువూ, పత్రమూ లేకండా బదుళ్ళిచ్చి, (మళ్ళీ పత్రాలు వ్రాస్తే వాయిదానాటికి నోటీసు లివ్వా, వస్తువు వేలానికి పెట్టా, ఎన్ని బాధలు) వాయిదానాటికి ఎలాగో అందకండా తప్పించుకుని మున్నాడు వస్తువు తెగనమ్ముకుని డబ్బు పోగుజేసుకునే వృత్తి—ఇది మీ నాయనగారి వడ్డీవ్యాపారం తెలిసిందా?"

"ఇట్లాంటి వ్యాపారం మాకు లేదు. తణఖా దస్తావేజుల మీదా బ్యాంకుల్లోనూ..."

"మీకు తెలియదని ఇప్పుడేగా అన్నారు? ఆ తరవాత మళ్ళీ నే నన్నదల్లా కాదంటా రేమిటని?"

తనకి తెలియదన్నాడా? ఏమో జ్ఞాపకం లేదు—దిక్కుమాలిన గోల—

"నువ్వొచ్చి నన్ను దెప్పనక్కర్లేదు—ఎంతమంది రెక్కలు కష్ట మోడ్చుకోకపోతే, హోటళ్లలో కౌంటర్లదగ్గర కూచుని, సర్వర్లకి తక్కువ జీతాలిచ్చి ఎక్కువపని చేయించుకుని ఎంతమంది పొటకొడితే, నీకు లక్షలు పోగుపడ్డాయో ఒకసారి సింహావలోకనం చేసి చూసుకో—మా నాన్న వృత్తిలో నెరుసు లేరవచ్చావుకాని.."

"దాఖలా కావాలా? మీ నాన్న 'షైలాక్' అని ఋజువు చెయ్యనా?"

షైలాక్! నూకమ్మ వీళ్ళ పనిమనిషి గావును—చటుక్కున జ్ఞప్తికి వచ్చింది భాస్కరానికి. తను మాత్రం ఏవో పొట్టి చేతులతో కుప్పిగంతులు వేస్తున్నాడు. గాని, ఆమె ఏదో వొక ఆయుధం గుప్తంగా దాచుకునే వచ్చింది!..అంతలో ప్రసన్నమైన కంఠస్వరంలోకి దిగిందామె.

"అసలు మీ దగ్గరకి స్వయంగానే వద్దామనుకుంటున్నాను స్మండీ—మా పనిమనిషి నూకమ్మ సంగతి చెప్పబోతున్నాను దానికి అథమూ శుభమూ తెలియదు. తమ్ముడికి జబ్బుగావుండి తాకట్టుమీద మూజువాణీగా 15 రూపాయిలు తెచ్చిందట. వాళ్లది చూశావా అదొక కాకుల లెక్క—ఒకరోజులో పొరపాటు వచ్చింది గావును—దాని రాగిడీ దాని కిప్పించెయ్యి భాస్కరం—మీ నాన్నగారితో చెప్తావుగదూ?" సోఫామీద ఫొటో ఆల్బం తిరగేస్తూ లాలన చేస్తోంది కమల.

ఇప్పుడుగాని సరే అన్నట్టయినా, తనదీ తన తండ్రిదీ అంతా తప్పని నిర్ధారణయిపోతుందేమో—గోల—

"మరి పేదజనులంటే, పాటకజనమంటే అంత మమకారమాయెను నీకు—నీదగ్గర పనిచేసే వొక పేదరాలు, నీమీద ఆధారపడి జీవించే ఒక అనాథ ప్రాణి—ఒకనాటి ఆపత్తుకి ఒక షైలాక్ దగ్గరికి వెళ్ళాలిసిన దుర్గతి పట్టిందన్నమాట పదిహేను రూపాయిల భాగ్యానికి. ఆమాత్రం అవసరానికి నువ్వాదుకోలేక పోయినావా?"

"నాకు తెలిస్తే ఛస్తే వెళ్ళనిచ్చేదాన్నా మీ నాన్నగారిదగ్గరికి? అది ఇదివరకే మాదగ్గర వంద రూపాయిలదాకా వాడుకొని వుంది. అంచేత మళ్లీ అడిగితే ఏమనుకుంటారో అని అడగలేదు. ఈ దళస వినగానే నేను వేసిన మొదటి ప్రశ్నే అది."

## కూడు గుడ్డ దొరికినంత మాత్రాన తృప్తిపడుదుమా?

## కూడు గుడ్డ సంపాదించుట కొఱకు పాపముచేస్తే ఎట్లా?

పాపము చేయకుండ కూడు గుడ్డ సంపాదించుకొను మనసు ఎట్లా కలుగును?

సిలువ మ్రాను మీద వ్రేలాడుచున్న యేసుక్రీస్తు వైపు చూచుటద్వారానే కదా!

## ఆయన సిలువతో మనమేమిచూచెదము?

1. మన దోషములను బట్టి ఆయన నలగగొట్టబడెను.
2. మన సమాధానార్థమైన శిక్ష అనుభవించెను.
3. అతని రక్తము ప్రతిపాపము నుండి మనలను పవిత్రులనుగా చేయును.
4. తొట్రిల్లకుండ మనలను కాపాడుటకును, నిర్దోషులుగా నిలువబెట్టుటకును, శక్తిగల రక్షకుడాయెను.
5. పాపముల నిమిత్తమై సదాకాలము నిలుచు ఒక బలిని అర్పించి పరిశుద్ధపరచబడు వారిని సదాకాలమునకు సంపూర్ణులనుగా చేసియున్నాడు.



యేసుక్రీస్తు జీవిత చరిత్ర ఉత్తర ప్రత్యుత్తరరీతి చదువుకొనుటకు నీ కిప్పుడు గొప్పతరుణము దొరికి ఉన్నది. చదువుకొన గోరుచున్నావా?

అలాగైన రెండు అణాలు పంపుచు ఈ క్రింది అడ్రసుకు వ్రాయుము:

**జీవిత్ ప్రకాశ్ బడి రామాయ పట్టణము, నెల్లూరు జిల్లా**

"అవునులే దానికింత పిండాకూడు పడేసేదీ, నెల కోసా సాలుసు రాళ్ళు తగలేసి పేపరికంలో వుంచేసేదీ, ఆతరవాత అడపా తడపా వంద రూపాయిలుదాకా పెట్టుబడి పెట్టేదీ—వూరికే నే యిచ్చేస్తున్నట్టు హుందాగా చెప్పుకునేది—"

"వూరికే కాకపోయినా వడ్డీ లేకుండానే లెండి—సరేగాని ఇప్పుడు దాని పేదరికానికీ, నా భాగ్యానికీ, మీ ఆర్జనకీ పునాదులు త్రవ్వుకుంటూపోతే సృష్ట్యాదికి పోవాలిసుంటుంది. నేను చెబుతుంటా దానికి జరిగిన వొక అన్యాయాన్ని గురించి—మీ నాన్నగారితో చెబతారా చెప్పరా?" సీరియస్‌గా అంటోందామె.

"నేను చెప్పను. కావాలంటే దానినే మా నాన్నగారితో చెప్పుకోమను."

"అంతేగాని మీరు కలిపించుకోరన్న మాట."

"నాకా బాధ్యత లేదు."

"కాని లాకప్‌లో పెట్టిస్తానని ధిక్కారంచేసినపుడుమాత్రం మీ బాధ్యతలూ, హక్కులూ గుర్తుకొచ్చినట్టున్నాయి."

"అప్పుడు అది కొన్ని మాటలు మిగిలింది. అంచేత దాన్ని నోరు మూయించాల్సివొచ్చింది."

"అంత తిరుగుబాటు చేసేముందు దానికి ఎంత కష్టం కలిగి వుంటుందో మీరు వూహించుకోకపోతే ఎట్లా?"

మౌనం.

"చెబుతారా?"

"చెప్పను."

"నీ కళ్ళెదుట జరిగే వొక అన్యాయాన్ని అరికట్టలేని నువ్వు పేదవాళ్ళనించీ పిండే వొక్కొక్క నెత్తురు బొట్టుతోబాటు ఒక్కొక్క రూపాయి రాల్చుకు తినే నువ్వు నా సంప్రదాయమూ నా నాగరికతా ఎత్తి వచ్చావా? సాంప్రదాయ మున్నా లేకున్నా లక్షలు నొల్లుకునేందుకు తయారుగా వచ్చినట్టున్నావు."

పంజా విప్పిన ఆడపులిలా లేచింది కమల.

"నీ లక్ష లెవడికీ అక్కర్లేదు. హద్దుమీరి మాత్రం మాట్లాడకు."

సోఫాలోనించి తారాజువ్వలా లేచాడు భాస్కరం.

"లక్షలు అక్కర్లేకపోయినా వొస్తుంటే తప్పుతుందా పాపం-ఎన్ని లక్షలున్నయ్యో లెక్క పెట్టుకునే వొచ్చినట్టున్నావులే. మానాన్న రెండో పెళ్ళి చేసుకోడని రూఢీచేసుకున్నారుగా అవునా? మా సుభద్రమ్మత్తయ్య చెప్పేవుంటుందిలే. కనుక్కొమ్మని సిఐడీగా పంపించారుగా సిగ్గులేకుండా—ఇహను ఆస్తి యావత్తూ సంక్రమించేందుకు ఆటంకాలు లేవని నిర్ధారణ అయిపోయిందిగా—తెగుదునమ్మా అని అంగీకారం చెబుదామని వచ్చినట్టున్నావు. నదునదు, నా చదువూ, నీ సంప్రదాయమూ, నీ నాగరికతా ఇవన్నీ పది వేలిచ్చి మార్కెట్లో రేపీ పాటికల్లా కొనగలను నేను."

నారాయణబాబు అకస్మికంగా లోపలికొచ్చాడు.

"అమ్మాయీ ఏమిటిది? భాస్కరం—కూర్చో—తొందర పడకు" అని సముదాయిస్తున్నాడు.

కమలకి రౌద్ర మాగలేదు.

"నన్ను అబకాయించవద్దునాన్నా—నాకీపెళ్ళి అక్కర్లేదు"

భాస్కరరావు వెళ్ళిపోయాడు. అతని మెదడు బొత్తిగా చెడిపోయింది. ఇంటికి వెళ్ళీవెళ్ళగానే తండ్రిమీద విరుచుకుని పడ్డాడు, వ్యవహార మెట్లా భోరగిలపడిందో కొంత సూచనగా చెప్పి—

"అసలూ ఈ అలగా జనానికి పదులూ పది హేసులూ ఇచ్చి విపరీతంగా వడ్డీవేసికట్టి తాకట్టుసొమ్ము లమ్ముకుంటేనేగాని గడవదా యేమిటినాన్నా మనకి?"

"విపరీతమైనవడ్డీలు ఇచ్చేవాళ్ళకి లేనిదుగ్ధ పుచ్చుకునేవాళ్ళకి పడితే యెట్లా? ఇంతకీ వడ్డీలు తగ్గించమనేగా నువ్వనేది?"

"అవును—ఏదో న్యాయమైన వడ్డీలు కట్టుకుని..."

"న్యాయమైన వడ్డీలనకు—తగ్గింపు వడ్డీలను—అసలు తగ్గింపు వడ్డీలమీద యిచ్చుకుంటే మనకి అలగాజనంతో పనేమిటి?" ఏ తగాఖాలమీదనో, ఏ ఫరమ్నులోనో గట్టిపద్దులు మాచుకుని లక్షణంగా కాలక్షేపంచేయడం మంచిది."

"అవును అట్లా ఎందుకు చెయ్యగూడదూ? ఇది నీచం కాదూ?"

"అట్లాచెస్తే మనకొస్తున్న రాబడిలో పదోవంతయినా రాదు."

"రాకపోతే మానె వచ్చినంతఆయెను."

"రాకపోతే పోనిమ్మని లక్షలున్నవాడు అనాలిసినమాట. ఇంతకీ నేనేదో ఈ అలగాజనాన్ని పీల్చేస్తున్నాననీ వేధించుకు తింటున్నాననేగా."

"అందుకు సందేహంకూడానా?"

"నేను మొదట్లో ఈ వ్యాపారం ప్రారంభించినప్పుడు ఈ పేటలో వాళ్ళంతా పండుగ చేసుకున్నారు."

"అదేమిటీ?"

"అవును—అప్పుడు వాళ్ళబ్రతుకులు కాబూలీవాళ్ళ చేతులలోనూ మార్వాడీల చేతులలోనూ మూలుగుతూ వుండేవి. వాళ్లు సరేసరి అర్ధణాలూ అణాలూ వడ్డీలు బనాయించి కట్టి, మూతులు బిగబట్టి, రూపాయిలు పిండుకునేవాళ్లు—నేను కానీవడ్డీకి మించి ఎన్నడూ కట్టిన పాపాన పోలేదు."

"వాళ్ళమీద దయారసం కొద్దీ వడ్డీలు తగ్గించానంటావా? వ్యాపారమంతా నీవేపుకి రాబట్టుకునేందుకు ఫాయిదాలు తగ్గించావు. వాయిదాలు మాత్రం ఖచ్చితంగా..."

"లేకపోతే ఎట్లా? వ్యాపారమన్న తరవాత ఒక పద్ధతీ ఒక క్రమమూ వుండాలి. వాయిదాలు నిక్కచ్చిగా చూడకపోతే మన వ్యాపార మసలే సాగదు. అందులో నేనొక సుళువు మార్గం చూపించాకూడా. ఏమిటంటే వాయిదావాటికి అసలీ ఫాయిదాలతో ఇవ్వలేనివాడు నా దగ్గరకే వొచ్చేది ఆ మొత్తమంతా

అప్పుతీసుకుని మనో పెద్దవస్తు వేదైనా తాకట్టుంచి చిన్నవస్తువు పట్టుకుపొయ్యేదీ..."

"అన్నను—ఆ వాళే మళ్ళీ వాయిదానాటికి ఇవ్వలేకపోతే అంతకంటే పెద్దవస్తువు తాకట్టుంచేదీ—ఆఖరి పెద్దవస్తు వేదో అది మనకి దఖలు పడుతుంది. అంతే కదూ?"

వస్తువు పెద్దదిగానీ చిన్నదిగానీ వాయిదాలోపు అయితే వాళ్ళదీ—వాయిదా దాటితే మనదీ చెప్పేదేముంది? డబ్బు పుష్కలంగా వున్నవాళ్లు పెద్దపెద్ద మొత్తాలు మోతుబరుల కిచ్చుకుని వాళ్ల అవసరాలు గడుపుతున్నారు. నేనేమో చిన్నచిన్న మొత్తాలు సామాన్యులకిచ్చి వాళ్ల అవసరాలు గడుపుతున్నాను. ఇందులో నేను ప్రత్యేకంగా చేస్తున్న అన్యాయమేమిటో అని, అదీ నాకు పట్టుకుంటు. ఇహ నంతా పెద్దపెద్ద మొత్తాలు మోతుబరులకిచ్చే ఘరానా వ్యాపారస్థులే అయితే డబ్బులేని సాటకజనం ఏమై పోవాలి?"

"మనకెందుకూ? ఆ వ్యాపారం మరెవళ్లైనా చూచుకుంటాడు లేన్నూ."

"ఎవరో ఏమిటి? ఇవ్వాళ ఈ వ్యాపారం మానుకున్నట్టయినా రేపు మా బహదూర్ మామయ్యే తన చేతుల్లోకి తీసుకుంటాడు దంతా. అదిగో ఆ రాజన్న ఆయనచుట్టూ తిరుగుతున్నాడు. ఆయన్ని ఏ వ్యాపారంలో దూర్చనా అని చూస్తున్నాడు, లాభసాటి బేరమయితే మా నేదేవకు ఇట్లాంటి చాదస్తాలు పెట్టుకుని?"

"అసలు పెద్దపెద్ద మొత్తాలు అప్పిచ్చేవాళ్లకంటే ఎక్కువ వడ్డీలు మన మెందుకు వ్రాయించుకోవాలి?"

"వాళ్లకేమిపోయిందీ? ఏ తణఖాదస్తా వేజో రాయించుకుని ఇనప్పెట్టెలో పారేసి కాలిమీద కాలేసుకుని, కడుపుమీద చెయ్యి వేసుకుని హాయిగా నిద్రపోతారు. మన కట్లా సాగుతుందా? తెచ్చినవస్తువు మాయబంగారమో ముచ్చిబంగారమో చూచుకో వాలి—దానికొక నమ్మకమైన కంసాలిమీద ఆధారపడాలి. ఒక్కొక్కసారి ఆ కంసాలి అప్పుకొచ్చినవాడితో లాలూచీ అవుతాడు. ఆ తరవాత ఆ వస్తువుని ఇనప్పెట్టిలో భద్రంగావుంచి దానికి వాయిదారోజు వరకూ బత్తెంలేని జవానులా కాపలా కాయాలి. వాళ్ళకి దరుజా నిల్పబెంచడానికి అంత [illegible] ఒకటి చెప్పి ఒకటి రాయించావు—అప్పిచ్చిన [illegible] అని చెప్పినట్లుగా రెండూ కలిపి వడ్డీ లెక్కవేస్తారేమిట్రా?" అంటూ ఖర్చుపోతు మంతా కలిపి [illegible]. [illegible] ఎంత పాపిష్ఠిబంధ వుంది? అంటారు వడ్డీ కొంచెం తగ్గించి [illegible]. ఇవాళికొన్నింతా లక్షలు పోగుచేసుకుందుకు ఇల్లాంటి వ్యాపారాలు చేసినవాళ్ళే. లక్షలు పోగుచేస్తున్న తరువాత ధర్మం అంటూ [illegible] చేసినవాళ్ళే. అయితే అబ్బాయీ—నువ్వు వెళ్ళిన పని ఏమయిందేం?"

"అయిపోయింది—అప్పు తెగతెంపులయినాయి."

"కాదు మరి? నువ్వు వెళ్ళి మళ్ళీ ఆయన సాంప్రదాయం పాడెత్తి వుంటావు. వాళ్లె మన సాంప్రదాయాన్నూ, మన వ్యాపార రహస్యమూ గట్టా నువ్వెత్తి పారేసివుంటావు..."

"ఇదంతా నువ్వే చేస్తా..."

"నేనా."

"అవును వాళ్ల పనిమనిషి నాకమ్మ నీదగ్గర వస్తువేమిట్లో తాకట్టుంచితే దాన్ని వాయిదా వెళ్లిన మన్నాడే తెగనమ్మకోనా? అది వెళ్లి అక్కడ కంప్లెయింటు చెయ్యనా? కనుల దానిని పనకా తేసుకుని నన్ను నిగ్గదియ్యనా?"

"అమ్మ లేదులే—ఇంట్లో నేవుంది — కనులే అడిగిందీ? పోనీ అడిగితేమానె, అదేదో వెంకిరెంగా మాట్లాడితే మా నాన్నగారికి కోపం వచ్చివుంటుంది—నేను చెప్పి దాని వస్తువు దాని కిప్పించేస్తాలెమ్మని ఏదో వుదారంగా మాట్లాడి సర్దెయ్యలేకపోయి నావా? నువ్వు అక్కడికూడా నన్ను సమర్థించివుంటావు. అవునా? పట్టూ విడుపూ వుండొద్దటరేం? ఎల్లాగూ నీకు రాజసం ఎక్కువరా అబ్బాయీ—దానిమీద వ్యవహారం జెడిసికొట్టేవుంటుంది."

భాస్కరానికి వుక్రోషంగా వుంది. ఎవరిని ఎందుకు ఏమనాలో అతనికి బోధపడటం లేదు. తల గిర్రున తిరుగుతుంటే కుర్చీమీద అలాగే కూచుని దీర్ఘాలోచనలో మునిగిపోయాడు.

ఎదట దక్షిణపు గాలికి టపటప కొట్టుకుంటున్న క్యాలెండర్లో లక్సు టాయిలెట్ సోపుమీద రతన్‌బాయి పకపకా నవ్వుతోంది!



# మాధవహేల

శ్రీ సి. నారాయణరెడ్డి

కష్టాలవలె ముసురు
కారుమబ్బుల దాటి
దుఃఖాలవలె జారు
తుహిన ధారలదాటి
పశువాంఛవలె రేగు
శిశిరానిలము దాటి
మరల నేతెంచితివ ?
మధుర మధుమాసమా!
మన్మథ ధనుర్ముక్త
మల్లికా హాసమా!

చూపుతోనే గుండె
లో పొగలు రేగించు
గ్రీష్మరాగిణి కొరకు
కేలు సాచగలేక
నవ్వుతోనే బ్రతుకు
నందు మంచులు దించు
హేమంత భామతో
జాము గడపగలేక
మోడువడిపోవు నా
లో; మోదుగుంబూల
కాగడా లెత్తిన జ
గన్మోహినివి నీవు!
రాగమాధ్వీక ధా
రా వాహినివి నీవు!

నీ పరిమళస్ఫీత
నిశ్వాస లహరితో
పొగమారు గుండెలో
పొందామరలు పూచు.
నీ మరంద స్నాత
నీల దృఙ్మాలతో
జిగము వట్టిన యెడద
నిగురు మంటలు లేచు.
నీ వగ్నిశీధు పుం
జీ భూత రూపమవు!
ఈవు చల్లనిజ్వాల
లెగబోయు దీపమవు!

మావి చివురుల మేసి
మత్తిల్లు కోకిలల
చేదు గొంతుకలందు
స్వాదుగీతులు లేపి,
శిశిర విషమారుత వి
శీర్ణ వృక్షాంగనల
దిసమొలలలో హరిత
వసనాల నందించి,
వెన్నుపోటులగాని
వినని మానవకోటి
పువ్వుల చిరునవ్వులతో
డ వశీకృత మొనర్చి
భువిని నందన వన
మ్ముగ మార్చు ఆమనీ!
కవి యెడద పలికించు
గంధర్వ భామినీ!

---

# మన కుటీర పరిశ్రమలు

శ్రీ కామఋషి సత్యనారాయణవర్మ

## నిర్వచనము

సుమారు రెండుశతాబ్దులపూర్వమువరకూ గ్రామజీవితమునందు కుటీరపరిశ్రమలు అత్యధికప్రాముఖ్యము గలిగియుండినట్లు మనకు చరిత్రలవలన తెలియగలదు. ఒక్కొక్కతెగ ఒక్కొకకళ నాశ్రయించి వంశపారంపర్యముగా నా కళ నభ్యసించుటవలన వారికొకవిశిష్టత యేర్పడెడిది. అట్టిపరిశ్రమలే వారికి జీవనోపాధులై కులవిద్యలుగా వన్నెగాంచినవి. మనుష్యునకు గల కళాకౌశలమును వ్యక్తపరచుటకు చేతిపని యొక ముఖ్యసాధనము. చేతితో రూపకల్పన గావించి ప్రదర్శించు కళాకౌశలమునే చేతిపనియని వ్యవహరింపబడుచున్నది. ప్రారంభదశలో ఒకేవ్యక్తిచే నిర్వహింపబడు కృషి క్రమక్రమముగా కుటుంబముయొక్క సహకారమునుపొంది నడుపబడుటవలన నది గృహపరిశ్రమగా పరిణామము చెందినది. కుటుంబమునందలి శ్రామికులతోపాటు ఇతరులనుగూడ దినవేతనములపై ఒకానొకపరిశ్రమలో నియోగించుటవలన ఈ గృహపరిశ్రమకే 'కుటీరపరిశ్రమ' యను పేరు సార్థకమైనది. కాలక్రమమున యంత్రముల యుత్పత్తితో పెద్దపెద్ద కర్మాగారములు స్థిరపడినవి. వాటితో పోల్చినప్పుడీ కుటీరపరిశ్రమలు చిన్నతరగతి పరిశ్రమలుగా పేర్కొనబడినవి. చేతిపనులయందలి పరిణామదశలను పురస్కరించుకొని ఈవిధముగా చేతిపని, గృహపరిశ్రమ, కుటీరపరిశ్రమ మొదలగు పదముల నిర్వహింపబడినట్లుగా నూహింపదగును. గృహపరిశ్రమ యనుమాట కళాకారుడు ముఖ్యముగా తన కుటుంబసహకారముపైననే యాధారపడి, గృహమునకు పరిమితమై సమష్టిప్రతిభను వ్యక్తపరచుననిగూడ బోధ యగుచున్నది. ప్రజల నిత్యజీవితావసరముల కుపయోగపడు వస్తుసామగ్రి పూర్వము చేతితోనే తయారుకాబడుచుండెడిది. వ్యవసాయ కృషికి కావలసిన పనిముట్లు, గృహపరికరములు, కంచు, ఇత్తడి సామానులు బొమ్మలు మున్నగు నవన్నియు గృహపరిశ్రమలుగానే వర్ధిల్లినవి.

## ఆచార సంప్రదాయములు

నేటికీ వేదవిజ్ఞానమును భద్రపరచిన బ్రాహ్మణుడు, ప్రజల అనుదిన జీవితమునకు అవసరమైన పరికరములను సమకూర్చిన పారిశ్రామికుడు గ్రామవ్యవస్థకు మూలకందములవంటివారు. కమ్మరి, కంసాలి, వడ్రంగి కుమ్మరి, సాలె, చిత్రకారుడు మొదలగువారందరు గ్రామముయొక్క సమష్టి జీవనమునకై పరస్పర సహకారముతో కృషిసల్పెడివారు. ఏ ఇంటనైనను శుభకార్యమును తలపెట్టగనే కుమ్మరి ఇంటినుండి సాకబలి పాత్రలు, సాలెవద్ద నూతన వస్త్రములను, కంసాలివద్దనుండి మంగళసూత్రములనూ, గౌరవముగా బహూకరించి మంగళవాద్యములతో గొనితెచ్చుట ఈనాటికి మిగిలిన విశిష్టాచారములలో నొకటి. సంక్రాంతికి ఏటేటా బొమ్మలకొలువు తీర్చి కళారాధనకు, కళాపోషణకు తావు కలిగించిరి. దేవాలయములలో అపురూప శిల్పశోభితమైన గోపురములు, అందమైన రథములు నిర్మించుటద్వారా తరతరముల శిల్పపారిశ్రామికుల పోషణ వ్యవస్థ ఏర్పరుపబడినది. దేవాలయములందలి ఉత్సవమూర్తులనే గాక ఆరాధన కుపకరించు దీపస్తంభములు, జేగంటలు, నివాళిపళ్ళెములు మొదలగు పూజాపరికరములలో గూడ తన కళాకౌశలమును వ్యక్తపరచి పారిశ్రామికుడు తన భుక్తికి, ముక్తికిగూడ సాధనమును కరతలామలక మొనరించుకొనెను. అందువలననే ఆనాటి పారిశ్రామికుని చేతిపని కేవలము వ్యాపారసరళిలో నుపకరించు వస్తువుగా గాక భగవత్సేవ కుపయోగపడుటకై మానవుడు తన హస్తకౌశలమున సాధింపగల ఉత్తమము, సుందరము నగు ఉపాయనముగా రూపొందినదని చెప్పిన ఓ. సి. గంగూలీగారి అభిప్రాయములో ఎంతేని సత్యము గలదు. పాశ్చాత్య కళావేత్తలలో సుప్రసిద్ధుడైన 'హేవెల్' ప్రాచీన పారిశ్రామికునిగూర్చి చెప్పిన మాటలు గమనార్హమైనవి. ఆధ్యాత్మిక ధర్మప్రచారము గావించు మతబోధకుని దీక్షతో ప్రాచీన కళాకారుడు నాగరికతను సంస్కృతిని నడిపెనని యు, వారి కళలు కేవలము ఆస్వాదయోగ్యమైనవే గాక, సృజనాత్మకమైనవగుటవలన వారి మేధస్సు, పండితునియొక్క, తత్త్వవేత్తయొక్క స్థాయిలో నడచెననియు, అతడు వక్కాణించెను.

## చారిత్రిక విఖ్యాతి

వారసత్వ సంపదలుగా నేటికి నిలచియున్న మన దేశీయ పరిశ్రమలకు ప్రపంచ విఖ్యాతి గలదు. శాతవాహనరాజుల కాలము నాటినుండి మన ఆంధ్రదేశము ఇతర దేశములతో సాగించిన ప్రధాన వ్యాపారము నూలుబట్టలు, అద్దకపు బట్టలు, అందమైన పలుచని రవసెల్లాలును. ఇవి యూరపు ఖండమందలి రోము దేశమువరకూ పోవుచుండెడివి. 1280 ప్రాంతమున యాత్రికుడుగా వచ్చిన వెనీసు వర్తకుడు 'మార్కొపోలో' మోటుపల్లి రేవునందలి మల్లు సెల్లాలను చూచి ఆశ్చర్యపోయెను. కాలక్రమమున దేశము పరాధీనమగుట, పాశ్చాత్య దేశములలో వచ్చిన పారిశ్రామిక విప్లవ ఫలితముగా యంత్రయుగము ప్రబలుట తటస్థించినవి. ఆంగ్లేయులు ఇంగ్లండులో యంత్రములపై గావింపబడిన అధికోత్పత్తుల నియోగమునకై భారతదేశమున పరిశ్రమల రూపుమాపుట, సాలీని దారమువంటి సన్నని నూలు తీయగల కళాకౌశలమును నాశనము గావించుటకై పారిశ్రామి

కులవేళ్లే తెగగొట్టుట మొదలగు గాథలు చరిత్రలో జరిగిపోవు గదా! ఈ విధముగా క్షీణించిపోయిన కుటీర కళలకు తిరిగి స్వరాజ్యోద్యమముతో కొంత చైతన్యము కలిగినది. మహాత్ముడు సంకల్పించిన గ్రామపునరుద్ధరణ కార్యక్రమముతో పారిశ్రామికులకు కొంత చైతన్యము కలిగి తమ కళాకౌశలము చూపి కాపాడు కొనుచు వచ్చిరి. నేటికి మన ప్రాంతములలో మిగిలియున్న పరిశ్రమలగూర్చి కొంత తెలిసికొనవలసి యున్నది.

## వివిధ పరిశ్రమలు

ఈనాటికిని మన దేశమున చేనేత ప్రధాన జాతీయ పరిశ్రమగను, నూలువడకుట లక్షలాది స్త్రీల ఉపాధిగను వర్ధిల్లినవి. ఆంధ్ర చేనేత పారిశ్రామికులకు గల హస్తకౌశలము సార్వత్రికఖ్యాతి నొందినది. వీరు భారతదేశమున పలుప్రాంతములలో వలసబోయి స్థిరపడి ఆయాప్రాంతీయ కళాకారుల పరిశ్రమలకు దోహదము చేసినట్లుగా చరిత్రలు తెలియజెప్పుచున్నవి. వ్రేళ్లు తెగగొట్టబడిన ఢక్కా చేనేతపారిశ్రామికులలో ఆంధ్రదేశస్థులైన దేవాంగులున్నట్లుగా వారిపేర్లనుబట్టి తెలియుచున్నది. ఈ చేనేతకు ఉపవృత్తులుగా అనేక ఇతరపరిశ్రమలుగూడ వర్ధిల్లినవి. ఈపనికి ముఖ్యసాధనమగు మగ్గమును అందరు వడ్రంగులు తయారుచేయజాలరు. ఇదొక ప్రత్యేకకళ. దానికి సంబంధించిన కొలతలు—తూకము మొదలగు వివరములననుసరించి తయారుగావించినగాని ఆ సాధనము దాని కుపయోగపడదు. ఇదిగాక రాట్నములు, కదుర్లు, పన్నెలు, అచ్చులు, కండెలు మొదలగునవి కఱ్ఱసామగ్రులైనప్పటికిని ఆయా పరికరముల చేతకు ప్రత్యేకప్రావీణ్యము గావలసి యున్నది. ఆంధ్రదేశమున అద్దక మొక ప్రత్యేకకళగా నభివృద్ధిగాంచినది. ప్రాచీన కవులనేకులు తమతమప్రబంధనాయకలను అలంకరింపజేసిన వస్త్రములరంగులు అందచందములు విజ్ఞు లెఱుంగనివిగావు. 12వ శతాబ్దివాడైన పాల్కురికి సోమన అనేకరకముల నూలుబట్టలగురించి వర్ణించియుండెను. శ్రీనాథుని క్రీడాభిరామమునందు "గన్నేరుపూచాయ కరమొప్పనీర్కావి మడుగు ధోవతిపింజె విడిచికట్టి" అని వర్ణించి ఆనాటి వస్త్రాలంకరణ విధానమును వివరించెను. ఈ అద్దకమునందు చిలుకచేయుట, రకరకముల అద్దకముల నద్దుటలో ఆంధ్రదేశీయ పారిశ్రామికులకు ప్రత్యేకతగలదు. బందరు కలంకారీ అద్దకములకు ప్రపంచ విఖ్యాతిగలదు. కొల్లపాలెము, కందుకూరు, పాలకొల్లు మొదలగు చోట్లగూడ నేటికి విఖ్యాతిపొందిన కళాకారులు గలరు. కోటీశ్వరుని మొదలు కూటిపేదవరకు బొమ్మలతో నానందించనివా రుండరు. అట్టి బొమ్మలు తయారుచేయుటలో కృష్ణాజిల్లాలోని కొండపల్లి, తిరుపతి, నక్కపల్లి, శృంగవరపు కోట ప్రాంతములోని పారిశ్రామికులు నేర్పరులు. కొండపల్లి కళా సంప్రదాయములలో జానపద కళాకౌశల మొక పరాకాష్ఠ నందినదనిన నతిశయోక్తిగాదు. పొనికి కఱ్ఱమానుతో తయారుచేసిన చిన్న చిన్న బొమ్మలలో సామాజిక దృశ్యములు, గ్రామీణ వృత్తులు గుడులు, గోపురములు, దశావతారములు మొదలగు పౌరాణిక విగ్రహములుగూడ వాటి సహజ కళ ఉట్టిపడ రంగులువేసి తయారుచేయుదురు. తిరుపతి, కాళహస్తి ప్రాంతములందు వెంకటేశ్వరుడు, పద్మావతి మొదలగు దేవతా ప్రతిమలను ఆ ప్రాంతమున దొరకు ఎఱ్ఱని, తెల్లని కఱ్ఱతో తయారుచేయుదురు. అవయవములను ప్రత్యేకముగా నతుకక ఏకదారు ఖండమునందే చెక్కుట ఈ కళలోని ప్రత్యేకత! విశాఖ మండలమునందలి నక్కపల్లి, శృంగవరపుకోట మున్నగుచోట్ల లక్క సామానులలో చతురంగబలములు, లక్కపిడతలు, పన్నీరు బుడ్లు, భరిణెలు తయారుచేయుచున్నారు. దీనికి తెల్లని కఱ్ఱనే తెరుమణిబట్టి తయారుచేయుదురు. ప్రశంసాపాత్రమైన దంతపుపనులు విశాఖపట్నమున తయారగుచున్నవి. కంచు చెంబుల పోతకు ప్రఖ్యాతిపొందిన తావులు ఆంధ్రదేశమున పలుప్రాంతములందు గలవు.

ఏలూరునందు నేయబడు తివాసీలు రత్నకంబళములు అమెరికాకు ఎగుమతి చేయబడుచున్నవి. బళ్లారిప్రాంతమున కంబళ్లు నేయుచున్నారు. గుంటూరు జిల్లా నరసరావుపేటలో క్యాంపు కాట్లు తయారుచేయుచున్నారు. తాళ్ళరేవు, యానాం, కోటిపల్లి ప్రాంతములలో పడవలు తయారుచేయుదురు. నెల్లూరుప్రాంతమున పేము అల్లికల విస్తారముగా నేయుదురు. చిత్తూరు జిల్లా బాపినేడు పేటలో సన్నని గాజుపూసలు, నల్లపూసలు తయారుచేయుచున్నారు. కొబ్బరినారతో తయారగు చాపలు, తాళ్ళు, పడవ పగ్గములు విరివిగా తయారుచేయబడుచున్నవి. మృణ్మయపాత్రలలో కూజాలు మొదలగునవి హస్తకౌశల ముట్టిపడునటు తయారుచేయుచున్నారు. వెదురు, తాటాకుతో తయారగు బుట్టలు, తడికెలు, చాపలు మొదలగు పరిశ్రమవలన నేకులు జీవనోపాధులు గడుపుకొనుచున్నారు. పాలకొల్లు నరసాపుర ప్రాంతములలో మిషనరీలచే ప్రోత్సహింపబడిన లేసు అల్లికలు విదేశములకుగూడ ఎగుమతి యగుచున్నవి. అల్యూమినియము పరిశ్రమకు రాజమండ్రీ, ఏలూరు ప్రాంతము ముఖ్య కేంద్రములుగా నున్నవి. చక్కని వ్యాపారము సాగుచున్నది. ఏలూరు, బెజవాడ, బళ్లారి ప్రాంతములలో తోలు బాగు చేయుచు, రకరకముల చర్మములతో జోళ్లు, సంచులు, మనీపర్సులు తయారుచేయుచున్నారు. కడపజిల్లాలో పలకలు చేయుచున్నారు. ఇట్లు అనేక పరిశ్రమలు వివిధ ప్రాంతములలో కుటీర పరిశ్రమలుగానే వృద్ధిపొంది అనేకులకు జీవనోపాధి కలిగించుచున్నవి. కాని తగిన పెట్టుబడులు, ప్రోత్సాహము లేక ఈ కళలన్నియు నామమాత్రావశిష్టమై తగిన విక్రయ సౌకర్యములు లేక పారిశ్రామికులు అనేక ఇబ్బందులు పడుచున్నారు.

## వర్తమానము - కర్తవ్యము

సర్వసాధారణముగా ఈ పరిశ్రమలకు నాలుగు ముఖ్యాంగములు గలవు. అందు 1 ముడిపదార్థములు లభ్యమగుట 2 పరిశ్రమ కనుకూలించు వాతావరణము 3 పరిశ్రమ పోషణ కవసరమగు పెట్టుబడి 4 పారిశ్రామికుడు—ఈనాటి వాతావరణము ననుసరించి పారిశ్రామికుడు పేదవాడగుటవలన తన పరిశ్రమకు తగిన పెట్టుబడులు లేక మధ్యవర్తిపై నాధారపడవలసిన పరిస్థితి ఏర్పడినది. పెట్టుబడిదారుడైన మధ్య వ్యాపారియొక్క ఆగ్రహానుగ్రహములకు పాత్రుడై తన పరిశ్రమను నడుపుకొనవలసినందున వానికి తగిన జీవనభృతి గూడ గిట్టుట లేదు—పారిశ్రామికుని సంతృప్తిపరచి కళను లేదా, పరిశ్ర

మను పోషించవలయునన్న తలంపు వ్యాపారలాభములకై ఎదురు చూచు మధ్యవర్తికి అవసరము లేని బాధ. ఇటీవల భారతదేశమునందు లఘు పరిశ్రమల పరిశీలించిన ఫోర్డు ధార్మికసంస్థవారు గూడ ప్రైవేటు పారిశ్రామికులలో తగిన శ్రద్ధ ఉత్సాహము లేకపోవుటయే పరిశ్రమాభివృద్ధికి నిరోధకముగా నున్నదని చెప్పిరి.

రెండవది పారిశ్రామికునిలో గల అలసత్వము. అనగా పూర్వకాలపు పనిముట్లతో, దేశమందలి నూతనాభిరుచులకు సరిపడని సరకులను తయారుచేయుచు పాతకాలపు విధానముల ననుసరించుచు నూత్న వాతావరణమునకు ఇముడని స్వభావము, పరిశ్రమల కవసరమగు ముడిపదార్థములు లభ్యము గాక మరియొక చిక్కు ఏర్పడినది—వీటన్నింటికీతోడు విక్రయ సౌకర్యముల లేమి. ఈ కారణముల ననుసరించి పరిశ్రమకు తగిన ప్రోత్సాహము లేకున్నది. పారిశ్రామికునికి గల కళాకౌశలమును దేశావసరములకు—ప్రజాభిరుచులకు తగినట్లుగా మలచుకొనకపోయినచో ఈ పరిశ్రమల భవిష్యత్తు ఆశాజనకముగా నుండదు. ఒకప్పుడు రాజులపైనుండిన కళా, పారిశ్రామిక పోషణము ప్రభుత్వముపై బడినది. అందుల కనుగుణ్యముగా కేంద్రప్రభుత్వమువారు కళాపరిషత్తులను, సాహిత్యపరిషత్తులనూ స్థాపించి కళాసాహిత్యపోషణకు పూనుకొనుట ఎంతయు సంతోషింపదగినవిషయము. అట్లే కుటీరకళలు చిన్నపరిశ్రమల పోషణకై ఖాదీ, గ్రామపరిశ్రమలబోర్డు, అఖిలభారత చేనేత పరిశ్రమలబోర్డు, చిన్నరకము పరిశ్రమలబోర్డు మొదలగుసంస్థలను నెలకొల్పి పరిశ్రమలపోషణకు పూనుకొనుచున్నారు. ఇదిగాక నిరుద్యోగనివారణపథకములలో రెండవ పంచవర్షప్రణాళికలో కుటీరపరిశ్రమల పునరుద్ధరణకు మంచి అవకాశముల కలుగజేయుచున్నారు. గనుక పారిశ్రామికులు ముందుకువచ్చి రానున్న నూత్న పరిణామములకు తగినట్లుగా సంసిద్ధపడవలసిన అవసరము గలదు. చైనా జపాను మున్నగు దేశములలో నీశతాబ్దమున నవలంబింపబడిన పారిశ్రామికవిధానముల ననుసరించి భారీపరిశ్రమలకు, కుటీర పరిశ్రమలకు వైరుధ్యము లేకపోవుటయేగాక రెండును సమరసభావముతో వర్ధిల్లగలవనిగూడ రుజావుచేసియున్నారు. ఇట్టి పరిశ్రమ ఆధునికతకు, క్రమబద్ధమొనరించుటకు అవసరమైన సాంకేతికసహాయమునుగూడ పొందినచో నట్టివి ఫలప్రదములు కాగలవు. నేటికి జపానులో గల పరిశ్రమలలో నూటికి 62 పరిశ్రమాగారములు 10 మందికి మించని వ్యక్తులతో నిర్వహింపబడుచున్నవి. అమెరికా యూరోపుదేశములలోవలె మానవుని కళాకౌశలమును, శ్రమను యంత్రములకు బలిపెట్టక, జపానులో ఎలక్ట్రిసిటీ సహాయమును మనుష్యనిశ్రమను తగ్గించుటకుమాత్రమే వినియోగించుకొని క్రియాసౌలభ్యము నందగలుగుచున్నారు. యంత్రమునకు మానవుడు బానిసగాక దానికి యజమానివలె వానిశక్తిని వినియోగించుకొనుచున్నారు.

ప్రపంచమునందు పలువిధముల అనుసరింపబడుచున్న నూత్న విధానములను సమన్వయపరచుకొని ప్రభుత్వము, పారిశ్రామికులు మనదేశవారసత్వసంపదలుగా నేటికీ మిగిలియున్న కుటీరపరిశ్రమలను పునరుద్ధరించుకొనవలసి యున్నది. పారిశ్రామికులలో తగిన విద్యాగంధములేని కారణమున, ప్రభుత్వసహాయమును పొంది సహకార సంఘములుగా నేర్పడుటకు తగిన పరిజ్ఞానము వారిలో కలుగుటలేదు. గనుక దాని కనువుగా ప్రభుత్వమువారే వారభ్యసించిన కళల కనుకూలమైన సహకార సంఘముల నేర్పరచి చేయూత నొసంగి ఆదరించుట వారి విధి. ప్రతిజిల్లాకు స్థానిక పరిశ్రమలకు సంబంధించిన జ్ఞానము నభివృద్ధి గావించుటకు, పారిశ్రామికులలో ప్రోత్సాహము కలుగజేయుటకు వస్తుప్రదర్శనశాలలు స్థాపించవలసిన ఆవశ్యకత ఎంతేనిగలదు—అవలంబన లేక, నామమాత్రావశిష్టమైపోయిన పరిశ్రమలగురించి మిగిలియున్న కర్మాగారాలవలన గ్రహించి అందలి ప్రక్రియావివరములను గ్రంథస్థము గావింపవలసియున్నది. అద్యతనభావిలో ప్రభుత్వసహకారముతో ఆంధ్ర పారిశ్రామికలోకమున నొక నూత్నశకోదయమై ప్రాచీన కళాకౌశలము మరల నున్నతి పొంది దేశభాగ్యమును కన్నులార జూచు తరుణమును అఖిలలోక కర్తయగు భగవానుడనుగ్రహించుగాక! లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.



# గోలకొండకోట

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

కంచెల నుక్కు కంబములు గట్టిన యీ చెఱసాలలోన గ
న్పించెద వృద్ధతా! దమన సీతికిఁ గన్నుల సీరు నించి నా
మంచునొ — యాంధ్రజాతి హృదయంబున శ్రీ రఘురాముని బ్రతి
ష్ఠించిన నీ కటే కఠినశిక్ష మహాకవి! సైచినాఁడవే.

ఇంతకుముందుఁ జూచినది యిప్పు డిదేమి! కళావిహీనమై
కాంతి దొఱంగియున్నది యొకానొక భక్తుని దుఃఖితాత్మ! యీ
ప్రాంతములందు నీ బురుజులన్ జెఱసాలల నిల్చి నాటి వృ
త్తాంతముఁ గోటి కంఠములఁ దాలిచి చాటుచు నుండెనా యిటన్.

ఒండొకరుండు బంధముల నూడ్చుట కా మహాశయుఁ డిచ్చగిం
పం డనుకొందు నట్లతని వద్దకు రావలె రామమూర్తి — గో
ల్కొండ యశమ్ము నందవలె — గోప కవీంద్రుని భక్తికిన్ ఫలం
బుండవలెన్ — నవాబుల కహో! ధన దాహము దీఱగా వలెన్.

అమ్మనుజేశ్వరాధముల యాజ్ఞకు లోఁబడనట్టివారలాం
ధ్రమ్మున సుస్వతంత్ర కవిరాజులు మువ్వురె మువ్వురే! — ప్రశ
స్తమ్మగు రామభక్తిఁ దమ జాతి కొసంగిరి పోతరా జొకం
డిమ్మగ త్యాగరా జొకఁడు నీ మహితాత్ముఁడు గోపరాజునున్!

రామదాసుని ఋణము దీర్పంగ నపుడు
స్వయముగా వచ్చె శ్రీరామచంద్రుఁ డిటకు
గోపన తపాననో — నవాబు క్రోధముననో —
అయ్యె నియ్యది మాకు దివ్య స్థలంబు!

# పరిశిష్టం

శ్రీ ఘట్టి కృష్ణమూర్తి

## 1

"ఎన్నిసార్లు చెప్పినా బుద్ధి లేదు, తలుపు తియ్యడానికి గంటసేపు పట్టవలసిందేనా? గుమ్మంవద్దగ్గర యింతసేపు నుంచోవాలని నీ ఉద్దేశ్యం??" గడియ సడలించగానే తుఫానులా తోసుకువచ్చి తీవ్రమైన ఆవేశంలో అన్నాడతను. ఆమె కదల్లేదు: స్థైర్యంతో నిలబడి "ఎవరో తెల్సుకోకుండా తలుపుతీసే బుద్ధి నాకు లేదు" అంటూ పదునైన చూపుల్తో అతని కళ్ళల్లోకి తీక్షణంగా ప్రసరించింది. అతని మనసు చివుక్కుమన్నది. అంతవరకు వున్న కోపమూ, విసుగూ చచ్చిపోయి మామూలు స్థితి కొచ్చాడు.

అతడి మనస్తత్వంలోగల వైచిత్ర్యం అదే. ఎంతటి కోపమూ, మరెంతటి బాధా కలిగినా మరుక్షణంలోనే మర్చిపోయి మామూలు మనిషిగా ముఖకవళికల్లో, కళ్ళల్లో, సంభాషణల్లో గాంభీర్యం తెచ్చుకుంటాడు. అయినా మాటకుమాట అప్పగించే ధోరణిలో ఇలా అన్నాడు—అవును, ఎవరో తెలీకుండా తలుపెల్లా తీస్తావు? కాని, అంత ధీమాగా తలుపు తట్టగలవాడు ఇంకెవడైనా కావచ్చుననే ఆలోచన కల్గలా, అని.

అతను మంచి నాటకకారి. విశేషించి ఢక్కా ముక్కీలు తిన్నవాడు కావడంవల్ల ఇతరుల మనఃప్రవృత్తుల్ని శీఘ్రంగా గ్రహించగలడు; తదనుగుణంగా నడుచుకోగలడు కూడాను—ఆమె దెబ్బ తిన్న దానిలా క్షణం గజిబిజి అయి ధైర్యం కూడగట్టుకుని బింకంగా యిలా అన్నది. 'అయితే అది నీ పొరపాటు. అదృష్టవశాత్తు నా యిష్టం నా చేతుల్లోనే వుంది', అంటూ అటు వైపుకు తిరిగి పోబోతున్నది. అతడు జాలిగా నవ్వుకున్నాడు. అతడామెను లోతుగా అర్థం చేసుకున్నవాడు. పైగా తనకే పైచెయ్యి అనిపించుకోవాలనుకుంటున్నవాడు. అనునయం, ఆగ్రహం తన అధీనంలో అట్టే పెట్టుకుని యెదటి వ్యక్తిపై పారవశ్యతా సంభ్రమాలు ఒలికించి ఫలితం సమీక్షించుకోగల నిబ్బరం కలవాడు—ఒక్క అదిలింపుతో ఆమెను అభిముఖంగా తిప్పుకుని, కొంటెచూపుల కలకలలతో "నువ్వన్నమాట నిజమే, కాని నువ్వు నీది అనుకుంటున్న అదృష్టం, నీ యిష్టానిష్టాలు మరొకరు నిర్ణయించిన దారినే పోతూ వుంటయ్యని తెలియదూ!" అని సమాధానం ఆశించకుండానే తీరుబడిగా మంచంపై నడుంవాల్చి అప్పుడే తెచ్చిన పత్రిక విప్పాడు. మళ్ళీ ఆమె వేపైనా చూడలా. ఆమెకు చాలా బాధ కలిగించింది. ఎదట మనిషిని అతడంత చులకనగా చూడడం సహించలేకపోయింది. గోడనున్న నిలువుటద్దంలో నిటారుగా కనిపించే తన ప్రతిబింబాన్ని పర్యవేక్షించుకున్నది. ఏదో తెలియని నిరుత్సాహం అర్థంకాని ఆవేదనగా మారి నున్నని ఆమె బుగ్గలపై పులకరించి, నుదుటి పైకి ప్రాకి, రోజుటి ప్రతిబింబం తనదేనా, అన్నంత అనుమానం రేకెత్తిస్తోంది.

అతని కంటికి నచ్చేటట్లుగా వుండాలని ప్రత్యేకంగా అలంకరించుకుంటే అతనికి అలవాటని కమ్మని కాఫీ కలిపి గ్లాసులో పోసివుంచింది. ఇంతచేసినా అతడు దీన్ని అర్థం చేసుకోక తూష్ణీంభావం వహించి, పై పెచ్చు మాటలతో వేధించడం మొదలు పెట్టాడు. దీనికి తను చేజేతులా చేసుకొన్నదేమిటి? అతను అడుగుపెట్టే సమయానికి ఔదాసీన్యంతో ఉండిపోవడమే కారణమా? రోజూ లేనిది ఇవ్వాళ తలుపు బిడాయించుకు కూర్చోవడం దేనికి?—అవును, అతను రాగానే యెందుకిలా వున్నావని అనునయంగా, లాలనగా, అడుగుతాడని, ఆ తరువాత తను అంతకంటే దీనంగా అతని గుండెల్లో తల ఆన్చి కంఠానికి చేతులు పెనవేసి కళ్ళల్లోకి చూస్తూ పూసగుచ్చినట్టు అంతా వివరించి చెప్పాలనుకుంది. కాని, ఇంత విసురుగా వచ్చి కాట్లాడని కల్లోనైనా అనుకునివుంటే తలుపు బార వాకిలిగానే అట్టే పెట్టేది—

కొన్ని తావులలో ఆలోచనకూడా ఆవేశంగా మారగల ప్రమాదంవుంటుంది కాబోలు! అందుకనే తను అతనితో మాటకు మాట బుకాయించింది.

అయినా అతడికి తనపై యీ అధికారం యెవరిచ్చారు? అతడికి తను ఏమిటి? ఏమీ కాకపోతేనే తనపై యింతటి అధికారం నెరపగల్గుతున్నాడా? ఏమైనా అతను పురుషుడు, తను స్త్రీ - వీరి యిద్దరినీ సన్నిహితుల్ని చెయగలపాటి శాస్త్రీయమైన బంధం తమ యిద్దరిమధ్యా లేకపోవడం వల్లనే అతడిలా బాధ్యతా రహితంగా రెచ్చిపోతున్నాడా? తన జీవితంలో భాగం పంచుకొన్న మరో కర్తయెదుట యెవ్వడిలా గదమాయించగలడు? ఇంత ధీమాగా తలుపు తట్టే ఆ పని తనుమాత్రమే చేయగలనని తనపై నేరంమోపి అధికార కంఠంతో గర్జించగలడు? తన జీవితంపై, స్వేచ్ఛపైన, తన సర్వస్వంపైన—అతడికింత అధికారం యిచ్చింది తనేనా? అయితే యిప్పుడీ పశ్చాత్తాపం ప్రకటించుకుని లాభం?

ఇలా గతాన్ని గూర్చి పరాకుగా పరామర్శించుకుంటున్న ఆమె 'ఆ కాఫీ ఇలా అందుకో' అన్న అతడి అదిలింపుతో ఉలిక్కిపడి ఇటు తిరిగిచూసింది. అతడు పత్రికలోంచి దృష్టి మరల్చకుండానే

కాఫీకోసం చెయ్యిచాచాడు. తనవంక చూడడానికైనా అతడెంత ఔదాసీన్య మెందుకూ! నిర్లక్ష్యభావం యెందుకో?

అప్పటికి కాఫీగ్లాసు అందుకపోయేసరికి శూన్యంలో నే చెయ్యి చూసి లేస్తున్నాడతను. చూపుడువేలు అల్లల్లాడిస్తున్నాడు. అతడి భావం యేమైవుంటుందట? ఎంత గౌరవమిచ్చినా, మరెంతగా తన సర్వస్వాన్నీ అతడి కర్పించినా, దాసిగానే పేరంగా ఘాటుగా ఆదరణపూర్వకంగా సహించుకోవాలన్నంత ఉక్రోషం పొంగుకొచ్చింది ఆమెలో. పెదవిబిగించి పెదవుల కంపనం తోడయింది. ముఖ్యులకవ్వనప్పటి ఉక్కిరిబిక్కిరి లోంచి ఊపిరులు బయల్దేరినట్లు ఊహాలు వెలువడినయ్. 'అప్పటిదాకా అందించడానికి దాచికొను' అని. వెంటనే తమాయించుకోకుండా అతడిలా అన్నాడు. "అవును, కనీసం భార్యవుకూడాకాదు" - అప్పుడు తల పైకెత్తి ఆమెవంక తీక్షణంగా చూశాడు. 'అంతేనా?' అన్నట్టు. ఏదైనా మాట్లాడాలి - వద్దూ వుండాలి. ఆమె గంభీర ముద్ర వహించింది.

"అందుకే నిదానించి చెపుతున్నాను విను. ఒకొక్కడికి కొన్ని ప్రత్యేక అలవాట్లు ఉంటయ్. వాట్లను గమనిస్తూ యెదటి వాళ్లు పోతూవుంటే మన బ్రతుకులు సాఫీగా సాగిపోతయ్, లేకుంటే..."

"ఏమిటి నువ్వు సాధించేది? తలకొట్టి మొలవేస్తావా?"— ఒక్కక్షణకాలం ఉభయులూ ఒకరినొకరు చూసుకున్నారు. అతిపిచూపులు కొంచెం కరుకెక్కినయ్. వెంటనే పత్రికలోకి తలదించేసుకుని, మామూలు గాంభీర్యం తెచ్చుకుని - "ఈవాక్యాన్ని సరిగా నువ్వు ఉద్దేశించినరీతిగా పూర్తిచెయ్యగలను, కానీ నా మాటను సాగదియ్యాలనే ప్రయత్నం మానుకో! ఎందుకంటే, వ్యతిరేకార్థం వస్తుంది. నా అంతర్యాన్ని సరిగా తెలుసుకోలేక కుర్రతనాన్ని వొలకబోసుకుంటున్నావ్. నీకు పెళ్లి కావాలనుకుంటే నాకంటే భార్యల్ని సుఖపెట్టేవాళ్లు చాలామంది దొరికే వారు. వాళ్లెవ్వరూ నీమనస్సుకి నచ్చకపోబట్టే నాలాంటివాణ్ణి యెన్నుకున్నావ్. ఒకరినొకరు అర్థంచేసుకున్న భార్యాభర్తలు కొద్దిమందే వుంటారు. చాలామంది గత్యంతరంలేక కొంతకాలానికి అలవాటుపడిపోతారు. అంతకంటే మన సంసర్గం యేమీ తీసిపోలేదు. లేనిపోని తెలివితక్కువభావాల్తో తల పాడుగొట్టుగోకు!" —ఆమె ముఖకవళికల్ని గమనించడానికికాబోలు, తల పైకెత్తి అలవోకగా చూశాడు. ఆమె పలకలేదు, ఉలకలేదు.

"ఏం గడచినగాథలన్నీ నాచేత వాగించాలనా? ... తిరిగి సూటిగా అడిగాడు. "అక్కర్లేదు, అని కచ్చగా తలత్రిప్పడంతో, తలలో చన్నినిపాయతీసి వొయ్యారంగా అమర్చుకున్న సంపంగి పువ్వు భుజంపైబడి, పైట మీదుగా క్రిందకుజారి కాళ్లముందు పడింది. చటుక్కున అతడు దానిని చేత్తో తీసుకుని రేకలు సవరించుతూ ముక్కుకు సూటిగా చేర్చుకుంటున్నాడు. అతడి ముఖంలో యేదో అవ్యాఖ్యయత తృప్తి రేఖామాత్రంగా మొదగల్గిందామె.

జరిగిన్నదానిని అతను చెప్పేకన్నా యథార్థాలని మనసు నాదాత్మ్యం పలుకులూ హృదయాన్ని వొప్పించుకోమని నిర్బంధిస్తోంది.—

అవును.—అసలు సులకసగా అతి డెన్నడూ చూపలేదనేది నిజమే. అన్ని చేసంతే తను చెప్పాలనుకుంటున్న మాటలు అతను చెప్పడం. తను నోరెత్తిలేకపోవడం బలహీనత! అతను ముమ్మాటికీ స్వార్థపరుడే అయితే, తన పవిత్రాయిని లెక్కచెయ్యని వాడే అయితే, అమ్మన్న తాను సృష్టించిన నారింగోజులు కదలలేక పోయినప్పుడు, అతనూ ఆఫీసు మానుకుని చాకిరి చెయ్యాలా? తను దైనందిన విషయాల్లో యెంతగానో సరిమితిమాతూవుంటే అవన్నీ మాన్పి జీవితంలో నోక తీరైన స్థైర్యం యేర్పరచలా? తన వ్యక్తిగత విషయాన్ని గురించి లలి డెప్పుడైనా పట్టించుకున్నాడు? ఒక నాటి రాత్రి అతడి మనసు పరీక్షిద్దామని, తను బాగా అలంకరించుకుని తనకోసం వొక ప్రత్యేక పేటవ్రంటూడిని పిల్చిపోతూవుంటే అతడేమీ మారుపల్కలేదు? ఈనాటికీ అలాగే వున్నాడు. అది అతని స్వభావమా? పెచ్చుపెరిగిన స్వార్థమా? ఏమీ తేల్చుకోలేక, సమాధానపడ్డానికి యిష్టంరాక అహం అడ్డొచ్చి ఆమె అలాగే వూరుకున్నది.

అతడు తిరిగి తలెత్తి ఆమె ముఖంలోకి పరకాయించి చూశాడు. తనమీద పట్టలేనంత ఉక్రోషంతో బుంగమూతి పెట్టి ఏమీ అనలేక లోలోన మథనపడుతున్నట్టు ఆమె రూక్షేక్షణం వివరించినట్లయింది. తనూ అలాటి పట్టుదలకేపోయి మాటా మంతీ లేక వూరుకుంటే యెప్పటికి తెల్లవారను? ఆ గభీర నిస్తబ్ధత మరింత దుస్సహమనిపించిం దతనికి? అయినా తన కెందుకీ అర్థంలేని అహంభావం? ఎందుకీ మూగనోము?

పేపరు టుంబంమీద వేసి చటుక్కున అక్కణ్ణించి లేచాడు. అతడి ముఖంలో యెన్నడూలేని తేటదనం వెల్లివిరిసింది. క్రింది పెదవి మునిపంటితో నొక్కుతూ వోరగంటితో ఆమెవంక చూశాడు. అతని పాదాలు ఆమె ప్రక్కగా నడిచినై; అతని బాహువులు ఆమెను అలుముకున్నయ్; అతడి రెండు కళ్ళూ ఆమె కళ్ళల్లోకి తొంగిజూసి లోతులు వెతుక్కుంటున్నయ్, కదిలే పెదవులు, స్పర్శసుఖంతోపాటు మాటల సొంపునుకూడా వెలువరించి పైకొన్ని మమతగామార్చే ప్రయత్నంలో ముప్పొవను అలవర్చుకుంటున్నయ్; ఒక చెయ్యి పట్టువిడి పంపలమీంచి చుబుకం మీదుగా హృదయంపైకి జారి భావోద్రేకం చెప్పే ధణితుల్ని లెక్కపెడుతోంది. "ఏం నే నేమన్నానని? నీకంత కసి? ఉన్న మాట అంటే...."—దరాల్ని అతణ్ణి విదిలించుకోవాలని ప్రయత్నించింది. అతని చేతిపట్టు వీడనందుకు, తను పరాజిత అయినట్టు తన అబలత్వాన్ని తల్చుకుని మరింత గిజగిజలాడింది. చెయి కొరికి 'అయినాసరే విడిపించుకోవాలనుకుంది. కాని గాయమౌతుందనే ఆలోచన కలగడంతో గుండె గతుక్కుమని, ఒక్కసారి యెక్కడిలేని అలసటావచ్చి వేళ్లాడిపోయింది. హృదయం మరింత వేగంగా కొట్టుకొనసాగింది. గుడ్లల్లో నీళ్లు తిరిగాయి, తనమీద తనకే అసహ్యం వేసింది. ఛీ. ఎంతచులకనయ్యాను, అని కొండంత బరువుతో ప్రశ్నించుకుంది.

ఒక్కక్షణం అలా గడిచాక అతడామెనువదలి సరాసరి ఫ్లాస్కు తీసి కాఫీ కప్పునిండా పోసుకుని చప్పరించుతూ ఇటుకేసి దీక్షగా చూశాడు. ఆమె అక్కణ్ణించి కదిలి అతడిమొహంలోకి చూడడానికి సిగ్గయి అటు పెడగా తిరిగి నిల్చున్నది. మరోగ్లాసు నింపి ఆమెనోట కందిస్తూ," అనిశ్చితత్వం ఆట్టేసేపు భరించలేనని తెలుసుగా! పడిపడికాఫీ చప్పరించి, మనసు చల్లబర్చుకుని, మామూలులోకంలోకెదిగి. మన సంగతి ఆలోచిద్దాం!" అన్నాడు. ఆమె సిగ్గుతోనూ, పశ్చాత్తాపంతోనూ క్రుంగిపోయి నోట మాట పెగలిరాక ఊరుకుంది; ఆప్యాయంగా నోటి కందించిన కాఫీ తాగలేకపోయింది. - కాళీ గ్లాసు బల్లమీద పెడుతూ 'ఏం కోపం వచ్చిందా?' అని సాగదీస్తూ అడిగింది. అది 'తెలివితక్కువ ప్రశ్న' అని ఆమెకు తెలుసు. అతనికి నిజంగా కోపంవస్తే యింతదాకా రానివ్వడనే సంగతీ తెలుసు; కానీ, హృదయావేగం కొంత చల్లారినందువల్ల, ఆక్షణంలో అతణ్ణి ఆప్రశ్న అడిగి సమాధానం రాబట్టడం, అతనియెడల తన హృదయాంతరాళంలోవున్న మక్కువకు తార్కాణంగా భావించవచ్చు ననుకుంది. - అతడు ఏమీ చెప్పక సూటిగా మంచంమీదకువెళ్ళి పత్రిక చదవడంలో నిమగ్నుడయాడు.

తిరిగి యే నెపంపైన అతణ్ణి పలకరించి సన్నిహితుణ్ణిచేసుకోవాలో ఆమెకు తోచలేదు. అతడెంతసేపైనా అలాగే కూర్చోగలడనుకుంది. పంతం నెగ్గించుకోవాలనే పట్టుదల సడలాక అతడికి దూరంగావుండి పలకరించడం, ఉత్తుత్తిసమాధానాలతో కాలం వెళ్ళబుచ్చడం, మరింత దుర్భరంగా తోచింది. రెండడుగులు ముందుకు నడిచి, కొంచెంత అనుమానంతోనూ, భయంతోనూ వెనక్కుతగ్గి ఒక చేత్తో బల్లపై బడివున్న వస్తువులు సర్దుతూ అలాగే నిలబడిపోయింది.

అతడంటే తన కీక్షణంలో అంత జంకు యెందుకు కలగాలి? రోజూకంటే అతడిలో యీనాడు కనిపించేవైలక్షణ్యం యేమిటి? అతడిమొహం రోజూలా చిరునవ్వు చిందించుతూ తనను అటుకేసి ఆకర్షించుకోవడం లేదా? ఎందుకనో మరింత గంభీరమై కొట్టొచ్చినట్టు కానవస్తోంది. ఇదంతా అతడిస్వార్థమేనా? అని మరో సారి ప్రశ్నించుకుని కాదు, అన్నట్లు తలూగించుకున్నది. 'ఇలా రా!' అని అతడు పిలుస్తాడేమో అని. ఇవ్వాళ ఇలా యెందుకు ఉన్నావని అడుగుతాడని, తనమాటలు విని ఓదార్పుగా తల నిమురుతూ యింతమాత్రానికే బేలనైపోవాలా? అని బుజ్జగించి బుగ్గలు నిమురుతూ కళ్ళల్లోకి లోతుగాచూసి ప్రగ్గత్తికతో దైన్యం ఒలకబోస్తూ మాట్లాడగలడని, ఇంకా యేమో ఆశించింది, కాని, ఇందాకటి మాటలకంటే యీ మౌనం మరింత భయావహంగా తోచింది.

వణికే చేతులతో ప్రక్కనున్న వాలుకుర్చీ లాక్కుని భారంగా కూలబడింది. ఎంతోసేపు అతని మొహంలోకి చూస్తూ అంతులేని ఆందోళనతోనూ ఉక్కిరిబిక్కిరిచేస్తున్న ఆవేశాలతోనూ అల్లాగే వుండిపోయి తమ పరిచయం ఆదిగాగల విషయాల్నిగూర్చి సింహావలోకనం చేసుకుంటున్నది—

—అతని మంచితనం, మాటనేర్పు, కళ్ళల్లో లోతైన భావాలతో కూడిన ఒక ప్రత్యేకాకర్షణగల అతని మొహం బలిష్ఠమై పొంకంగావున్న శరీరం, అతనికున్న విజ్ఞానం, ఇతరులపట్ల అతని కున్న సానుభూతి, ఒక నియతమైన మార్గము ఆదర్శము లేకుండా అతడు గడుపుతున్న జీవితం ఎప్పుడూ వ్యక్తపరచే అతడి సంతృప్తి తనంటే అతనికున్న అభిమానం, తనపై మెండుగా అతని ఆకర్షణ, దాపరికాలు లేకుండా తననిగూర్చి అతను చెప్పుకొనే నిజాలు— వీట్లలో తన నేది ఆకర్షించింది? ఏ వొక్కటీకాదు; అన్నీ ఆకర్షించి వుంటయి. వీట్లను ఆధారంగా గొని అతడికి మరింత సన్నిహితురాలుగా వుండాలనే క్షణం క్షణం అనుకుంటూవచ్చింది.

హఠాత్తుగా తనను ఇక్కణ్ణించి బదిలీచేయ బోతున్నారని మధ్యాహ్నం తన స్నేహితురాలు వసుంధరవచ్చి చెప్పివెళ్ళడం జ్ఞాపకమొచ్చి ఉలిక్కిపడింది. అమ్మయ్యో, నా కిక్కణ్ణించి ట్రాన్స్ఫరే? అన్నంత భయవిహ్వలమైన ఆవేశంతో గుబగుబలాడింది. వెన్నువ ఝల్లుమని చరచినట్లయింది. రెండుకాళ్ళూ పైకి ముడిచి చేతులతో బంధించి పెనుగాలికి అల్లల్లాడే గువ్వలా వణికిపోతూంది. పెదవులు నల్లబడి, వెచ్చదనంకోసం వెంపర్లాడే పసిపాపలాగ గజ గజ లాడిపోతోంది.

మరోక్షణంలో పట్టుతప్పి పక్కపు వొరిగిపోయేదే, కాని అతడప్పుడే తలెత్తిచూడడం, ఆమె దైన్యావస్థను గుర్తించి 'సుందరీ!' అనే పిలుపుతోపాటు చివాల్న ముందుకువాలి రెండుచేతులా ఆమెను కమ్ముకోవడం జరిగింది—

"రాధా, నన్ను క్షమించవూ?" అంటూ తన రెండుచేతులా అతని వెచ్చటి నుదుటిని తన నుదుటిపై నొక్కుకుంటూ కరుణావిలంగా కళ్ళల్లోకి చూస్తూ అడిగింది సుందరి.

"ఎందుకని? నువుచేసిన పొరపాటు నాకు చెప్పడానికి భయ మెందుకు? "అని గంభీరంగా వోదార్చుతూ వెన్నువ చేత్తో రాస్తున్నాడు రాధ; అతడి పూర్తి పేరు రాధాకృష్ణమూర్తి.

తన చెంపను అతడిచేతి కందిస్తూ చెయి గట్టిగా పట్టుకుని; 'నన్ను మద్రాసుకు బదిలీచేస్తారని ఆఫీసులో అనుకుంటున్నారట' అన్నది సుందరి. అతడు కళ్ళువిప్పి ఆమె మొహంలోకి పరకాయించి చూసి "అందుకనా యిందాకణ్ణించీ అంత దిగులుగా కూర్చున్నావు! ఏం ఎవరన్నారామాట? మద్రాసు వెళ్ళడం నీకు ఇష్టం లేదా?" అంటూ ఆమెను మరింత దగ్గరకు గుంజుకున్నాడు. 'నాకింకా రూఢిగా తెలియలేదు, కానీ, ఇక్కణ్ణించి ట్రాన్స్ఫర్ చెయ్యబడేవార్ల జాబితాలో నేనూ వున్నానని మాత్రం తెలుసు. అందుకనే భయంగావుంది. నిజంగా...' అని వాక్యం పూర్తి చేయడం అమంగళంగా తోచి అంతటితో వూరుకున్నది సుందరి.

'సరే కానీ, ఎంత ప్రాప్తమో అంతే' అని పొడిగా బదులు చెప్పి వూరుకున్నాడు రాధ. సుందరికి పట్టలేనంత దుఃఖం పొర్లుకొచ్చింది. తను బదిలీగురించి యింత ఆందోళనపడుతుంటే ఒక్క వేదాంతం ముక్క అని వూరుకున్నాడని.—అవును అతని కెందుకుంటుంది ఆదుర్దా? తను లేకపోతేమాత్రం అతనికేం కొదవ! తనలాంటివాళ్ళు అతనికి అరుదు కాదు. అతని తత్వం యెప్పుడూ యింతే. దేనిని లోతుగా ఆలోచించడు—

అసలతని జీవిత విధానమే అంత. తనలాగే యితర్లని తేలికగా గాలి వడగల క్రింది కష్టాలుకి వదలాలని చూస్తూవుంటాడు. అయినా తన లాగే యితరులూ బాధపడాలనుకోవడం తెలివితక్కువ కాదూ? తనకు ట్రాన్స్‌ఫర్ చేసింది యెవరు? చేయించింది యెవరు? ఆ విషయం వసుంధర తనకు పనిలేక్కా చెప్పివెళ్ళాలి మెందుకు? దాని మొగుణ్ణే మద్రాసునించి యిక్కడకు వేయించడానికి వాళ్ళ నాన్న పలుకుబడి అంతా ప్రయోగించి నందిని పందిని చెయ్యలేదూ? అతగాడు ఇక్కడకు వస్తే యిద్దరూ కలుసుకుంటూ అన్నగారి మేడపైన కాపురం వెలిగించాలని కాదూ దాని దుర్బుద్ధి?—

వసుంధరను గురించి తను పొరపాటు ఊహించుతున్న నేమో... విశ్వేశ్వరంపు గాని కాదు. తనూ అతనికి చేరువలో వుండాలనుకోవడం దాని తప్పా? విధార్య భర్తతోపాటు సుఖంగా ఉండాలని వాంఛించదు? తను ఇక్కడే శాశ్వతంగా వుండాలని యెందుకనుకుంటున్నది? తనకు రాధ యెవరు? ఈ ప్రశ్న పొటమరించడంతో గిజగిజలాయి అతణ్ణి మరింత గాఢంగా హత్తుకుని తన ఆత్మీయతను నిరూపించుకోవాలని చూసింది. కాని అతని నోటి వెంట సాంత్వనంగా మరోమాట వెలువడలేదు—

ప్రతిప్రాణికీ అప్పుడప్పుడూ యితరుల సానుభూతి అవసరమౌతూవుంటుందికాబోలు. తను ఈ స్థితిలో అతని సానుభూతిని ఆశించింది. వాచా అది పొందకపోవడంతో మనసు మరింత ఉద్విగ్నమైంది. ఆమె కన్నీళ్లు అతనిగుండెలకు చల్లగా తగిలినయ్, జాలిగా నవ్వుతూ ఆమెవంక ప్రశ్నార్థకంగా చూశాడు.

'నేనింతగా కుమిలిపోతూవుంటే నీకు చీమకుట్టినట్లయినా లేదు, అంటూ అమాయికంగా అతనికేసి చూసింది. ఇంకా యేదో చెప్పుకోవాలనుకొంటున్నట్టు పెదవుల కదలికవల్ల గ్రహించాడు రాధ. వెంటనే ఆమెను అటు ఒత్తిగిలించి, "ఇందులో బాధ పడవలసింది నాకేమీ కనుపించలా. మద్రాసు ఈవూరికంటే బాగుంటుంది. అక్కడవుంటే సత్కాలక్షేపానికి, విజ్ఞానోపార్జనకు, మంచి అవకాశం. ఇంక ప్రశాంతిట అంటావా?, అది కొని తెచ్చుకొనేదికాదు. పోతే...నాసంగతంటావా..., కాస్త ఆగాడు. ఆమె ఆతురతతో అతనివంక జూసింది, తనసంగతి యేమిచెప్తాడో అని. రాధ ఒక్కక్షణం దీర్ఘాలోచనలోపడ్డాడు. ఏమి చెప్పాలా అనికాదు; ఎలా చెప్పాలా అని. మళ్ళీ తలెత్తి చూశాడు. అనునయంగా చెప్పవలసిన అవసరం గ్రహించినట్లున్నాడు. ఇలా ఉపక్రమించాడు,

'ఇంకా కొంతకాలంవరకూ మనం విడిపోయేటప్పటి యీబాధ తాత్కాలికమైనదే అవుతుందని నా నమ్మకం. నా అనుభవాన్ని బట్టి చెబుతున్నాననుకో! నాకంటే నువు యెక్కువబాధ పడుతున్నావు. కానీ, క్రమంగా కొత్తవాతావరణానికి అలవాటు పడిపోతావు. ఇంక యీరాత్రికి జాగారం చాలుగానీ, యిక్కడ వుండే నాలుగురోజులూ వృథాచేయవద్దు, నీ బదిలీసంగతి నాకూ మధ్యాహ్నమే తెలిసింది." అని వూరుకున్నాడు రాధ.

"అయితే నువ్వెప్పుడూ నాకు మల్లేబాధపడలేదా యిలాంటి అశాంతరాత్రుల్లో?" పసిపాపలా అడిగింది సుందరి—"పిచ్చిదానా, నేనూ మనిషినే అందరికీవుండేభావావేశాలే నాకూ వున్నయ్. ఎన్నింటికని ఏడవనూ? బాధపడే తీరుబాటుకూడా లేకుండా కొత్త బాధలు వచ్చిపడుతున్నయ్. వాటిని తట్టుకోవడానికి కావలసిన గుండె నిబ్బరం పరిస్థితులే చేకూరుస్తున్నయ్ ఇంతవరకూ. కాని, భవిష్యత్తులో యెప్పుడో యిలాటి అలవాట్లకు శాశ్వతంగా పరిష్కారం చూసుకుంటాను. నిజంగా నేనుపడ్డ పడుతూన్న మానసికబాధలు నీకేం తెలుసు? ఏదో చెయ్యాలనుకుంటాం మరేదో చేస్తాం, కాలప్రవాహంలో కొట్టుకుపోతూవుంటాం: అందుకనే దక్కినంతే చాలుననే తృప్తి యెప్పుడూ వుంటుంది నాకు. నువ్వూ దానికి అలవాటుపడితే మనస్సు కొంత కుదుటపడుతుంది"—అతను మాగన్నుగా అటు వొరుగుతున్నాడు. అతను తననించి దూరమైపోతాడన్న భయం అంకురించగానే ఆమె మరింతదగ్గరగా జరిగి అతడిమీద చెయివేసింది, జంకుగా. కాని ఇవాళ అతనెందుకనో చిరాకుపడినట్టు లేదు. కొంతసేపటివరకూ తన భవిష్యత్తును గూర్చిన ఊహాగానాల్లో కాలం గడిపింది. బల్లమీద గడియారంలో ఒంటిగంట అయింది. సుందరి మెల్లిగా లేచికూర్చుంది. అతడు గాఢనిద్రలో వున్నాడనుకొందిలావుంది, మితిమీరిన ఆవేశంతో ఆప్యాయంతో అలసిగుండెల్లో చెయివేసి నిమురుతూ మొహం దగ్గరగాజేర్చి అతనిమొహంలోకి చూసింది. ఆతొందరలో తన పెదవులు అతడి బుగ్గలకు తాకడంకూడా గమనించలేకపోయింది. మూసినరెప్పల్లో కనుగ్రుడ్లు కదులుతున్నట్లయి కొంచెం సిగ్గుపడింది. తను ఇంతగా యెన్నడూ చొరవతీసుకుని యెరగదు. 'మేలుకొనే వున్నావా?' అని గాభరాగా అడిగింది సుందరి. ఆఁ...ఏదో కలొచ్చింది, ఆలోచించుకుంటూ యీలోకంలోకి వస్తున్నాను, అన్నాడు రాధ కన్నులు తెరవకుండానే. 'నన్నుగూర్చేనా?' అడిగింది సుందరి; తన ఆదుర్దానుగురించి అతడు నవ్వుకుంటాడేమో అని అనుమానించుకూనే. 'ఊఁ...' అని పెదవులు కదల్చకుండానే చిరునవ్వు నవ్వాడు రాధ.

'ఏమిటి?' అన్నది సుందరి — 'పడుకుండూ, ఇంకా యెంతసేపు మేల్కొంటావ్? నిన్నుగురించె కలొచ్చింది. దానినిగురించే ఆలోచించుకున్నాను మెలకువగా, అన్నాడతను. అమాయకంగా ఆనంద నివశురాలయిందామె. 'ఈరోజు నేను మర్చిపోలేను యెప్పటికీకూడా, అన్నది. 'బాగా ఆలోచించుకుంటే జీవితమూ ప్రతిరోజూ అంతే' అన్నాడతను. నిజమే ననుకున్నది సుందరి; గుండెల్లో బరువు సగం తగ్గినట్లయింది.

## 2

ఉదయం నిద్రలేచే సరికి మంచంమీద కూర్చుని అతడేదో పుస్తకం చదువుకుంటున్నాడు. 'అప్పుడే లేచావా", అన్నది సుందరి, కుప్పెళ్లు బిగించి, నడుము సాగేటట్లుగా వొళ్లు విరుచుకుంటూ - "బాగుంది నీకు మల్లే నాకూ కాలం విలువ తెలియక పోలా, అవసరాలు తీర్చుకురా, టిఫెను కాఫీలు తెచ్చాను, అన్నాడు రాధ, ఆమెవంక అదోలా విలక్షణమైన భంగిమలో చూస్తూ "ఎందుకు కాఫీ. నేను కాచియిచ్చేదాన్నిగా" అన్నది సుందరి అతనివంక తృప్తిగా చూస్తూ.

"ఈ నాలుగు రోజులూ యిస్తూ అక్కడే కష్టపెట్టి వుంచుకోవాలా," అన్నాడతను.

"పాపం రోజూ వేళ్ళకి కాఫీ అందియ్యకపోతే సతాయించే మనిషికి యివ్వాళ అమాంతంగా యింత జాలికల్పించేసా?" అని, అందామె లేచిపోతూ సోఫాచేతిమీద ఆనుకుని.

"వస్తువు అంగడిలోంచి తెచ్చుకున్నప్పుడు చాలా విలువ పెరుగుతూ వుంటుంది." అన్నాడతను గంభీరంగా నవ్వుతూ.

"నువ్వెంత మంచివాడవు," అందామె, అతని కొసరుగా వచ్చి మోకాళ్ళపై రెండుచేతులూ ఆన్చి.

పుస్తకం ముఖం ముందునించి పక్కకు జరిపి, "నాలో మంచిగుణాలు ఇంచుమించు సమపాళంలోనే మేళవిస్తున్నాను" అన్నాడు రాధ సిద్ధాంతం నెలవరించే ధోరణిలో.

"ఒకళ్ళ మంచిగుణాలు నిర్ణయించాల్సినవాళ్ళు ఇతరులు అనుకుంటాను" అంటూ కనుబొమలు పైకిలాగి ఇప్పటికి మొదటిసారిగా విజయగర్వం ఉట్టిపడేలా ముఖం పెట్టింది సుందరి.

"అది పొరపాటు, దొంగతనం చేసేవాడు అది తప్పని తెలిసే చేస్తాడు, అయితే తెలిసికూడా అలా చేయడానికి గల కారణాలు అంతర్యాలు చెప్పడం ఇప్పుడు పనగు. మంచిపనికూడా అలాగే గ్రహించుకుని చేస్తాడు, కనీసం అది తన ధర్మం అనుకుంటాడు. సరే మంచిగుణాల్ని గురించిన మీమాంసచాలు గాని, బజారుకెళ్దాం తొందరగా తెములు!...అంటూ మళ్లీ పుస్తకంలోకి దృష్టిపోనిచ్చాడు—

—బజార్లో అతనితో షాపుకి వెళ్ళడానికి మొదట కొంచెం జంకింది. కాని తరవాత గర్వపడింది. "ఏమైనా యింత గౌరవంగా వెంట పోగలగడానికి అతను తనకేమిటి?" అన్న బాధ అడుగడుగునా వేధించుతూనే వున్నది.—షాపువాళ్లు అతనిపట్ల చూపిస్తున్న అభిమానం, వాళ్లు అతనికిచ్చే గౌరవం చూసి ఆశ్చర్యపడింది. బైట కొచ్చి "నువ్వంటె వాళ్ళకంత గౌరవం యేలా వుంది?—అయిన కాడికి గుడ్డలు కొనడానికి మీరంత భాగ్యవంతులు కాదన్నావుగా!" అన్నది సుందరి అతని ప్రక్కగా నడుస్తూ.

"అదా నీ సందేహం! డబ్బునిబట్టి వచ్చే గౌరవం వేరు; వ్యక్తిగతమైన గుణాల్నిబట్టి వచ్చే దింతకంటె ఘనది. పైగా నీలాంటి అందమైన అమ్మాయి చెలికత్తెతో గడప త్రొక్కగానే గవర్నరు హోదాతో సమానం అనుకుంటారు కొందరు మూర్ఖులు" అన్నాడు రాధ, తల అటు త్రిప్పకుండానే. వాక్యం చివరి భాగం ఆమెను కొంచెం బాధించింది. అతను చెప్పినట్లుగా అన్ని కావాలంటే సన్నకారుకి యేలా లభ్యమౌతయ్? అతనిప్రక్కగా నడుస్తున్నది సుందరి పరధ్యానంగా. చీరకుచ్చెళ్లు కొంచెం చెప్పుకాలిలో యిరుక్కున్నట్లై ముందుకు తూగి చేత్తో అతణ్ణి కామకుంది. "దారి చూసుకు నడు!" అంటూ తల త్రిప్పకుండానే హెచ్చరించాడు రాధ.

—ఇంటికి వెళ్ళాక మళ్ళీ వోసారి బట్టలన్నీ చూసుకున్నది. డబ్బు సంగతి జ్ఞాపకం వచ్చి, "నా పర్సు విప్పినట్లుంది—అంత డబ్బా......"

"అప్పుడు నేనే యిస్తానుగా" అన్నాడతను. చేతులు వెనక్కి కట్టుకుని ఏదో ఆలోచించుకుంటూ యిటూ అటూ పచార్లు చేస్తున్నాడు.

"నువ్వు ఇబ్బంది పడతావేమో..." సుందరి.

"పరవాలేదు, ఈ దఫాకి నేనే కొనిపెడ్తాను" రాధ.

"మరెవరూ అనుకోకపోతే వొక్కమాట..." ప్రశ్నార్థకంగా అతనివంక చూసింది సుందరి.

"ఏమో అనుకుంటారని చెప్పవల్సినది చెప్పకపోవడం యెప్పుడూ మంచిదికాదు" అన్నాడతను పచార్లు చేస్తూనే.

"ఈ పూట మన యిద్దరికీ యిక్కడే వంట చేస్తాను" అన్నది సుందరి అతనికి యెదురుగా వచ్చి సంకోచిస్తూ.

"ఛీ...తప్పకుండాను. నువ్వు వండనూ వచ్చు, నేను తిననూ వచ్చు, అయినా వొకరింట్లో లేని అంతులు, అభ్యంతరాలు మరొకరింట్లో వుండవు నాకు. నువు వెళ్ళేదాకా యిక్కడే భోంచేస్తాను నీకంత ముచ్చటగా వుంటె. కాని, నేను శాకాహారిని మాత్రమేనని తెలుసుగా!" అన్నాడు కొంటెగా చూస్తూ. తన పైనించి మరో బరువు దించేసినట్లయింది సుందరికి.

అన్నం వడ్డించనా? అన్నది సుందరి వంటయింటి గుమ్మంలోనించి. అంతలోనే తన గొంతు మాటలతీరూ అలాగా మారిపోవడం చూసుకుని, ఆశ్చర్యపడింది. కాని, యీ వ్యవహారం చాలా పరిమితమనే సంగతి తెల్సుకున్నప్పుడు గుండెల్లో గతుక్కుమన్నట్లయింది. వెంటనే రాధ తనకు యెవరు? అన్న అనుమానంతో పాటు తెలియని ఆవేశం కమ్ముకున్నది. వెంటనే నిభాయించుకుని వడ్డన పూర్తిచేసి మరొకమారతణ్ణి పిల్చింది.

ఆమెకు అన్నం సయించడంలేదు. అతనుమట్టుకు దీక్షగా తల ప్రక్కకు తిప్పకుండా పట్టించుతున్నాడు. "వంట బాగుందలా?" ఎందుకు అడిగానా అని నాలుక కరుచుకున్నది.

"ఆఁ ..కాలేకడుపుకి మండేగంజి. అయినా చేతనైనంత వరకూ యేలోటూ జరగనేలేదు" అన్నాడు రాధ, తలెత్తకుండానే. ఆమె భోజనం యెక్కడిదక్కడే వుండిపోయింది. ఎంతో సేపటివరకూ అతని వంకకు చూస్తూవుండడంతోనే సరిపోయింది. ఏదో తెలియని అలసట, ఆవేశం ఆమెను నిలువెల్లా కమ్ముకుని అన్నం గొంతు దిగనిలేదు. మధ్యాహ్నం యేదైనా తెప్పించుకు తినవచ్చునని తృప్తిపడి వూరుకున్నది.

తీరుబడిగా మంచంపై నడుంవాల్చి సిగరెట్టు ముట్టించాడతను. వంటయింట్లో పని పూర్తిచేసుకుని బట్టలు మార్చుకుని అతని యెదటికి వచ్చింది సుందరి.

"అయితే యింతకాలం నువ్వెందుకు పెళ్లిచేసుకోలేదూ?" అంటూ సూటిగా అడిగింది వక్కపొడి డబ్బా చేతికిస్తూ.

"ఒళ్లు పొగరెక్కి—, అన్నాడతను.

"అయితే కానూవచ్చు" సుందరి చటుక్కున నాలుక కరుచుకున్నది.

"నేను నిజమే చెప్పాను, అన్నా తనను, మంచంనించి లేస్తూ—ఆఫీసుకు పోతున్నాను వీలుంటే సాయంత్రం వస్తా, లేక పోతే రేపు కనిపిస్తా" అంటూ చెప్పులకు చెయ్యి పెట్టుకుంటున్నా డతను.

"ఏం పాలుపోనట్లుగా నీ బస యిక్కడే అన్నావుగా మరి, రాత్రి భోజనం..." మాట సగంలోనే అందుకుని, "అవును అన్నాను, ఇప్పుడు జ్ఞాపకానికి వొచ్చింది, మా మేనేజరుగారు ఇవాళే సినిమాకు రమ్మన్నారు. బహుశా భోజనం యేర్పాటు కూడా అక్కడే జరుగుతుంది." అన్నాడు రాధ—అడుగు ముందుకు వెయబోతూ.

"మరైతే..."

"రేపు ఉదయాన వస్తాను ఏం?...అన్న అతడి ప్రశ్న సుందరి చెవులకు కొంచెం కటువుగానే తోచింది. అతడు గడసరి వాడు. ఎంత సన్నిహితంగా వుండాలని ప్రయత్నించుతున్నా యేదో వొక మాటలో తనను దూరానికి నెట్టివేస్తూనే వున్నాడు. అతడు చెప్పింది నిజమేనా? నిజానికి తనపై అంత మమకారమేవుంటే సినిమాకు వెళ్లడం మానేసి యిక్కడికే రారాదూ? ఆమాట మొహంయెదటనే అడిగితే యేమనుకుంటాడో...కానీ, అతను రోడ్డుమలుపు తిరిగి పోయాడు—

తలుపుకి తాళంవేసి ఆఫీసుకు వెళ్లుతూ తీరుబడిగా ఆలోచించుకున్నది సుందరి. 'అతడు చెప్పింది నిజమే నేమో...సాధారణంగా అబద్ధం ఆడడు. కాకపోతేమాత్రం తనేం జెయ్యగలదు? అతడే చెప్పినట్టు ఎంతదక్కితే అంతే ప్రాప్తమనే నిబ్బరంతో కాలక్షేపం చెయ్యాలేమో...

—ఆరోజు నిజంగానే సుందరి ఆఫీసులో కాలుపెట్టేసరికి నమ్మలేనంత యింద్రజాలం ప్రత్యక్షమయ్యింది. తను రోజూ కూర్చుండేకుర్చీదగ్గిర వసుంధర మొగుడు విశ్వేశ్వరరావు కూర్చుని బల్లపైవున్న ఫైల్లు తిరగవేస్తున్నాడు. అతడికీ అధికారం యెవ్వరిచ్చారు? నిర్ఘాంతపోయి గుమ్మంలో చేరబడినిల్చుంటే అయ్యగారు పిలుస్తున్నారని జవాను వార్త అందించాడు. ఆఫీసరువద్దకు నేరుగావెళ్లి, అతడికి ఛార్జీ వప్పగించి, బదిలీ కాయితం చేతబట్టుకుని ఒక్కదణ్ణం పెట్టి తిరిగి వస్తూవుంటే టీపార్టీ, అన్నాడెవడో...

విశ్వేశ్వరరావు ఇన్నాళ్లకు ఇక్కడకు రాగల్గినందుకు ఆఫీసు స్టాపుకంతకీ యీనాటి అపరాహ్ణంలోనే తేనీరు ఇప్పించబోతున్నాడట! ఇంకానయం! తను వెళ్లిపోతున్నందుకు కాదుగదా!! పిల్లికి చెలగాటము, ఎలుకకు ప్రాణసంకటమూను—

—కాళ్ళీడ్చుకుంటూ యింటికివచ్చి మంచంపై నడుం వాల్చింది సుందరి. వచ్చేదాకా రావాలన్న తహతహేగాని, వచ్చి యేంజెయ్యాలో తోచడంలేదు. ఈ యేకాంతం మరింత ఖంగారుగాను, భయావహంగాను ఉంది. అయిదుసార్లు గడియారంవంక చూసినా రెంటికి పదినిమిషాలుంది. అతడెప్పుడువస్తాడో...తనూ అతడి ఆఫీసుకి వెళ్లివుంటే...ఇంకేమైనా వుందా? తన తొందరపాటుజూసి అతడు కంటగించుకుంటే...అసలే తెలివితక్కువ జరిగిపోయింది. తన ఆఫీసునుంచే నేరుగా అక్కడికి వెళ్లివుంటే... ఎందుకీ ఆత్రత?—తనకు బదిలీఅయిందికదా అని అతడికి చెందరాల్లే యింటికివెళ్లే 'పర్మిషన్' వస్తుందా? అక్కడవుంటే మరీ పిచ్చి ఎక్కేటట్టుంది. ఎక్కడో ఏదో ఎడారిలో ఒక్కర్తే వుండిపోయినట్లనిపించింది. ఇంక అతణ్ణి గురించి ఆలోచించడం మాని తన ముందు కార్యక్రమం నిర్ణయించుకుంటే...—మనసు మెదడుపైన టప్పున రెచ్చకొట్టినట్లయింది. అతనితో తనకు గల అనుబంధం అంత క్షణాలమీద మర్చిపోవగినంతటిదా? తన హైజం అందుకు వప్పుకుంటుందా? లేక అతడు తనను వొరగబెట్టేదేమిటి? ఏమైనా అయివుండొచ్చు, అతడు అబద్ధం ఆడడని కాదూ తన విశ్వాసం? కావచ్చు, తన భవిష్యత్తునుగూర్చి యేమైనా వాగ్దానం చెయ్యగలిగాడా? లేకపోతే యింతటితో మనసు రాయి చేసుకోవలసిందేనా?— తను అలా యెన్నటికీ చెయ్యలేదు. ఈ అల్లకల్లోలంలో అయోమయమైపోకుండా నిలువగల్గింది అతణ్ణి గురించిన తలంపు ఒక్కటే. అందులో పాల్గొన్నప్పుడే యిక్కడ వుండే రెన్నాళ్ళయినా ఒక మనిషిగా మెసులుకోగలదు—

—గబగబా తలుపువేసి బజారుకి బయల్దేరింది; అతడికేం కొనాలా అని ఆలోచించుచుతూ—ఆ పాత షాపులోకి వెళ్లకూడదు. వాళ్ళేదో తనవంక విచిత్రంగా వింతగామాస్తారు. కాకపోయి నా లాగులకు చొక్కాలకు గుడ్డలు కావాలని కోరితే యెవరలా చూడరు? ఈ వెధవప్రపంచం తీరే అంత. తనుకునచ్చిన చీరలుకొనే స్వాతంత్ర్యం వారికి వున్నప్పుడు, తనుమాత్రం నచ్చిన లాగుగుడ్డ కొనుక్కొ రాకూడదూ?—అయినా వారి సంకుచితాభిప్రాయాలతో తనకేమిటి లెక్క? అతడికి తెలుపు ఇష్టమని తెలుసు, అతడి స్వభావం ప్రతిబింబించేదికూడా అదేనని తన విశ్వాసం. ఇరవైయైదు రూపాయిలు ఓట్లు చెల్లించి, బైటపడి గబగబా నడిచి యింటికొచ్చింది—

—ఇవాళ యెందుకనో అతన్ని విడిచివున్న ప్రతిక్షణమూ తనలో వొకవిధమైన వేదన కలిగించుతోంది. అతడు క్షణాలమీద యిక్కడకువచ్చి వాలితే బాగుండుననిపించుతుంది. అయినా తన కున్న ఆదుర్దా అతని కెందుకుంటుంది? సాధ్యమైనంతవరకూ అతడు తననించి దూరమై పోవడానికే ప్రయత్నించుచున్నాడు. లేనిపోని మమకారం బయటపెట్టి తనను మభ్యపెట్టి మరిపించాలని చూస్తున్నాడా? రాత్రినించీ అతడి ప్రవర్తన అలాగే వున్నట్టు పసికట్టగల్గినా మొహం యెదట ఏమీ అనలేక, అనే ధైర్యంకూడా చాలక, పెదవులపైకి వచ్చినమాటనే దిగమింగుకుని లోలోపల యేదో సమాధానం పలుక్కొని వూరుకున్నది. కాని అతడలా చేయగలడా? ఏమో...ఎవరికి యెరుక? తను స్త్రీ, అతను పురుషుడు.

ఇంతలో హఠాత్తుగా జ్ఞాపకం వచ్చిందామెకు అతడు పొద్దున్న చెప్పినసంగతి - ఏడుపొచ్చినంత పనైంది. గుండె దడదడా కొట్టుకుంది. మంచంపైన చాపచుట్టలా పడింది. తనకు ఆవేదన హెచ్చినకొలదీ క్షణాలు భల్లగా దొర్లుతున్నయ్, గడియారం అటుకేసి తిప్పి గుండె దిగులుతో కుర్చీలో కూలపడి నడుంవాల్చింది.

ఎంతో సేపు మైమరచి నిద్రపోదామని చేసిన ప్రయత్నం విఫలమయ్యింది. అయినా కళ్లుమూసుకునే పడుకున్నది. అర్థం కాక గడియారం ఇటుతిప్పి చూసుకున్నది. తొమ్మిదిన్నర కూడా అయిన నిమిషాలు తక్కువ - వీధిసద్దుమణిగింది. అయినా అతను వచ్చేజాడ తెలియడంలేదు. కాలం గడిచిందని గ్రహించుకునే సరికి ఆకలి పేగులు గుర్రు మన్నాయ్. ఇప్పుడు తనేమీ చేసుకు తినగల స్థితిలోలేదు. కాకే అయినా పెట్టుకుంటే బాగుండును, అనుకున్నది, వెంటనే లేచింది మాటోకసంచు నెచ్చినా పై బాగుంటుందేమో అని. బట్టలు మార్చుకుని అద్దంలో మొహం చూసుకుంటే కళే లేదు; డోక్కుపోయినట్టుంది. బుగ్గమీద చేత్తో రాసుకుంటూ 'తను అందవికారి నా' అనుకుంది. కాదని హృదయం వత్తాసు పలికింది. తన కెప్పుడూ అందాన్ని గురించిన ఆలోచనే రాలేదు. ఒకరికి అందమైనదిగా కనబడాలని ప్రయత్నించలేదు కూడా. రాధ అన్నాడు, నీలాంటి చెలువంగల చెలికత్తె ప్రక్కన వుంటే తలెత్తుకు తిరగగల'నని. అది అతని హృదయాంతరాళంనుంచి వచ్చిన మాటేనా? తనను సన్నిహితురాల్ని చేసుకోవడానికి వేసిన యెత్తా? అతని మెప్పుకోలు తనని ఉన్నతస్థాయికి తీసుకుపోయిందా మానసికంగా? అదే తన జీవిత చరమ లక్ష్యమా?—అతి చింత హృదయం లేకుండా అనిపించగా డా? అయినా అతను తన కేమిటి? ఈ ప్రశ్న తిరిగి రావడంతో గిజాటుగా కణతలు వేళ్ళతో నొక్కుకుంటూ వాలిపోయింది.—

వో క్రమాలకి తలుపుతడుతున్న చప్పుడయింది. మారు పలకక పలికే వోపిక లేక కొన్ని క్షణాలపాటు కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయింది. అతను తన పరిస్థితి ఊహించిన వాడిలా తలుపు తట్టడం మాని పేరుపెట్టి గంభీరంగా పిలుస్తున్నాడు. ఆ స్వరం చెవుల బడడంతో అంతకుముందటి ఆలోచనలు వెనకబడి ఒక నూతనోత్సాహం పొంగివచ్చినట్లయింది—అది ఆమెలోని మానసిక బలహీనతా, అమాయికత్వమా? నిర్ణయించుకోలేక చివాల్న లేచివచ్చి గడియ సడలించింది. అతను నేరుగా వచ్చి చేతులోవున్న పొట్లాలు బల్లపై పెట్టి కుర్చీలో కూర్చుంటూ "వంటచేశావా?" అని అడిగాడు. 'చేశానని చెబితే!'—అతనియెదుట తను అబద్ధమాడలేదు. ఒకవేళ అలాంటి పొరపాటు జరిగినా మొహంమీంచి కళ్ళల్లోకి చూసి అంతర్యాలు చదువుకు నేపాటి తీక్ష్ణదృష్టి అతనిది. 'లేదు' అని చెప్పేసింది సుందరి.

'ఆ పొట్లాలిలా యిచ్చి స్టూలు దగ్గిరకు లాక్కో' అని చేయి చాచాడు రాధ.

'నాకు 'ట్రాన్స్ఫర్ మెమో' ఇచ్చారు, ఇవ్వాళనించే ట్రాన్సిట్' ఈ అశుభాన్ని తన నోటితో ఉచ్చరించే శక్తి లేదన్నట్టు వణుకుతున్న కంఠంతో అన్నది సుందరి అతడి చేతికి పొట్లాలు అందిస్తూ.

"తెలిసే ఇప్పుడు వచ్చాను, ఇక్కడ యేం గొడవ పడుతున్నావో అని. ఆవేశం జాస్తి నీకు, కోపపోయినా, మళ్ళీ చంటి పాపవీ కావు." రాధ పొట్లాలు విప్పి పదార్థాలు సగం పంచి వేశాడు, తిరిగి యిలా అందుకున్నాడు—

"కాని, ఎప్పుడో—పెళ్ళైనాటే—లంఖణం చెయ్యకూడదని. కడుపు కాల్చుకుని సాధించగలిగింది యేమీ తక్కువ అంటూ వొక్క మాటా బిడ్డా వొదలకుండా కోప్పడింది గాదు.—

అతడన్న ఆ మాటతో ఓర్పు సాహసంతో లేనిపట్లయిందామెకు. అతను యింతో రత్నంలో యిలా యెందుకు మాటతెచ్చేట్లు ఇచే కష్టాలకి వస్తుంటాం? ఈ వొక్క మాట ఉన్న తనను పేరిండిదానికే యిప్పుడు ఆదరాబదరా పరుగెత్తుకు వచ్చాడా? ఈ అవస్థలా అడిగే ఆ మాట తనపై యెంతటి నిప్పుల గాడ్పులు విసురుతుందో ఊహించుకోలేకనే అన్నాడా? తెలిసీ తెలిసీ యెందు కింత దారుణం తలపెట్టినట్టు? ఈ మాటతో తనయెడల అతని కర్తవ్యం, బాధ్యత ముగిసిపోయినట్టే భావించి అంటున్నాడా?—ఆకలి సెగలకు తోడి ఆలోచనల పొగలు మరింత కమ్ముకుని గజిబిజి చేస్తుంటే ఆమె యేమీ తోచక ఏమీ అనలేక అతని వంక తదేకంగా చూస్తూ వుండిపోయింది. "మంచినీళ్లు" అన్న అతని పిలుపుతో ఉలిక్కిపడి అక్కణ్ణించి లేచి నడిచింది.

"పోనీ అతడే తనని పెళ్లి...చేసుకోకూడదూ? అందుకు తను సిద్ధమేనా? అతని అంతస్తుకు తను తగదా? అంతస్తు! ఎవరి తాహతు ఎవరు నిర్ణయించగలరు? హృదయంలేని స్వార్థపరత్వాన్నే అసలు సట్టుకు పాకులాడుతున్నాడా యిన్నాళ్లూ! తన యెడల ఆత్మీయతను ప్రకటించి యెన్నిసార్లు కొండెక్కించలేదు?— మంచినీళ్ల గ్లాసు బల్లపై పెడుతూవుండగా అనిశ్చితత్వం ఆట్టేసేపు భరించలేనన్న, అతడి మాటలు స్ఫురణకువచ్చి, కళవళంగా వోణికిపోవడంతో వేళ్లు పట్టుతప్పి గ్లాసు చెయిజారి కిందపడిపోయింది. అతను తలెత్తి సూటిగా ఆమె మొహంలోకి చూశాను; అన్నాడు.

"అనుకుంటూనే వున్నా" అంత పని చేస్తావని, ఏదో అనుకుని మరేదో చెయ్యబోవడం తెలివితక్కువ. తాత్కాలిక ఉద్రేకాలకు లొంగిపోతే ఆశించిన ఫలితం అందక పోగా పర్యవసానం భయావహంగా వుంటుందని తెలియదూ? అది గ్రహింపజేయడానికే యిన్నాళ్లూ పాటుపడ్డాను. కొత్త బాధలు వచ్చిపడుతున్నప్పుడు వాటిని తట్టుకోవడానికి కావలసిన గుండె నిబ్బరం పరిస్థితులే చేకూరుస్తూ వుంటయ్. ఆ ధైర్యంతోనే, నేనూ లాక్కొస్తున్నాను. అపాటి గుండె దిటవులేనివాళ్లకి, భవిష్యత్తు అయోమయంగా వుంటుంది. ఎంతవరకూ దక్కినదే చాలునన్న తృప్తిలో వున్నవాళ్లకు ఏ బాధా వుండదు. నాలుగు లడ్డూలు తిని నీళ్లుతాగి ఆకలి దల్లార్చుకో! అన్నీ తీరుబడిగా ఆలోచించుకోవచ్చు, అర్థంలేని ఆరాటాలకు పోయి మనసు పాడుచేసుకోవడం మంచిది కాదు." అంటూ అక్కణ్ణించి లేచివెళ్లి గడియారం బల్లమీద పెట్టివున్న పొట్లాం యేమిటో అని విప్పి చూడబోతున్నాడు.— "నీ వేదాంతాలు నాకేవీ అక్కర్లేదు" అన్నది సుందరి; నిరుత్సాహం వెలువరించిన ఆవేశం గుండెల్లో గుబులుగా రగిలిస్తూ వుంటే—

అతడన్ని విషయాలలాగే ఆ మాటలనూ గాఢంగా తీసుకోక చులాగ్గా సమాధానం చెప్పాడు. "అర్థం కాని మాటలన్నీ వేదాంతాలే అనుకుంటారు చాలామంది. నిజానికి వేదాంతం చెప్పే

# నన్నయ రచనలోని యతిప్రాసములు

శ్రీ రాప్తూరి దొరస్వామిశర్మ

వళిప్రాసములు తెలుఁగు కవితకనాదిగా నేర్పడిన విశిష్టాలంకార విన్యాసములు; మిగుల మిక్కిలి తెలుఁగు శబ్దరూప నిర్ణయమునకును వ్యాకరణమునకును మూలాధారములగుట గోవిగుల కెల్లఁ దెల్లంబు. నన్నయ యాదికవి, వాగనుశాసనుఁడు. అతని ప్రయోగములే తరువాతి కవులకు శిరణ్యములు. వ్యాకర్తలకు ఛందస్కర్తలకు భారతరచనయే ప్రమాణము. అతని భారత భాగములోని ఛందోవ్యాకరణ విశేషములు సమగ్రముగాఁ బ్రదర్శింపఁబూనుట విద్వాంసుల ముఖ్యకర్తవ్యము. ప్రస్తుతము నన్నయ రచనలో నా దృష్టికి గోచరించిన కతిపయ యతిప్రాస విశేషముల నీ వ్యాసములోఁ దెలుపఁదలఁచితి.

ఇందుఁ బ్రధానముగాఁ దెలియఁదగు విషయ మొకటి గలదు.

కవిత్రయ భారత పద్యములకుఁ బాఠాంతరములు పెక్కులు పరస్పర విరుద్ధములై పొడకట్టుచున్నవి. ఆ పాఠభేదముల నెల్ల సప్రమాణముగా సమన్వయించి ప్రకటించిననేకాని భారతము నాధారము చేసికొని ఛందోవ్యాకరణముల రచించుట సాధ్యముగాదని నా తలంపు. లక్షణగ్రంథములలో భారత పద్యములు భిన్నభిన్న పాఠములతో నాయాలాక్షణిక మతానుసార ముదాహృతములై యున్నవి. ఇట్లుండుటచే నే పాఠము గ్రాహ్యమో యేది యగ్రాహ్యమో తెలియుట కష్టము. ఉపలబ్ధ ముద్రిత లిఖితప్రతులను లక్షణ గ్రంథోదాహృతులను సంప్రతించి కవిత్రయ భారతమును బ్రకటించుట యాంధ్ర భాషోద్ధారకుల ప్రధాన కర్తవ్యమని నా మనవి.

ఇఁకఁ బ్రకృతమునకు వచ్చెదను. వావిళ్ళవారి భారత ప్రతి ననుసరించియు నుపలబ్ధ లక్షణ గ్రంథములఁ బరికించియు నన్నయ భట్టారకుఁడు వాడిన యతిప్రాస విశేషములఁ బ్రదర్శించెద.

## యతి భేదములు :

(1) స్వర యతి:— ఇది ప్రసిద్ధముగాన లక్ష్యములు చూప లేదు.

(2) ఋవళి— ఋ - రి - రీ - రె - రే లు మిత్రములు.

ఋత్విజుం డని విచా+రించి పూజించితే (సభా-2-11)

(ఈ లక్ష్యమును జూపిన లక్షణగ్రంథములు—అప్పకవీయము, కవిజన సంజీవని, సర్వలక్షణసార సంగ్రహము, లక్షణ శిరోమణి.)

(3) ఋత్వసంబంధవళి —ఋత్వ ముదుపు డికి ఇ-ఈ-ఎ-ఏ లతో మైత్రి. మహ్యాక్కర—ఇందుండు మీవని కృష్ణమృగచర్మ+కృత కుశాసనము. (ఆరణ్య 8-97. నన్నయ యనుకొను నిది 4-వ గణ ముపైయతి)

(4) ఌ కారవళి:— ఈవళిభేదము ననంతామాత్యుఁ డొక్కఁడే చెప్పెను. ఇక్కడ ఛందస్కర్తలు తెలుపలేదు. 'ఇది గది వినపెమ్మఁట ముఖే, యెదమేరియుఁ జగువుబుద్ధి యేలాలో చనుక్, పవనది గ్రంథములన్నియు, నెటి వివి సారమెల్ల వివరింపంగా' అని కృత్యాదిలోఁ బ్రతిజ్ఞగావించిన యప్పకవియే యీ యతి విశేషము స్పృశింపకుండుట వింతయాయి కానంబడియెడి.

అనంతుఁడు 'కౢప్తితేగు నారిగరావ+ళికి నాంగ (1-89)' అను పాద ముదహరించి 'ఌ-ళి' యతిమైత్రిని జూపెను. కాని యందులకుఁ బ్రయోగాంతరములు మృగ్యములు.

నన్నయ 'కృతపీఠ్యా ఘనమెల్లఁ+గౢప్తి సేసి ఆది-7-133)' అను పద్యపాదమున 'కృ-కౢ' లకు యతిమైత్రి ఘటించియున్నాఁడు. ఈ భట్టారకప్రయోగమును లక్షణకారు లుపలక్షించినట్లు లేదు. నన్నయప్రయోగము నిలకించియే కాబోలు శ్రీనాథుఁడు కాశీఖండములో 'ఘృతపయోరాశి సం+కౢప్తావధిక మైన' అనుచోట (5-281) ఌవళిం గూర్చెను. ఈ ఌవళింగూర్చిన విశేషము లన్నింటిని నా 'ఌకారయతి' యను వ్యాసమునఁ బ్రదర్శించియున్నాను. (చూ. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక—జయ—౮ సంచిక)

(5) వర్గయతి—స్పష్టము.

(6) మువిభక్తియతి (పోలికవడి)

విభక్తి ముకారముతో — పు-ఫు-బు-భు-లకు మైత్రి—

పొడిచియు వివిధాస్త్ర శస్త్ర+ముల నుద్ధతులై (ఆది-2-95)

బోరనఁ దానగ్ని సూక్త+ములలో నెసఁగెన్ (ఆది-2-89)

భువనంబులయందు సర్ప+ములు ద్రిమ్మరుటన్ (ఆది-2-118)

ఎట్టి విశిష్టకులంబునఁ, బుట్టియు సదసద్వివేక+ములు గల్గియు (ఆది-5-58)

భూనుతధాన్యంబు బీజ+ములు వణిజులకున్ (సభా-1-44)

గమనిక:— కేవల ముకారయతి కిందుఁ బ్రయోగము గానరాదు.

(7) భిన్నయతి—ధరించు, పోషించు, ఉపమించు— ఇత్యాదులగు ఇంచు గాగమ యుక్త క్రియలందు వ్యంజనమునకే కాక స్వరమాత్రమునకును యతిమైత్రి గూర్పనగును. అప్పకవి యీ స్థలములందు వ్యంజనమైత్రి యొక్కటే యాశించెను. స్వరమైత్రి యుండరాదని కిద్దముగాదు. నన్నయ స్వర మైత్రి పాటించినందులకీ క్రింది పద్యపాదముఁ దిలకింపుఁడు—

'సందియం, దీనికాలేయు కాంతి సుప + మింపఁగ (ఆది-5-151) (సందియంబు + ఈ దినుసేయు—ఉప + మించు)

(8) ఎక్కటియతి—(ఏకతరయతి)

నన్నయరచనలో 'ఋ, ర, ఱ' అనునవి తమతమకే ప్రత్యేకముగా యతిమైత్రినందు నట్లు గానవచ్చెను. అప్పకవి మతమున శేషద్వయము మాత్రమే యీ యతి పొందవలెను. అనంతామాత్యాదులు మరలవలె నెక్కటి గ్రహించిరి.

(9) అభేదయతి—వ-బ-భ-మ-లు మిత్రములు.

వబయో రభేదః అను సూత్రము ననుసరించి 'వబ'లకు యతి చెల్లును పవర్గమునకుఁ జెందినవి బవర్తముగాను, వఫబభలు నాల్గు వకారముతో నభేదవర్గయతి పేరఁజెల్లునని యప్పకవి అభేద, అభేద వర్గయతులు రెండు చెప్పెను. అనంతామాత్యుడు లభేదయతి యొక్కటే చెప్పి రెంటిని సంగ్రహించిరి. కొందఱు విద్వాంసులు భారతములో నంగు ముఖ్యముగా నన్నయ భాగములో అభేదయతి ప్రయుక్తముగా లేని చెప్పుదురు. అట్టి ప్రయోగములఁ బూర్వలాక్షణికు లుదహరించి యున్నను వానికిఁ బాఠాంతరములు వక్కాణించి సమర్థింతురు. పాఠాంతరములు చెప్పఁబూనినచో నెట్టిదాని నైని మార్చవచ్చు. ఇప్పట్టునఁబూర్వ లాక్షణికోదాహృతుల నెల్లఁద్రోసి రాజనుట సంభావ్యము గాదు.

ఒక్క యుదాహృతి చూచుటకు—

'సుతజల పూరితంబులగు నూతులు నూటికన్న సూనృతవ్రత యొక బావిమేలు మఱి + బావులు నూటికన్న (ఆది-4 94) ఇందు రెండవపాదమున 'వబ'లకు యతి. ఈ యభేదయతి నివారింప నెంచి 'వ్రతయొక వాపిమేలు మఱి + వాపులు' అను పాఠాంతరము చూపుదురు. బావులను సరళపాఠమును మాని యీ వాపుల యస్వరస పాఠభేదమంటఁగట్టనేల? రంగకవియు నప్పకవియు నభేదయతికి యీ పద్యపాదమే యుదహరించిరి.

నన్నయ రచనలోని యభేదయతి ప్రయోగములఁ గొన్ని చూపెద. వేల్పులలోనఁ బెద్దధర్మ + వున్న సత్యమునన్ (ఆది 5-92) వీరుఁడగునరుని యేయు న—పారశరావలుల నడుమ + వారింపంగా (ఆది-7-199-రంగకవి) విదురారసుకట్టి బుద్ధివి + భేద మెన్నఁడు లేదు (ఆది-8-29;-చింతామణి, అప్ప, లక్షణ, సర్వ)

పరమధ్యానో, పరతేంద్రియవృత్తి సున్న + వాని శమీకున్ (ఆది-2-172; అప్ప, సర్వ, చింతా)

పీనోన్నత కుచముఁబోలె + వెలిఁగెనుదానిన్ (అరణ్య-3-292) వ్రతముల దేవపూజలన + పారజపంబుల (అరణ్య-3-78) - లక్షణ. వన లుబ్ధుల ముచ్చులఁగూ, ర్పని వారలఁబగఱవలని + వారలస్మృతి (సభా-1-41) వేణి సరస్వతి + పెన్న యైరావతి(సభా-1-72)

వ, ర్వతము గ్రహించునట్లు తన + బాహులవాని గ్రహించి (అరణ్య-1-311) అప్ప. అ, పారతపోయుక్తులైన + వారికిఁ బడయన్ (అరణ్య-1-371) అప్ప. సర్వ. వెండియుఁ బ్రథమమీఁది పకారము నకు నాదేశము గావచ్చిన వకారమునకుఁ జెక్కడల నభేదయతి మతిన మ్మదితి ప్రతియంగుఁగానవచ్చు, మచ్చునకు—

పరఁగనని మనయందు వీ + డ్వడియెనిన్ను (వీడు + పడుః ఆది-4-228) పుణ్యాపరుల లోకంబులు, వసియుజయస్వర్గ + ఫలము నూనె (ఆది-7-61) భార్యనాశ్రయోఱుం + వటినభర్త (సభా-2-2)80

భవన మెప్పాట నె + ల్వసెంగఁబోలు (ఆది -1-115)

(10) వరసయతి—ప్రసిద్ధము: లక్ష్యములు చూపఁబడవేగు.

(11) సంయుక్తయతి — సంయుక్తాక్షరమున నేదేనొక వ్యంజనమునకు యతిమైత్రి కూర్చుట; ఇదియుఁబ్రసిద్ధము. నన్నయ రచనలో నిందొక విశేషము గానవచ్చెను.

(అ) క్ష—కపలసంయుక్తము. కషలలో నొకదానికి మైత్రి గూర్పనగు. నన్నయ క్షకారములోని కకారమునకే సర్వత్రయతి పెట్టినట్లు గానవచ్చెడు.

చూ:- క్షేత్రమునంబ్రఖ్యాకాశగతి + ఖేలన (ఆది-1-108)

క్షోణీ...ది + కక్కల్, క్షీణోత్సాహ — గీర్వాణ (ఆది - 2-12).

వ, క్షతివాతహతి—శకలా + కారంబు (ఆది-2-92).

ర, క్షారతి—భుజ + గంబుల (ఆది-2-103).

ఈ క్రింది స్థలద్వయమున మాత్రము షకారముతో టి మైత్రి గలదు—చూ—

క్షత్త్రి చరిత్రుఁడై పరఁగు + సత్త్వమునన్ మఱి నీ సవిత్రికిన్ (అరణ్య 3-186)

అనిస్పాచికలో 'గర్వమునన్, గర్భమునన్' అను పాఠాంతరములు గలవు. మఱొక్కటి; క్షమయ శాల్మియుండెఁ + జనదెల్ల ప్రొద్దు (అరణ్య-1-217)

దీనికి పాఠాంతరము గానరాదు.

(ఆ) జ్ఞ—ఇందు చ ఛ జ ఝ శ ష స లతో మైత్రి గూర్పబడి యున్నది.

తప్పుచవ్యాజ విశేషవలి లక్ష్యములు లేవు—అనఁగా న-ణ లతోను క-ఖ-గ-ఘ లతోను మైత్రి గూర్పబడదు.

ఈ త్రిమ, జ్ఞానము...సంహిత (ఆది-1-158)

య, జ్ఞమ్ము...ప్ర + జాపతి (ఆది-2-226)

(12) శంకధ్వాది యతి (పరరూప యతి)

వేదాంత శబ్దమున స్వరమైత్రి పాటింపఁబడినది.

వైరివే, దండె గండ విదారి ఘోరత + రాసి భాసి భుజార్గళా (ఆది-3-228) ఈ పద్యపాద ముదహరించినారు లాక్షణికు లెల్లరు—(చింతా, అప్ప, కవిజన, లక్షణ, సర్వ, రంగ)

(13) ప్రాది యతి—ఇప్పట్టున వ్యంజన మైత్రియే యధికముగాఁ బాటింపఁబడినది; స్వరమైత్రియు లేకపోలేదు.

## వ్యంజన మైత్రి:

ఆదిపర్వము—

శ్రా, ప్ర్రముల—ఉ + దాత్త (1-10)

ఖా, రత్యమరాప గాఘను ని + రంతర (1-73)
మడుఁగ నికిని స + మూఖ్య (1-81)
అ, మ్నాయము—స + మంచిత (1-90)
అ, పేక్షించు—అ + భేద్యుఁడు (1-99)
వ్యపగత—వచ్చు (1-150)
బ్రహ్మర్షి—ఉ + పాసిత (1-28)
మసిపక—స + మర్పణ (2-48)
ఉ, పాయము—పనుపు (2-53)
ని, రాస—రక్షోభయముల్ (2-124)
ప్రారంభ—పాలన (2-240)
ప్రియపత్నులు—అ + భీష్ట (3-88)
అ, భ్యుదితుండై—బుధనుతుఁడు (3-125)
భిములుగా—ప్రాప్త (3-142)
అ, పేత—పెరుఁగుచు (4-9)
స, ముల్లసన—మునివర (4-40)
మీపను—స + మీహిత (4-129)
మహీతల—స + మక్షము; మహీపతి—స-మరిత (6-50)
భారద్వాజ—అ, పాయము (7-15)
పపెయుల—ప్రారంభించె (7-16)
దానికి శివుఁడు ప్ర-త్యక్షమయ్యె (7-36)
అ, త్యంత—ధర్మువు (7-59)
పంచిన—ప్రాణ (7-120)
మాకు—స + మస్త (7-156)
ప్ర, తీక్షించు—న-దీతీరమునఁ (7-266)
తల్లి—ఉ + దాత్త (8-53)
సభాపర్వము:—యు, ద్ధమ్మ—ఉ + దగ్ర (1-162)
తరణి—ఉ + దార (1-241)
ని, రాకృతులు—రాజులు (2-93)
రక్త—ప + రాక్రమ (2-269)
అరణ్య:—అ. పార్థికృత—పరమార్థ (1-28)
మనమున—స + మగ్ర (1-359)
ప్రీతి—అ + భీష్ట (2-320)
దు, ర్మతి—స + మాప్తి (3-258)
అ, భ్యంతర—ప్రతిపక్ష (3-353)
అ, త్యంత—విది + తప్రతాప (3-353)
స్వరమైత్రిగల పట్టులు:—

మధురాక్కర (ఆది-4-49) దినికి 4-వ గణము ప్రథమాక్షరముయతి అనఘ,యుప నేత,మఱియు ని + రంతరా, ధ్యాపకుండు

(1 సూర్య - 3 ఇంద్ర - 1 చంద్రగణములు)
ని, రర్థకంబమావె - యవనిమీఁద (ఆది-8-31)
ఆ విపినాంతరంబున ని + రంతరనిష్ఠ (సభ-1-188)
అతుల—ని + రంతర (అరణ్య-4-65)
ని, రాగసుండ—సద్గు—ణాన్వితుండ (సభ-1-186)
అప్రమాణమును దు + రాత్మకులకు (అరణ్య-1-282)

అను వివేకమని యు + పార్థకంబున (అరణ్య-4-128)
కంగు—ఉ + పెంద్రి (ఆది—8-215)
(14) నిత్యసమాసయతి—ఉపేయయతి

ఆదిపర్వము:—నా, రాయణునట్లు వాసిగ న + రామర వంశ విభూషణుండు నారాయణునట్లు రాజ్యము ను + కంధరుండున్ (1-25)

ఇందు మొదట స్వరమైత్రి రెంటవ్యంజనమైత్రి (అప్ప, సర్వ)
రఘునాల్—నా + రాయణు (హరిశ్చ్రి-2-22)
నా, సోదర...హరివ + మహోగ్ర (స్వరము-1-125)
సత్యవిశ్వసుఁడు వి + శ్వామిత్రుఁ డతి (వ్యంజనము-4-36) సర్వ.
శమహీసుఁడైన వి + శ్వామిత్రు (వ్యంజనము-7-95)
ఉన్న వీరుందు వృ + కోదరుందు (స్వర-7-195)
ద్వారములన్ మహారుధిర + ధారలు (వ్యంజన-6-305)
సాంగంబులగుచుండ + సకలవేదంబులు (వ్యంజన-4-169) సర్వ.
తనియఁగ—జామ + దగ్న్యుఁడు (వ్యంజన-5-197)
(జమత్ + అగ్ని—జమదగ్ని—అవిశేషము)
క్రాలుచునుండెనే + కాంతయోగ (వ్యంజన-3-319) సర్వ
కామభోగములకు సదే + కాంతగృహము (వ్యంజన-8-74)
(అప్ప—రంగ—కవిజన—లక్షణ—సర్వ)
సభాపర్వము:—అవివేక—దా + శార్హుండు (స్వర-2-8)
దా, మోదర...యుక్తము (స్వర; 2-18)

అరణ్యపర్వము:— సాంబుఁడాయుమను చుఁ + జారుదేష్ణుం డల్లి (అరణ్య-1-159) సర్వ.

పా, రావారరవంబుఁబోలె + ననివార్యములై (అరణ్య-2-56)
దారుణ పరసువున జామ + దగ్న్యులకు (2-262)
జననియుఁ బేర్మి + శార్ఙరాజ (2-151)

దశ + ఋణ - దశార్ణ (ప్రవత్సరకంబల వసనార్ణ దశానామృణే - వార్తికము) ఋకారమునకింగువృద్ధి 'అర్' వర్ణమాదేశము. పైదరణమున వ్యంజన మైత్రి.

శరాసన బాణాసన ప్రభృతి శబ్దములకు స్వరమైత్రియే పాటింపఁబడియె.

బాణాసన—మహాభుజ (ఆది-5-47)
శరాసన—అసలు (ఆది-5-212)

(15) నఞ్ సమాసయతి.

అనంత, అనేక - ఇత్యాది నఞ్సమాసస్థలములందు స్వరమైత్రియే పాటించినాఁడు నన్నయ. అప్పకవి యీ యతిభేదమును నిత్యసమాసయతి యందే చేర్చెను; ప్రత్యేకముగాఁ జెప్పలేదు. కూచిమంచి తిమ్మకవి దీనిని యతిభేదములలోఁ బృథక్కుగా గ్రహించి యుభయయతి ప్రయోగములఁ జూపెను. (చూ. సర్వలక్షణసారసంగ్రహము. 2-అ)-132-134 పుటలు. స్వరమైత్రి కుదాహృతులుగొన్ని.

ఆది:— ఆశ్రిత—అనంత (1-6); అనల్ప—అర్పి(2-94),

ఆపన్నగముఖ్యులఁడక, పీఁపన (ఆది-2-45) అప్ప, రంగ, శర్వ,

ఇదిగాక, తీఁగియురెయ్యిల...ప్ర, నాన్నగపూగ—అనుపద్య మప్పకవి యాదిపర్వములోనిదిగా నిచ్చెను (అప్ప-3-307) కాని భారతములో నీపద్యము గానరాదు.

పీఁకదటేఁగి కొంది + కీసులైరి (ఆది-2-100)

(3) సంయుతాసంయుతప్రాస—

క్షత్రియవంశ్యులై...రామమాం

ధాతృ రఘుక్షితీసలు (ఆది-2-177)

అప్పకవి దీని నుదహరించె. భారతప్రతిలోను కొందఱు విద్వాంసుల మతమునను 'రామమాంధాతరఘుక్షితీస' లను పాఠము గలదు. 'ఆనఙ్పుతో ద్వంద్వే' అను పాణినీయముంబట్టియు, దాని ననువర్తించు 'ఉర్ద్వంద్వేరః' అను నన్నయభట్టీయమునుబట్టియు, 'రామమాంధాతృ రఘుక్షితీశ' అను పాఠమే యుక్తమని తోఁచెను. దీనివిమర్శకు వ్యాకరణగ్రంథములం దిలకించునది.

(4) వికల్పప్రాస — మానవభుక్ + నివహ — భుఙ్నివహ, వికల్పసంధి.

అగ్నిహోతిఁజేసి మానవ

భుగ్నివహము మరణబాధఁ బొందించుచు (ఆది-7-153) సర్వ.

(5) ఉభయప్రాస—నణలమైత్రి (ఆదేశణకారమునకు నకారమునకు మైత్రి) ఈక్రిందిపట్టులయందుఁ గేవల నకార ణకారములకుఁ బ్రాసగాననగు. దుర్నయమున శకుని + కర్ణదుశ్శాసనుల్ (ఆది 3)

ఇందుఁ గొందఱు 'దుర్ణయమున' అని పఠింతురు. భారత ప్రతిలో నట్లే ముద్రితము. 'దురష్టత్వణత్వయోః ప్రతిషేధో వక్తవ్యః' అను శాసనమునను సరించి దుర్నయరూపమే సాధువనఁ జెల్లు.

ఈక్రింది యుదాహృతి మాడుఁడు:—

దుర్నిమిత్తముల్ పుట్టిన + నిర్ణయించి (అరణ్య-1-49)

ఇందు నిర్ణయించుటలో (నిర్ + నయ)ణత్వము సాధ్యము గాన నీప్రాసలాక్షణిక సమ్మతి మెయగు.

(6) అనునాసికప్రాస—

ద్రుతమునకు నుకారంబు పరంబగుచో మకారంబగు. ఇట్టి యాదేశము ప్రాసస్థలములందుఁ గనఁబడుచున్నది. (చూ. ప్రౌఢవ్యా సంధి 22)

కమ్మని లతాంతముల + కుమ్మొనసి (ఆది-5-188; లతాంతములకున్ + మొనసి - అని విభాగము) రంగ.

ఇమ్మగ సర్వలోక జను...వం, దుమ్మున్నని (ఆది-1-77).

అమ్మనిసె...వృష్టిఁజే, సెమ్మహానదులున్ (అరణ్య-3-113) రంగ. అప్పకవి యీ ప్రాసభేదమునకు స్వీయలక్ష్యములిచ్చెఁగాని నన్నయ ప్రయోగ మొక్కటి చూపఁడయ్యె.

(7) ఇమ్మగ...రం, స్వ్యంజనగుచ్ - అను పాఠము పై పద్యమున కుండుటచే (సవ్య - లోఁ జూపఁబడినది) 'మ్మ - ంవ'లకుఁ బ్రాసమైత్రి యేర్పడె యప్పకవి చెప్పిన ప్రాసమైత్రి ప్రాసమునకు.

(8) స్వవర్గజ ప్రాస—(వర్గలు).

కాపిన కిట్టిపాటి యపకారము తెమలఁ జేక వి...సంబోధ చేసి చేసె (ఆది-1-125) రంగ, అప్ప.

ఈ ఫ లకుఁ బ్రాసమైత్రి ముద్రిత ప్రతిలోఁ గన్పట్టదు.

వినె క్షోహిణులెన్న..., రూఢికిన్.

వేదుక—రూఢిగ (ఆది-8-156).

పై రెండుచోట్ల రూఢిశబ్దము వ్యస్తముగా నున్నది. రూఢికిఁ దప్పనగు రూఢియందు గ్రాహ్యమగునేని ఈ ఫ ప్రా...య...కరింపఁ బనిలేదు.

(9) ఋ ప్రాస—(ఋ - ర)

గాంవమున నిచ్చి—యా ఋషితోడఁ బుత్తెంచె (ఆది-7-87)

ఆ ఋషికుమారు కట్టిన, చీరలు (అరణ్య-3-104) అప్ప, సర్వ, రంగ.

(10) అభేదప్రాస—(ల-ళ లు)

ప్రల్లదుఁడైన—త్రెళ్లఁగ (ఆది-1-126)

ప్రల్లద మేది—త్రెళ్లుడు (సభ-2-69)

(11) సంధిగత ప్రాస—

సుందరీఁ బాంచాలేంద్ర సు

తం దోడ్కొనిరమ్మ (సభ-2-211)

లయగ్రాహి - కంపశీత పుష్పమక - రంప రసముం దబలు - చుంబనము సౌరభము - నొంది (ఆది-5-139).

కిందము శాపము డెందము, నందలఁసల్ (ఆది-5-142)

ఇంక నిట్టివి పరిశీలించిన మఱికొన్ని విశేషములును గోచరింపవచ్చును.

నన్నయ కృత్యంతరములు:—

లక్షణసారమను ఛందమును, ఇంద్రవిజయమును, రాఘవాభ్యుదయమను కావ్యముల నయితము నన్నయ రచించినట్లు లక్షణ గ్రంథోదాహృతులవలనఁ దెలియనగుచున్నది. కస్తూరి రంగకవి లక్షణ సారేంద్రనిజయములనుండి పద్యముల నుదహరించె.

లక్షణసారమున 27 యతిభేదములు చెప్పఁబడెనని 'స్వరవర్గ ప్లుతముల్...ఇర్వదేడేయతుల్' (ఆనందరంగ-3-13) అను పద్యము వలన దెలియుచున్నది. ఇప్పద్యమే తిక్కనకవి వాఙ్మ్నంగన ఛందములోనిదిగా నొసఁగఁబడి యున్నది. (చూ. తంజావూరి పుస్తకభాండాగారము తెనుఁగు గ్రంథముల కేటలాగు నెం. 703) పై కృతిద్వయమువల్లఁ దెలియవచ్చు యతిప్రాసవిశేషములు—

(1) అర్ధబిందుప్రాస (ఖండాఖండప్రాస) లక్షణసార పద్యము రంగ-3-46)

(2) వర్గప్రాస (థ-ద, ద-ధ)—లక్షణసార పద్యము(3-61)

(3) ఋకారప్రాస (స-ఋలు)

ఆ సరసిజాక్షి...అ, కౌశను, ఇంద్రవిజయము (3-103)

(4) ఊర్ధ్వస్వరయతి లక్షణసారము (3-121)

లక్షణసారములో నిదిగానిచ్చిన 'స్వరము మదపంశ' అను లక్షణము ఛందోదర్పణములో ననంతామాత్యుఁడు వ్రాసిన పద్యముగాఁ గానవచ్చెను (మా. ఛందో-1-85)

(5) వృద్ధియతి—లక్షణసారము (3-148)

(6) ఘుట్ యతి—ఆలాప శ్లోకయయాతి (3-232)

(7) చక్కటియతి—దీనినే మకారయతి యందురు. విభక్తి మకారమున కిది భిన్నము. ఋషుల వినుతులందగ వ్యాసతనుని యనంగ—లక్షణసారము (3-261)

(8) అభేదయతి—(ల-ళ-లు) ఇంద్రవిజయము (3-278) లవయోరభేదయనియెడు,

నెపమున ప ఫ బ భ లు గాకు నిలిచిన — లక్షణసారము (3-285)

(9) ప్రాకృతాదేశయతి—జ్ఞ-న (అప్పకవి తద్భవవ్యాజయతి) లక్షణసారము (3-298)

ఈ పైకృతులు నన్నయకృతములగుటంగూర్చి కవి చరిత్రకారులు శంకించియున్నారు. రంగకవికిఁబూర్వ మెవ్వరీకృతులఁ జెప్పినట్లు లేదు. సకలలక్షణగ్రంథ పరిశీలన గావించిన యప్పకవి యేని లక్షణసారాదుల యస్తిత్వమును సూచింపనైనను లేదు, అముద్రితములుగా గ్రంథాలయములందున్న లక్షణగ్రంథముల నన్నింటిని బరిశీలించినఁగాని లక్షణసారాదుల యస్తిత్వ కర్తృత్వములు నిర్వివాదముగా నిర్ణయింప వలనుపడదు.

కవిత్రయ రచనలలోని ఛందోవిశేషములఁ బర్యాప్తముగాఁ బరిశీలించి యొక ఛందోలక్షణ గ్రంథము రచించుట యాంధ్ర భాషోద్ధారక సంస్థల కర్తవ్యమని మఱొకసారి విన్నవించుచు నీ ప్రసంగము ముగించెద. *

లక్షణ-లక్షణశిరోమణి - పొత్తపి వేంకటరమణకవి (అముద్రితము)

సర్వ - సర్వలక్షణసార సంగ్రహము - కూచిమంచి తిమ్మన

కవిజన - కవిజన సంజీవని - ముద్దరాజు రామన్న.

* సంకేతములు:—అప్ప— అప్పకవీయము, రంగ-రంగరాట్ఛందము, చింతా—కవిచింతామణి-తాతంభట్టు (అముద్రితము)



Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press
No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.

తెలుగుదేశపు వర్తక సోదరులకూ-
సోదర వాణిజ్య సంస్థలకూ - ఆంధ్ర ప్రజలకూ-
'మన్మథ' సం॥ రం॥ తెలుగు ఉగాదికి
నా ప్రమోద భరిత శుభాకాంక్షలు.



శ్రీ నాగవరపు శేషగిరిరావు
అధ్యక్షులు: శ్రీ గౌతమీ వాణిజ్యమండలి,
రాజమండ్రి.

శ్రీ త్రిపురసుందరీ పరదేవతాభ్యాం నమః

# శ్రీ మన్మథనామ సంవత్సర దృగ్గణితీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

## బ్రహ్మశ్రీ శ్రీపతి పినపూర్ణార్య సిద్ధాన్తిసత్పుత్రేణ కృష్ణమూర్తిశాస్త్రిణా ప్రణీతం

విష్ణుశ్శివ విధిరూపం ప్రణవం గ్రంథ శ్లోకం ప్రవదంతి । నమో భగవతే సూర్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే ॥

వేదానాం నాదరూపాణాం బిందురూపాణాం పరస్పరాశ్లిష్టమయీమయాం ।

మంత్రరూపాణాం యంత్రరూపాణాం ప్రకృతిరూపాణాం నానా విశ్వవికృతిమయీం ॥

### గమనిక

ఈ సంవత్సరమున రాజు శుక్రుడు. మంత్రి గురుడు. ౪ కుంచములు వర్షము. సర్వసస్య సముదాయమును ౧౬ వీసములలో ౯ వీసములు పంట ఫలించును. శ్రీకృష్ణుడు పశుపాలకు డగుటచే పశువులు తృణ క్షీరాది సమృద్ధిగలవియగును.

జ్యేష్ఠ బ ౩౦ సో. న పాదత్రయ గ్రాసముగల సూర్యగ్రహణము గల్గును. కార్తిక శు ౧౫ మం. న అంశలాధిక గ్రాసముగల చంద్రగ్రహణముగలుగును. తిరుగ కార్తిక బ ౩౦ బు. న అర్ధాధిక గ్రాస సూర్యగ్రహణమున్ను గలుగును. వైశాఖ శు ౧౨ మం. న యమునా నదీ పుష్కర ప్రవేశము అగును.



గోదావరినది పుష్కర ప్రవేశము దుర్ముఖ నామ సంవత్సరమున గలుగును.

సాయన మానముచే నభోమాస (జ్యేష్ఠ) మధికమైనది. నిరయన మానముచే భాద్రపదమాస మధికము.

### మౌఢ్యములు

శ్రావణ శు ౨ గు. ప్ర॥ శ్రావణ బ ౧౩ మం. వ॥ గురు మౌఢ్యము.

శ్రావణ బ ౩ శ. ప్ర॥ నిజ భాద్ర బ ౫ బు. వ॥ శుక్ర మౌఢ్యము.

| | |
|---|---|
| కల్యాద్యబ్దాః | ౫౦౫౬ |
| శాలివాహన శకః | ౧౮౭౭ |
| ఫసలీసన్ | ౧౩౬౪-౫ |
| హిజరీసన్ | ౧౩౭౪-౫ |
| క్రీస్తు సం. | 1955-56 |

శ్రీః శ్రీః శ్రీః

## ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు 1.

# పంచాంగపద్ధతి ప్రశంస

పంచాంగమంతయు గవర్నమెంటు కాలెండరు రిఫార్మ్స్ కమిటీవారి సూచన ననుసరించి కాలమానము, గంటలలో నీయబడినది. తిథి, నక్షత్రము, దినమానము ఘటికలలో గూడ చూపబడినవి. గంటలు అర్ధరాత్రినుండి చూపబడినవి. అనగా అర్ధరాత్రి 24-0 గంటలు. అటనుండి 1, 2 గంటలుగ కాలమానము. మధ్యాహ్నము 12 గంటలు దాటినపిమ్మట కాలమానము 1-2-3 మొదలగు గంటలు 13, 14, 15 ఈ రీతిగ చూపబడినవి. దీనింబట్టి 8, 9 ఇట్లు 12 గంటలకు లోపుకాలము మధ్యాహ్నమునకు పూర్వమని గ్రహింపవలెను. 1, 2, 3 ఇత్యాదిగంటలు అర్ధరాత్రి దాటిన పిమ్మట యని గ్రహింపవలెను. అనగా ఉదయగంటలకు లోపుగా నున్నచో అర్ధరాత్రానంతరమని తెలియవలయును. ఇది స్పష్టముగ తెలియుటకై 'రా' అను గుర్తుచే రాత్రియని సూచింపబడెను. ఉదయ గంటలకు దాటియున్నచో ఉదయానంతర ముగ తెలిసికొన వలయును. ఆ రోజు సూర్యోదయమునుండి మరునాటి సూర్యోదయము వరకు నున్నచో (పూర్తి) అని వ్రాయబడుచున్నది.

పంచాంగమున వ్రాసిన ప్రకారము ఆకాశమున గనుపించునట్లు చేయుగణితము దృగ్గణితము. ఆ దృగ్గణిత పద్ధతి చేతనే పంచాంగమంతయు చేయబడినది. సూర్యసిద్ధాంతమునుచే నగు పూర్వపద్ధతి తిథ్యాదికమున్ను వేరుగ చూపబడినది. ఇది తెలియుటకై (పూర్వపద్ధతి పంచాంగే) అని పైన వ్రాయబడినది. జాతక ముహూర్తాదులు దృగ్గణితము చేతనే రుజువు నిచ్చుచున్నవి. రామానుజ మధ్వ సంప్రదాయములలోని వైష్ణవులకు 'తిరు నక్షత్రములు పుణ్యదినములు మొదలగునవి పూర్వపద్ధతి పంచాంగమునందే వ్రాయబడినవి. దృగ్గణిత పంచాంగమునందు నిరయన మేషాది (అశ్విన్యాది) వేదాంగ జ్యోతిషాది ప్రామాణ్యముచే చిత్రాసమ్ముఖ స్థితముగ నిశ్చయించి గ్రహింపబడెను. ఈ విషయము భారతదేశమునందు అనేకులగు పంచాంగ కర్తలచే సిద్ధాంతీకరింప బడినది. దృగ్గణిత పద్ధతిలో సాయన మానముచే నగు ఋతుపరిణామమున్ను సూచింపబడినది. వాస్తవముచే ఋతువులు మారినవి. పూర్వకాలమున ఋతువు లెట్లుండెడివో ప్రస్తుతమెట్లు మార్పు చెందినవో ఆ విషయము ఇదివరలో విపులముగ వ్రాయబడెను. ఆ విమర్శనము ననుసరించియే ఋతుపరిణామము సూచింపబడెను.

ప్రస్తుత కాలమున నూతనముగ ఉత్పన్నములగు గ్రహములు నవీనయంత్ర సాహాయ్యముచే గనుగొనబడినవి. అవి 1. యురేనస్, 2. నెప్ట్యూన్, 3. ప్లూటో. యురేనస్సును, వరుణగ్రహమనియు, నెప్ట్యూనును ఇంద్రగ్రహమనియు, ప్లూటోను యమ గ్రహమనియును మనవారు వ్యవహరించుచున్నారు. యు. నె. ప్లూ ఈ అక్షరములచే రాశి చక్రమునందు ఆ గ్రహముల రాశి సంచారము సూచింపబడినది. శ్రీః శ్రీః శ్రీః

## దేశాంతర చక్రము

| పట్టణములు | మేష తులా | వృషభ కన్యా | మిథున సింహ | కర్కాటక | వృశ్చిక మీన | ధనుః కుంభ | మకర |
|---|---|---|---|---|---|---|---|
| శృంగేరి | ౬౫ | ౮౩ | ౮౯ | ౭౧ | ౫౮ | ౫౧ | ౪౯ |
| మైసూరు | ౫౦ | ౬౦ | ౬౭ | ౮౨ | ౪౦ | ౩౨ | ౨౭ |
| బెంగుళూరు | ౪౨ | ౫౧ | ౫౭ | ౬౧ | ౩౩ | ౨౬ | ౨౩ |
| అనంతపురం | ౪౨ | ౪౮ | ౫౧ | ౫౩ | ౩౮ | ౩౩ | ౩౧ |
| కర్నూలు | ౩౮ | ౪౦ | ౪౨ | ౪౩ | ౩౪ | ౩౨ | ౩౧ |
| నెల్లూరు | ౧౮ | ౨౩ | ౨౮ | ౨౯ | ౧౦ | ౮ | ౫ |
| హైదరాబాదు | ౩౨ | ౩౧ | ౩౧ | ౩౦ | ౩౩ | ౩౩ | ౩౪ |
| తంజావూరు | ౨౮ | ౪౦ | ౫౧ | ౫౪ | ౧౪ | ౪ | ౦ |
| కంచి (కామకోటి) | ౨౦ | ౨౯ | ౩౮ | ౩౯ | ౧౧ | ౩ | ౧ |
| వరంగల్లు | ౨౪ | ౨౩ | ౨౩ | ౨౨ | ౨౫ | ౨౫ | ౨౬ |
| బెజవాడ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౪ | ౧౧ | ౧౦ | ౧౦ |
| చెన్నపురి | ౧౫ | ౨౪ | ౩౦ | ౩౩ | ౬ | ౦ | ౩ |
| కుంభకోణం | ౨౩ | ౩౮ | ౪౮ | ౫౧ | ౯ | ౨ | ౫ |
| విజయనగరం | ౧౬ | ౧౭ | ౨౦ | ౨౨ | ౧౪ | ౧౨ | ౧౦ |
| బరంపురం | ౩౦ | ౩౪ | ౩౭ | ౪౦ | ౨౬ | ౨౨ | ౨౦ |
| రంగూన్ | ౧౪౫ | ౧౪౫ | ౧౪౪ | ౧౪౪ | ౧౪౫ | ౧౪౬ | ౧౪౬ |

## రాజమండ్రినుండి స్వగ్రామమునకు మార్పుట

రాజమండ్రినుండి ఆయాపట్టణములకు మేషాదిసాయనమాసములందుగలుగు దేశాంతరవిఘటికలు పైచక్రమునందు గలవు. ఆయా రాశ్యయనప్రవేశము మొదలు ఆయారాశి సాయనమాసము లగుచుండును. పై దేశాంతరవిఘటికలు సాయనమాసారంభమునందగును. స్వగ్రామమునకు సమీపమందున్న పట్టణమునకు అభీష్టసాయనమాసమందగు దేశాంతర విఘటికలను పంచాంగతిథ్యాదులందు నల్లని రేఖకు పైనున్నవాటిని తీసివేయవలెను. క్రిందనున్నవాటిని కలుపవలయును. అట్లుచేయగా స్వగ్రామములకు తిథ్యాదు లగుచున్నవి.

## మేషాది నిరయనరాశి ప్రమాణములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషము | ౪-౨౨ | గం. 1-45 | తుల | ౫-౨౪ | గం. 2 10 |
| వృషభము | ౫- ౧ | గం. 2. 0 | వృశ్చికము | ౫ ౩౫ | గం. 2 14 |
| మిథునము | ౫ ౩౧ | గం. 2 12 | ధనుస్సు | ౫-౩౭ | గం. 2. 7 |
| కర్కాటకము | ౫-౩౧ | గం. 2 13 | మకరము | ౪ ౩౯ | గం. 1 52 |
| సింహము | ౫-౧౮ | గం. 2-7 | కుంభము | ౪- ౭ | గం. 1 3- |
| కన్య | ౫-౧౩ | గం. 2-5 | మీనము | ౪- ౧ | గం. 1 36 |

## మేషాది సాయన రాశి ప్రమాణములు
### (నిరక్ష దేశమునకు)

| | | | |
|---|---|---|---|
| మీన మేషములు | ౪ ౩౯ | కర్కాట ధనుస్సులు | ౫ ౨౨ |
| వృషభ కుంభములు | ౪-౫౯ | సింహ వృశ్చికములు | ౪ ౫౯ |
| మిథున మకరములు | ౫-౨౨ | కన్యా తులలు | ౪-౩౯ |

ఇవి దశమలగ్నానయనమున కావశ్యకములు.

అయనాంశములు భా ౨౩ లి ౧౩ విలి ౦

అయనాంశ గతి విలి ౫౦. ౨

## సంవత్సర ఫలము

| మి | వృ | మే | మీ |
|---|---|---|---|
| సు. కే | ల | కు | ర చం |
| యు | జగల్లగ్నము | | బు |
| ప్లూ | | | శు |
| | శ. నె | | రా |

| మి | వృ | మే | మీ |
|---|---|---|---|
| సు. కే | కు | ర | బు |
| యు | వర్షలగ్నము | | ల. శు |
| ప్లూ | | | |
| | శ నె | | చం-రా |

జగల్లగ్నాధిపతికిని వర్షలగ్నాధిపతికిని భాగ్యస్థితి. కేః సౌభాగ్యమును కూర్చును. కాని జగల్లగ్నాష్టమమున రాహువు లగ్నాధిపతికి యురేనస్ యొక్క దృష్టి. వర్షలగ్నాధిపతికి నెప్ట్యూన్ సంబంధము. వీటిచే ప్రపంచమునకు విశ్రాంతి లేదు. వర్షలగ్న నవస్థానమున నీచ బుధుడు. లాభమున రాహుస్థితి కుజ శని దృష్టి హృదయమున రవి. జగల్లగ్నాధిపతికి రాజ్యస్థితి మాత్రము శుభము. ధనమందున్న గురునకు కేతు సంబంధము. ఈ కారణములచే ప్రపంచమున వ్యాపారము హెచ్చగును. ధనార్జనము క్రౌర్య నైచ్యములతో కూడియుండును. గాని జగల్లగ్నమున భాగ్య రాజ్యాధిపతి శనికి షష్ఠ స్థితి ఉచ్చ. వర్షలగ్న రాజ్యాధ పతికి రాజ్యవీక్షణము. వీటిచే రాజకీయ వ్యాపారములు విరోధముతో కూడియున్నను తీవ్రముగ నుండి అనుకూలములగును. జగల్లగ్న ధర్మ కర్మ స్థానములు శుభ సంబంధము గలవి యైనను వర్షలగ్నమును బట్టి పాపదృష్టి సంబంధములు గలవి యగుటచే వైదిక ధర్మము సత్కర్మలును ఒక్కొకచో వృద్ధిపొందుచున్నను వాటికి విశేషముగ హాని గలుగుచుండును. జగల్లగ్నమును బట్టి భాగ్యరాజ్యాధి పతి యగు శనిః షష్ఠస్థితి యగుటచే రాజ్య సంబంధమై శత్రుబాధ లధికమైననూ వాహనాధిపతికి లాభమందుండుట వర్షలగ్నమును బట్టి రాజ్యాధిపతి రాజ్యమును చూచుట భాగ్యాధిపతికి లాభస్థితి వీటిచే యోగ క్షేమములు (ఇతర రాజ్యములు స్వరాష్ట్రములో చేరుట యోగము. వాటిని చక్కగ పాలించుట క్షేమము) అనుకూలముగ నుండును. సంవత్సర సముదాయమునందు ధాన్యములు గోధుమలు బంగారము లోహములు రత్నములు అనుకూలమైన ధర గలిగియుండునట్లు తోచెడిని. ఆయా మాసములందైన గ్రహస్థితిని బట్టి సర్వ పదార్థములకును ధరలు వేరు వేరుగ ముందు వ్రాయబడి యున్నవి జ్యేష్ఠమాసము మొదలొక్కని ఈ సంవత్సరము ఒక్కొకచో ఎండలు కాయుచున్నను, ఒక్కొకచో మంచి వర్షములు గలుగుచుండును. గాని శ్రావణమాస ప్రారంభమునుండి ఆశ్వయుజ మాసాంతమువరకు కాలసర్పయోగము పిమ్మట శని రాహు యోగము గలుగుటచే సస్యములకు వ్యాధులు గలుగుచుండును. ప్రతి మాసమందును వర్షవిచారమున్ను వేరుగ ముందు చేయబడినది. కార్తికమున పూర్ణిమకు చంద్ర గ్రహణము, అమావాస్యకు సూర్య గ్రహణమున్ను, గలుగుటచే యుద్ధవాయువులు విశేషముగ వీచును. దుర్నీతి హెచ్చగును.

సర్వేషాం సమస్త శుభాని భవన్తు శ్రీః శ్రీః శ్రీః

## సూర్యగ్రహణము

### ది 20 జూన్ 1955 సం.

మన్మథనామ సం॥ జ్యేష్ఠ బ. అమా సో. రే సూర్యగ్రహణం. కేతు గ్రస్తః. కృష్ణ వర్ణః పాదత్రయగ్రాసః $\frac{3}{4}$ సూర్యోదయాదితః

స్పర్శ కాలః ౪-౨౦ ఘం 7 16
మధ్య కాలః ౬-౫౯ ఘం 8-19
శుద్ధ మోక్ష కాలః ౧౦-౭ ఘం 9-35



ఆద్యంత పుణ్యకాలః ౫ ౪౭ ఘం 2-19 దక్షిణగోలః. అపసవ్యగ్రహణం. నైర్ఋతి దిక్స్పర్శః ప్రాగ్దిశి మోక్షః. (ఈగ్రహణము బర్మాకును సిలోనుకును సంపూర్ణ (ఖచ్ఛన్న)ముగ నుండును.

మద్రాసుకు:—స్పర్శ కాలః 8-20 మధ్య కాలః 9-25 మోక్ష కాలః 10 40 ఆద్యంత పుణ్యకాలః 2 20 గ్రాసః6/7

నిత్య భోజన ప్రత్యాబ్ది కాదికము:—మోక్షానంతరము స్నానము చేసి నిత్యభోజన ప్రత్యాబ్ది కాదికము జరిగించవలెను.

## చంద్రగ్రహణము

ది 29 నవంబరు 1955 సం

మన్మథ సం॥ కార్తిక శుక్ల పూర్ణిమా మం. రే చంద్రగ్రహణం. కేతుగ్రస్తః ధూమ్రవర్ణః అంగుళాధిక 1/9 గ్రాసః సూర్యాస్తాది.

స్పర్శ కాలః ౧౧ ౭ ఘం 21-53
మధ్య కాలః ౧౨-౪౦ ఘం 22 30
శుద్ధ మోక్ష కాలః ౧౪-౧౩ ఘం 23-7



ఆద్యంత పుణ్యకాలః ౩-౫ ఘం 1 14 ఉత్తరగోలః. అపసవ్య గ్రహణం దక్షిణాగ్నేయ మధ్యే స్పర్శః. దక్షిణ నిర్ఋతి మధ్యే మోక్షః.

నిత్య భోజన ప్రత్యాబ్దికాదికము:—ఈ గ్రహణ దినమున గలుగు ప్రత్యాబ్ది కాదికమున్ను నిత్య భోజనమున్ను పగలు 12 గంటలకు లోపు కాలమున నాచరింపవలెను.

## సూర్యగ్రహణము

ది 14 డిశంబరు 1955 సం.

మన్మథ సంవత్సర కార్తి బ. అమా బు. రే సూర్యగ్రహణం. రాహుగ్రస్తః అర్ధాధిక $\frac{5}{8}$ గ్రాసః. కృష్ణ వర్ణః సూర్యోదయాదితః

స్పర్శ కాలః ౧౧ ౩౯ ఘం 11-5
మధ్య కాలః ౧౬ ౫౫ ఘం 13-11
శుద్ధ మోక్ష కాలః ౨౧-౪౦ ఘం 15-5



ఆద్యంత పుణ్యకాలః ౧౦ ౧ ఘం 4 0 దక్షిణగోలః అపసవ్య గ్రహణం పశ్చిమనైర్ఋతి మధ్యే స్పర్శః. ప్రాగాగ్నేయ మధ్యే మోక్షః.

మద్రాసుకు:—స్పర్శ కాలః 12-4 మధ్య కాలః 14-1[illegible] శుద్ధ మోక్ష కాలః 16-14 గ్రాసః $\frac{3}{4}$.

నిత్య భోజన ప్రత్యాబ్ది కాదికము:—ఇందును శుద్ధ మోక్షానంతరమే నిత్య భోజనము, ప్రత్యాబ్ది కాదికము జరిగించవలెను.

## ధర్మశాస్త్ర సందేహ విషయములు.

### సింహ గురుదోషము.

ఈ సంవత్సరమున నిజ భాద్రపద శు ౧౫ శ. ప్ర॥ ఫాల్గున శు ౨ బు. ప॥ సింహరాశిలో మఘ యందు గురుడు సంచరించున. కావున ఈ కాలమున శుభకర్మలు చేయరాదు.

### ఉపాకర్మ.

శ్రావణ భాద్రపదములలో గురు శుక్ర మౌఢ్యములు గలుగుటచే నాషాఢ మాసముననే ఉపాకర్మలు నూతనోపనయనమైన వారలకు చేయదగును. ఆషాఢ శు ౧౫ సో. న సామవేదులకు, [illegible] ౧౪ సో. న వాజసనేయులకు. శు ౧౫ మం నత్తైత్తిరీయులకు, బ ౨ బు న ఋగ్వేదులకును నవోపనీతుల కుపాకర్మలు అగును.

### సిద్ధి వినాయక చతుర్థి

పూర్వపద్ధతి పంచాంగమున భాద్ర శు 3 సో ౧౪ ౭ దిన 30-౧౬
౪ మం ౧౬ ౪౪ దిన 30-౧౩

దృగ్గణిత పం. భాద్ర శు 3 సో ౧౪.౪౨ దిన 30-౨౨
౪ మం ౧౪ ౫౫ దిన 30-౧౯

రెండు పద్ధతుల పంచాంగములందును చతుర్థి మధ్యాహ్న కాలమున రెండు రోజులందును గలదు. అందు పరదినమున అధికముగ గలదు. ఐనను సిద్ధి వినాయక చతుర్థికి తృతీయతో గలియుట శ్రేష్ఠము గావున సోమవారమే సిద్ధి వినాయక చతుర్థీ వ్రత మాచరింప దగినది.

### విజయదశమి.

దృగ్గణిత పంచాంగమున సందేహము లేదు.

పూర్వపద్ధతిలో ఆశ్వ శు ౯ మం. ౨౧-౧౫ శ్రవ ౧౦-౩౬ దిన ౨౭-౪౭ శు ౧౦ బు ౨౩-౨౦ ధని ౧౪-౧౭ దిన ౨౭ ౪౬.

విజయదశమి అపరాహ్ణ వ్యాప్తినిబట్టి, అందును ఏకాదశి ముహూర్తవ్యాప్తిని బట్టియు నిర్ణయింప దగినది. ఆ ఏకాదశి ముహూర్తములో మంగళవారమున స్వల్పముగ నున్నను బుధవారమున పూర్తిగ నుండుటచే ఈనాడే విజయదశమి అగును.

### దీపావళి

ఈ ఉత్సవము ఆశ్వ బ. చతుర్దశి మొదలు 3 రోజులు చేయదగినది. కొందరు త్రయోదశి మొదలు 5 రోజులు చేయవలయునని చెప్పిరి. అమావాస్య ముఖ్యదినము ప్రధానమైనది. కొందరు దీనిని నరకాసుర సంబంధమైనదిగ తలచుచున్నారు. అట్లు ప్రమాణము లేదు. నరక చతుర్దశి యను పేరునుబట్టి అట్లు తలంతురు. నరక నివృత్తికై ఇందు అభ్యంగాదికము చేయబడుచుండుటచే నరక చతుర్దశియని గలదు. ఈ అమావాస్యనాడు బలి చక్రవర్తిని వామనుడై యాచించి శ్రీహరి స్వర్గరాజ్యము నింద్రునకిచ్చెను. వారి రాజ్యమునందు వలె ప్రజలుత్సాహముతో చేయు యథేష్ట చేష్టయను ఉత్సవమునకు కౌముద్యుత్సవమని పేరు. ఇదియే దీపావళి యని చెప్పబడినది. ఈ విషయము భవిష్య పురాణమందున్నదని హేమాద్రి (చతుర్వర్గ చింతామణి) యను గ్రంథములో గలదు. ఈ కౌముద్యుత్సవమునకు అపరాహ్ణ సంబంధముచే నిర్ణయించుట శాస్త్రమందు గలదు. గావున అమా సో. న దీపావళి.

### శ్రీ మన్మథనామసంవత్సర పఞ్చాఙ్గ పీఠికా.

అచింత్యావ్యక్త రూపాయ నిర్గుణాయ గుణాత్మనే। సమస్త జగదాధార మూర్తయే బ్రహ్మణేనమః ॥౧॥ లంబోదరాంఘ్రిద్వయమంబుజశ్రీ సర్వస్వహార్యస్వహముచ్ఛ్రయామః॥ యదర్చయా బ్రహ్మముఖామరేశా నిరంతరాయం సఫలీ కృతార్థాః ॥౨॥ ప్రావృట్ఛర న్మేఘనిభా భుజంగశయ్యావిభూషా విహగోక్షవాహా । గోపాల మల్లేశ్వర దేవదేవా భజేప్రియా దత్త హృదర్థదేహా ॥3॥ వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్యద్బిందుమయీం । మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం ॥౪॥

గురుస్తుతిః॥ శ్రీ నోరి వంశాబ్ధి సోమం సూర్యనారాయణాభిధం। జ్యోతి శ్శాస్త్రి కులగురుం ధ్యాయామి మనసాఽనిశం।

శుక్రుడు:— రాజును ధాన్యాధిపతియు నయ్యెను. మరియు రాష్ట్రాధిపతియు వృక్షాధిపతియు స్త్రీనాధిపతియు నయ్యెను.

గురుడు:— మంత్రి యయ్యెను. మరియు సర్వ దేవాద్యోగాధిపతియు, అశ్వాధిపతియు, నయ్యెను.

బుధుడు:— సేనాధిపతియు, అర్ఘాధిపతియు, మేఘాధిపతియు నయ్యెను. మరియు గ్రామపాలకుడును, వైశ్యులకును, పశువులకధిపతియు, నరాధిపతియు, రత్నాధిపతియు, మృగాధిపతియు, స్త్రీలకధిపతియు నయ్యెను.

శని:— సస్యాధిపతియు నీరసాధిపతియు నయ్యెను. మరియు పరీక్షకుడు, దేవాధిపతియు, గ్రామనాయకుడును, జంగమాధిపతియు, నయ్యెను.

చంద్రుడు:— రసాధిపతి యయ్యెను. మరియు గణకుడును, వస్త్రాధిపతియు, సర్పాధిపతియు నయ్యెను.

సూర్యుడు:— పురోహితుడును, గజాధిపతియు, నయ్యెను. కుజున కే యాధిపత్యమున్ను లేదు. (పఠితము)

## రాజు శుక్రుడు, ఫలము

సమృద్ధసస్యా వసుధాతివృష్టి ర్గావోహి సంపూర్ణ పయః ప్రదాస్స్యుః। స్త్రీయః ప్రియాణాంజనయ న్తితోషం ప్రియోపచారైర్భృగు జేబ్దనాథే॥ తా॥ సస్య సమృద్ధి, సువృష్టి, పశువులకు క్షీర సమృద్ధి, దంపతులకు పరస్పర ప్రేమాభివృద్ధియు గలుగును.

## మంత్రి గురుడు, ఫలము

జీవేత్వ మాత్యే బహుధాన్య సంపదః ప్రభూత వర్షాశ్చ భవన్తి మేఘాః। ఫలంతి వృక్షా బహు సస్యవృద్ధి ర్ధరా ప్రజా గోకుల సంకులాస్యాత్॥

తా॥ వర్షములు బాగుగనుండును. ధాన్యములు ఇతరసస్యములు సమృద్ధి యగును. వృక్షజాతులన్నియు ఫలించును. ప్రజావృద్ధి పశువృద్ధియు నగును.

## సేనాధిపతి బుధుడు, ఫలము

వాతా హతా వారిధరాః కదాచిద్వర్షన్తి సస్యాని ఫలాన్వితాని। లోకాస్స్య దాపీడిత కామచారా సైన్యాధిప త్యేఖలు చంద్రజస్య॥

తా॥ బుధ సైన్యాధిపత్యముచే మేఘములు గాలిచే కొట్టబడి ఒక్కొక్కప్పుడు వర్షించును. సస్యములు ఫలించును. ప్రజల స్వేచ్ఛా సంచారమునకు ప్రతిబంధము గలుగును.

## సస్యాధిపతి శని, ఫలము.

మధ్యమ సమస్యంక్షిత తిల మిన తినయే సస్య పేసు రాజ భయం। కోద్రవకుళత్థ చణకై ర్మాషైర్ముద్గైశ్చ పరిపూర్ణం॥

తా॥ శని సస్యాధిపతి యగుటచే ప్రజలకు ప్రభుత్వము వలన భయము గలుగును, సస్యములు మధ్యమముగ నుండును. కొర్రలు ఉలవలు సెనగలు మినుములు పెసలు సమృద్ధిగ నుండును.

## ధాన్యాధిపతి శుక్రుడు, ఫలము.

అతి వృష్టిస్సుభిక్షంచ ఫలితాస్సస్య జాతయః।
మానవా నీరుజస్సర్వే శుక్రే ధాన్యాధి పే సతి॥

తా॥ శుక్రుడు ధాన్యాధిపతి యగుటచే అతివృష్టి, సుభిక్షము, సస్యజాతులు ఫలించును. మానవు లారోగ్యముతో నుందురు.

## అర్ఘాధిపతి బుధుడు, ఫలము.

అర్ఘాధినాథే రజనీ కరాత్మజే వృష్ట్యర్ఘ సస్యాని బహూని చస్యుః। కౌమార పాషండ జనేంద్రజాలికాః ప్రభూత వాస్యాన తథాపరే జనాః॥

తా॥ బుధుడు అర్ఘాధిపతి యగుటచే వర్షములు సస్యములు సమృద్ధము లగును. ధర లనుకూలములగును. బాలబాలికలును మానవులు యువకులును సంతోషముతో నుందురు. ఇతరులు సంతోషహీనులయ్యెదరు.

## మేఘాధిపతి బుధుడు, ఫలము.

గర్జితా శని పాషాణ వాతియుక్తాః పయోధరాః।
మధ్య దేశే మహావర్షం బుధే మేఘాధిపే సతి॥

తా॥ మేఘములకు ఉరుములు పిడుగులు వడగండ్లు గాలి ఇవి హెచ్చుగనుండును. వానలు అల్పము. మధ్యదేశమున మంచి వర్షము గల్గును.

## రసాధిపతి చంద్రుడు, ఫలము.

రససామిని సోమేపు రసాశ్చ ఫలితా స్తదా।
ఆనందమో రాజవర్గో వృష్టిరత్యధికా భవేత్॥

తా॥ ప్రభువులు చక్కగ పాలించెదరు. మంచి వర్షములు గలుగును. రసవస్తువులు సమృద్ధము లగును.

## నీరసాధిపతి శని. ఫలము.

స్వర్ణమణి రత్న మౌక్తిక చందన కర్పూర రజత నాశ స్స్యాత్। రవి తనయే నీరసపే లోహ త్రపు తైల వృద్ధిశ్చ॥

తా॥ వెండి, బంగారము, రత్నములు, ముత్యములు చందనము, హిమతికర్పూరము మొదలగు నీరస వస్తువులు దుర్లభములగును. ఇనుము ఇత్తడి తైలములు వృద్ధి యగును.

## పురోహితాద్యధిపతి ఫలము.

క్రూర గ్రహఫలం క్రూరం శుభ గ్రహఫలం శుభం।
పురోహితాది సర్వేషాం భవేదీశ సముద్భవమ్॥

తా॥ నవనాయకులకంటె భిన్నులగు పురోహితాదులు క్రూర గ్రహములగుచో చెడ్డ ఫలము. శుభగ్రహములగుచో మంచి ఫలము. (ర. కు. శ. పాపయుత బుధుడు క్షీణచంద్రుడును క్రూరులు)

## మేఘాది నిర్ణయము ఫలము.

ద్రోణమను మేఘము—ఎల్లపుడును వర్షములు. తూర్పున మేఘోత్పత్తి। చతుర్మేఘ పక్షమున ఆవర్తమను మేఘము—పడమటి వానలు। ఉద్వహమను వాయువు—సువృష్టి। విద్యుత్తు అను మెఱపు—మధ్యవృష్టి। సౌమ్యమను ఉరుము—అతి వృష్టి। ఉదధి యను సముద్రము—సస్యవృద్ధి। కుళిపమను నాగేంద్రుడు భూమిని వహించును— సర్వ సస్యములకును హాని।

జ్యేష్ఠ బ. చతుర్దశి ఆ. వ (19-5-1955 సం) పావన సంవత్సరారంభము.

వర్షాధిపతౌ భానావాతంకనృపాగ్ని శస్త్రభీతి స్స్యాత్।
వృష్టి స్స్వల్పతరాస్తె మధ్యానిభవన్తి సస్య జాతాని॥

తా॥ రవి పావన వర్షాధిపతి యగుటచే రోగభయము అగ్నిభయము యుద్ధభయము ప్రభుత్వము వలన భయము గలుగును. వర్షములు తక్కువ సస్యములు మధ్యమముగ నుండును.

## పశుపాలకాది నిర్ణయము, ఫలము.

పశుపాలకుడును గోష్ఠ ప్రాపకుడును శ్రీ కృష్ణుడు. గోష్ఠ బహిష్కర్త బలరాముడు. ఫలము. శ్రీ కృష్ణాధిపత్యముచే సుభిక్షము, పశువృద్ధి, సస్యవృద్ధి, పశువులకు క్షీర సమృద్ధియు గలుగును. బలరామాధిపత్యముచే వర్షములు సస్యములు బాగుగ నుండును. గాని మధ్య దేశమున మంచి వానలు గలుగును.

## వర్ష పరిమాణము.

నాలుగు ఆఢక (కుంచ) ములు వర్షము—మధ్యవృష్టి "అష్టౌ భాగాస్సముద్రేషు పర్వతేషు తథానవ। త్రిభాగా భువి పర్జన్య శ్చైవం వర్షతి చ త్రిధా॥" సముద్రములం దెనిమిది భాగములు, పర్వతములందు తొమ్మిది భాగములు, భూమియందు మూడు భాగములు ఇట్లు వర్షించును.

ఆఢక ప్రమాణము:—షష్టియోజన విస్తీర్ణం శత యోజన మున్నతం ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే॥

ఆఢక స్థితి:—సంవత్సరాది మొ॥ ఆశ్వ బ ౧౩ శ. ప॥ గోప వృద్ధుని హస్తమందును, అటనుండి సంవత్సరము తుదివరకు గోపబాలుని హస్తమందును ఆఢక ముండును. గోపుని హస్తమగుచో సుభిక్షము ఆరోగ్యము సంపత్తు గలుగును. బాల్యవయస్సగుచో వర్షములు తక్కువయగును. వృద్ధవయస్సగుచో సుభిక్షముగలుగున.

## వర్షధాన్యాది ప్రమాణములు (వింశోపకములు)

వర్షం ౧౧ ధాన్యం ౧౩ శీతం ౧౧ తృణం ౧౯ ఉష్ణం ౧౩ మారుతః ౭ ప్రజావృ ౧౫ నా ౧౫ రాజవిద్వరం ౧౧. వ్యాధయః ౧౧ ఉపశమనం ౧౫ ఆచారః ౯ అనాచారః ౧౫ మరణాని ౨౧ జన్మాని ౧౩ దేశోపప్లవః ౧౧ దేశస్వాస్థ్యం ౧౯ చోరభయం ౫ నా ౫ అగ్నిభయం ౫ నా ౭ మృగోపద్రవః ౧౩ నా ౭ కీటక భయం ౭ నా ౧౫ శలభవృ ౩ నా ౧౧ మశకవృ ౭ నా ౭ మత్కుణవృ ౧౧ నా ౩ వృశ్చికవృ ౧౧ నా ౧౧ వ్యాఘ్రవృ ౩ నా ౭ సస్యవృ ౮ నా ౯ శుకవృ ౭ నా ౭ పికవృ ౮ నా ౫ కుక్కుటవృ ౮ నా ౮ ఖగవృ ౫ నా ౨ గోవృ ౬ నా ౪ మహిషవృ ౨ నా ౬ మృగవృ ౩ నా ౩ ఛాగవృ ౫ నా ౫ అశ్వవృ ౬ నా ౫ స్వేదజవృ ౧౧ నా ౧౯ క్రిమివృ ౧౮ శాలివృ ౮ కులుత్థవృ ౧౪ తిలవృ ౧౨ మాషవృ ౬ ముద్గవృ ౧౨ సర్షపవృ ౧౦ చణకవృ ౧౬ అధికవృ ౧౦ గోధూమవృ ౧౮ కోద్రవవృ ౧౦ ప్రియంగువృ ౧౬ యావనాళవృ ౧౮ శ్యామాకవృ ౧౨ రాజమాషవృ ౪ నీవారవృ ౧౬ శింబిధాన్యవృ ౧౨

## రవిచార ఫలము.

చైత్ర బ. షష్ఠీ గు. మేషేర్కః ౫౫-౨౪॥ సప్తమి ఈతి బాధల భయము. గురువారము అనుకూలమైన ధరలు మూల నక్షత్రము-శుభము పరిఘయోగ-ద్రవ్యనాశము। విష్టి వృష్టినాశము కుంభ లగ్నము-ధరలు హెచ్చును రాత్రి-సస్యవృద్ధి క్షేమము ఆరోగ్యము సుభిక్షము। మఘాది దశకము విపత్తు।

ఆర్ద్రా ప్రవేశము:—ఆషాఢ శు తృతీయా బు. ఆర్ద్రా ౧ ర్కః॥

తృతీయ-సుభిక్షము। బుధవారము-సుఖము పునర్వసు-అనుకూల ధరలు। వ్యాఘాతము యుద్ధభయము। తైతుల సువృష్టి కర్కాట లగ్నము సుభిక్షము। పూర్వాహ్ణము-జగత్తుకు హాని। దివాభాగము-సస్యహాని ఆర్ద్రాది చతుష్కము ద్వితీయమండలము-అతి వృష్టి। లగ్నకేంద్రమున చంద్ర స్థితి అతివృష్టి ప్రదము:—

## చంద్రచార ఫలము.

జ్యేష్ఠ శుక్ల ప్రతిపత్తు భానువారము:—దుర్భిక్షము, యుద్ధభీతి। రోగభీతి। సస్యములు మధ్యమములగును। ఆషాఢ శు. పంచమి శుక్రవారము:-శుభము। ఆషాఢ శుక్లమున స్వాతి దశమినాడయ్యెను-అతి వృష్టి॥ ఆషాఢ బహుళమున రోహిణితో—ఏకాదశి యగుటచే మధ్యమము। ద్వాదశితో గూడ నుండుట సర్వసస్యహాని.

మరియు వైశాఖమున ౫ శనివారములు ౫ ఆదివారములును, జ్యేష్ఠమున ౫ ఆదివారములు, ఆషాఢమున ౫ మంగళవారములు, నిజ భాద్రపదమున ౫ శనివారములు, ఆశ్వయుజమున ౫ ఆదివారములు, కార్తికమున ౫ మంగళవారములు, పౌషమున ౫ శనివారములు, మాఘమున ౫ ఆదివారములు, ఫాల్గునమున ౫ మంగళవారములును నైనవి.

శనివారము లైదగుచో జననాశము, దుర్భిక్షము, భూకంపము మొదలగు నుపద్రవములు గలుగును ఆదివారము లైదగుచో దుర్భిక్షము మంగళవారము లైదగుచో యుద్ధభయము, గలుగును.

## సౌరార్ఘములు

మేష, వృషభ, మిథున, ధను, ర్మకర మాసములందు—యావనాళయాలకీ కుంకుమ హింగు కాంస్యతైల రండ గోధూమ కస్తూర్యాదులు శూన్యార్ఘములగును। ధాన్యాజ్య చణక వస్త్ర కర్పూర లవణ తామ్రకులుత్థ లవంగపుష్ప సీసాదు లత్యర్ఘములగును సువర్ణ రజత కార్పాస మాష ముద్గమరీచ నాగవల్లీ దళ తిల జీర జాజి పిప్పలి పట్టా వికాయస త్రీగంధ క్రముక శర్కరాదులు సమార్ఘములగును। కర్కాటక కన్యామీన మాసములందు యావనాళాదులు సమార్ఘములు। ధాన్యాదులు శూన్యార్ఘములు। సువర్ణాదులు శూన్యార్ఘములు నగును.

## చాంద్రార్ఘులు

చైత్ర, జ్యేష్ఠ, శ్రావణ, అధిక భాద్రపద, నిజ భాద్రపద, కార్తిక, మార్గశిర, పౌషమాసములందు—యావనాళాదులు శూన్యార్ఘములు। ధాన్యాదు లత్యర్ఘములు। సువర్ణాదులు సమార్ఘములు। వైశాఖ, ఆషాఢ, ఆశ్వయుజ, మాఘమాసములందు—యావనాళాదులు। అత్యర్ఘములు। ధాన్యాదులు సమార్ఘములు। సువర్ణాదులు శూన్యార్ఘములు। ఫాల్గున మాసమున-యావనాళాదులు సమార్ఘములు। ధాన్యాదులు శూన్యార్ఘములు సువర్ణాదు లత్యర్ఘములు నగును.

## మౌఢ్య నిర్ణయము

శ్రావణ శు ద్వితీయా గు. (21-7-55) ప్ర॥ శ్రావణ బ చతుర్దశీ మం. (19-8-55) పర్యంతం గురు మౌఢ్యము. శ్రావణ బ తృతీయా శ (9 8-55) ప్ర॥ నిజ భాద్రపద బ. పంచమీ బు (7-9 55) పర్యంతం శుక్ర మౌఢ్యము.

## మకరసంక్రాంతి పురుషలక్షణము

అష్టకర్ణో విశాలాక్షో లంబభ్రూర్దీర్ఘ నాసికః। అష్టబాహు శ్చతుర్వక్త్రి స్సంక్రాన్తి పురుషస్స్మృతః॥ శతయోజన మున్నత్వం విస్తీర్ణం ద్వాదశస్మృతం। ఏవం రూపంహి విజ్ఞేయం సంక్రాంతి పురుషాకృతేః॥

ఈ మకర సంక్రాన్తి పురుషునకు రాక్షసు డని పేరు చండాలురకరిష్టము। నిర్మలోదకము చేస్నానము-శుభము। పెసలక్షతలు-పెసలకు నాశము। రక్తవర్ణవస్త్రము - యుద్ధభయము। చందనము గంధము - ఆరోగ్యము। జాజిపూవును ధరించును కీర్తి వృద్ధి। నీలమాణిక్యమాభరణము- క్షేమము। రజతపాత్రలో పాయసమాహారము- రజతహాని, దుర్భిక్షము। అరటి పండు - ఆరోగ్యము।



